C

హిందుమత గ్రంథమాల — ప్రథమ కిరణము

# హిందుమతము

## దైవమతము



గ్రంథకర్త : హిందుమత ప్రచారక

**ప్రభాకర ఉమామహేశ్వర పండితులు**

సత్యనారాయణపురం :: విజయవాడ

క్రీస్తుశకం సం. 1963.

శ్రీ మహాగణాధిపతయేనమః

# హిందుమతము

సోదరులారా !

తెలివియున్నను, లేకున్నను, మానవులెల్లరు "ఏది సత్యము" అను విషయమై దెలియుటకుగాను యత్నించుచుందురు. కాని అద్దానిం గనుగొని తనివిచెందుట మిక్కిలి దుర్లభము. అయినను సంశయములు పొంగిపొరలుచున్నపుడు హిందువుల పరిశుద్ధగ్రంథము అనగా వేద, శాస్త్ర, పురాణ, వాఙ్మయము సర్వేంద్రియములందీర్చి యానందింప చేయును. కావున సంశయాందోళిత హృదయములతో పరితపించువారు హిందూ వాఙ్మయమును శరణుజొచ్చుటకంటె గత్యంతరములేదు. నిజమారయ నదియొక్కటే "సత్యమార్గమై"యున్నది. ఇంతియేల ! " ఏకైకమార్గము " అనునది వేరొకటిలేదు.

ఇంతకును "ఏదినిజము" అను ప్రశ్నమాత్రము మనల నెల్లరిని ఈనాడు బాధించుచునేయున్నది. ఆ కారణమున వేదమం దుదహరింప బడిన సమాధానమును గాంతెము.

## వేదమం దుదహరింపబడిన సత్యస్వరూపము

" సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" ( వేదం )

సత్యం = ఒకానొక తత్త్వము సత్యమైనది కలదు.
జ్ఞానం = అది జ్ఞానమయమై వెలయు దివ్యస్వరూపము.

అనంతం = మరియు ఆద్యంతములు అనగా మొదలు చివరలు లేనిదగుచు ఆ సత్యవస్తువు అఖండమయినదిగ నుండెను. అట్టి మహత్తరంబగు తత్వ మెద్దియని ప్రశ్న కలుగదా !

బ్రహ్మ= అద్దానిని " బ్రహ్మము - లేక దైవము " అని వేదమాత విశదీకరించియున్నది.

సారాంశమును వినుడు. "దేవదేవు డొక్కడే సత్యస్వరూపుడని" నిర్ణయించుకొనవలెను.

వింటిరా ! వేదమాతయొక్క గంభీరభావము. అద్దాని నెవరు కాదని నిలువగల్గుదురు. కనుకనే ఆ వేదము సత్యవేదమని కీర్తింపబడుచుండెను. గాంధీమహాత్ముడు సైతము

" God is Truth "

" దేవుడు సత్యస్వరూపియైయుండెను "

అనుచు వర్ణించియున్నాడు.

ఆ మహాత్మునకు హిందుమతమనిన నెంతయో యిష్టము. కనుకనే అద్దానిని విడనాడకుండెను. ఒకమారు క్రైస్తవులీ క్రింది విధముగ ప్రశ్నించిరి.

" మహాత్మా ! తాము లోకైకపూజ్యులు. ఎన్నియో మారులు బైబుల్‌నుండి ప్రమాణముల జూపి ఆ గ్రంథమును మహిమ పరచితిరి. ఇంకను దాపరికమేల ? తాము క్రైస్తవమతమునజేరి ఎల్లరి నానందింపచేయుడు. ఈనాడు భారతీయులు మిమ్ము రెండవ దేవునిగ నెంచుచున్నారు. కావున వెంటనే తమరు హిందుమతమును విడనాడియున్నయెడల హిందువులందరును క్రైస్తవులయ్యెదరు. అది లోకశాంతిని కలిగించు కృత్యమైయున్నది. దేశసేవను గావించుచున్న మీ జన్మము సార్థకంబగును "

అను భావమును సూచించు ధోరణితో విన్నవించుకొనిరి. అంతట నా మహనీయుడొసగిన ప్రత్యుత్తరము గాంతము.

## క్రైస్తవులకు గాంధిమహాత్ముని సమాధానము

" మిత్రులారా! మీయుత్సాహమునుగాంచి నే నెంతయో సంతసించితిని. స్వమతాభిమానము మానవమాత్రులకెల్లరకు శ్రేయోదాయకంబు. ప్రతి వ్యక్తియు తన మతముచే నుపదేశింపబడిన ధర్మముల నాచరించుటకై బుద్ధికి మెఱుగుబెట్టుకొనవలెను. మీరీ రీతిగ వ్యవహరించుచు జీవితమును కొనసాగించుచున్నందుకు మరిమరి సంతసించెదను మీరును మీ యిరుగుపొరుగువారిని ప్రేమించుచుండవలెను. ఇదేవిషయము క్రీస్తుగారు హెచ్చరించెనని మీ రెరుంగుదురు. మీవలెనే నేనును మతవిషయమై యుత్సాహమును చెందువారిలో నొక్కడనైయుంటిని. కావున నన్ను యిరుగుపొరుగువారిగ భావించి మీవలె జూచుకొనుడు. మీ మతమునకు సైతము మా మతము ఇరుగు పొరుగుననున్నదై రాణించుచుండెను. ఈరీతిగ నొకరి నొకరము ప్రేమించుకొనుచుందుము. నిరంతరమిటులగావింతుమేని అదియే దేశాభివృద్ధికి దివ్యమగు సాధనంబగును. మిత్రవరులారా ! మా హిందుమతమున జ్ఞానరత్నము లెన్నియోకలవు. వానిని విడనాడి మరియొక మతమున జేరుటెందులకు ! మతములన్నియు సమమని చెప్పుచున్నట్టి నేను హిందుమతమును విసర్జించునెడల నామతమును హీనమొనరించువాడ నగుదును. కావున—

" మతము యొక్క మార్పిడి
బుద్ధిమంతులకు తగదు "

మీరును నావలెనే ఇంకను మరెన్నియో ధర్మములు దెలుసుకొనుచు వానిని పూర్ణముగ నాచరించుటకై యత్నింపుడు. ఇంతకు మించిన మత ప్రచారము వేరొండులేదు. మరియు ఇదియే మానవులకు ముఖ్య కర్తవ్యము అని నివేదించి యుండెను. చదువరులారా ! వింటిరా! కావున నొక మతమున నున్నవారు మరియొక మతముపై దాడిసలుపరాదు, మరియు నర్థానిని నశింపజేయుటకును యత్నింపగాదు.

"ఏది నిజము?" అని ప్రశ్నించుకొనినపుడు-

(1) దేవుడొక్కడే నిజమని నిర్ణయింపబడును. అంతకు మించిన సత్య స్వరూపము వేరొకటి లేదు.

(2) ఆ సత్యదేవుని చేరవలెనని నిరంతరము పరితపించు చుందుము. అందుకై యొకానొక సత్యమార్గమును సైతము అన్వేషించుచుందుము. తుదకు ఆమార్గము "ఓంకార నాదమై" యుండెనని గుర్తింపగలము. సత్యమును జేర్చగల మార్గమైనందున "ఓంకారము" సైతము సత్య రూపమందొక భాగమని నిశ్చయింపగలము.

(3) అయితే సత్యమును జేర్చగల "ఓంకార నాదము" ఒకటి కలదని యెటుల గుర్తింపగలము?

"ఓం"కారము అను అక్షర మొకటి కలదనియు, దానినే యొకరక్షణమార్గముగ జేసుకొని దేవుని జేరగలమనియు పరమపావన మగు "వేదము" సూచించియున్నది.

ఆ వేదము లేనియెడల- ఓంకార నాదమును గుర్తింపజాలము. నిజమారయ - ఓంకారము అను మార్గము నెరుంగనపుడు దేవుని సన్నిధానమును జేరగల్గుట యసంభవము. కనుక వేదమున్ను సత్య స్వరూపమున స్థానము కల్గియున్నది.

(4) మంచిది. వేద మొకటి కలదని యెరింగినకదా! సత్య మార్గము గోచరించి - ఆ సత్య దైవమును జేరగల్గుదుము. ఇక నా వేదమార్గమును దర్శింపజేయువా రెవరు? అనియు సంశయము కల్గును.

ఋక్ - యజుస్ - సామ - అధర్వణములు - అను భాగములతో వ్యవహరింపబడిన వేదమును దర్శింపజేసిన సాధనము హిందు మతమై యున్నది. అందుచే సత్యమును బోధించియున్న మతము హిందుమతముగాక మరియొకటి లేదని తీర్మానింపవలెను. కనుకనే "ఏది సత్యమతము?" అని యెవ్వరైన ప్రశ్నింతురేని వెంటనే-

"హిందుమతము సత్యమతమై యుండెను."

అని ప్రత్యుత్తర మొసంగుట అత్యుత్తమంబగు విధానము.

(5) ఆనంద మానందము. సత్యరూపమై వెలయుచున్నట్టి యొకానొక మతము - హిందుమతమనుపేర - విలసిల్లుచుండె నను కొనుడు. అహో! ఆ మతమును దర్శింపవలెననిన - అది యెచట సాక్షాత్కరించెనో దెలియవలదా! హిందువులు అనువారి హృదయ ఫలకములపై చిత్రింపబడిన మతమగుటచే — వారిని కూడ సత్యసంధులని కీర్తించుచుండవలెను.

6. హిందూజాతి భూలోకమున నుండుగాక. అట్టివారి కునికి పట్టయిన దేశమెద్దియో యొకటి యుండవలెగదా! దాని నామమును విన నుత్సహించనివారలెవరు? వినుడు. ఆదిమానవులగు హిందువులకు నివాసభూమి హిందుదేశమై యున్నది. కనుకనే హిందుదేశము సత్యమును బోధింపగల ప్రదేశమగుచు "సత్యదేశ" మని వేనోళ్ళ కొనియాడబడుచుండెను. ఇరేకను మరిమరి వాదింపనేల! ఇంతటితో వాదములన్నియు మటుమాయమగును.

-: రక్షణమార్గము :-

(1) ఈ లోకమున హిందుదేశము సత్యదేశమని ప్రఖ్యాతి గాంచెను.

(2) ఆ దేశమున — సత్యమును తమ జీవనధర్మముగ జేసికొనినవారు హిందువులుగానుండిరి.

(3) వారిచే ననుష్ఠింపబడు మతముకూడ "సత్యధర్మప్రబోధ కంబని ప్రసిద్ధిచెందిన హిందుమతమై యున్నది.

(4) చూడ జూడ - సత్యమతమునకు ప్రమాణగ్రంథమ్మై వెలయు వేదముకూడ పరిశుద్ధగ్రంథమై యొప్పుచునుండెను.

(5) సత్యవేదమున ప్రదర్శింపబడుమార్గమో! అదియు సత్య భాసురమై విలసిల్లుచుండెను. కావున నా మార్గమున పయనించు వారు రక్షింపబడుదురు. అందు కనియే ఆ మార్గము రక్షణమార్గమని కీర్తింపబడెను. అద్దానిని పలుమారు వినుటకై యెవ్వారి చెవులు తమ యుత్కంఠతను జూపవు! వినుడు! వినుడు.

ఓంకార నాద మనునదే "రక్షణమార్గము" శబ్ద బ్రహ్మ మనుచు మరియొక పేరుచే - ఆ మార్గము వ్యవహరింపబడుచుండును. కావున - సత్యమగు పరమపదమును జేరదలచినవారికి రక్షణమార్గము శబ్దబ్రహ్మముగాక వేరొకటిలేదు. అనగా ఓంకారనాదమే రక్షణ మార్గము.-

ఓంకార మార్గమనిగాని - శబ్దబ్రహ్మమనిగాని - రక్షణ మార్గమునకు నామకరణమొనరించి వ్యవహరించు బుద్ధిమంతులకు క్షణక్షణము వందనసహస్రము లర్పించుచుండవలెను.

(6) ఓంకారమును సాధనంబుగ జేసికొని - ఆ రీతిగ రక్షణ మార్గమున నడచుచున్నయెడల సత్యము గోచరించును. అనగా దైవము సాక్షాత్కరించును.

(1) ఈలోకమున సత్యమును జూపి యానందింపజేయగల దేశము హిందుదేశమనుట విశ్వసత్యమైయున్నది.

(2) కావున హిందుదేశమున నివసించుచున్న జనులచే నాచరింపబడిన-

(3) సత్యమతము హిందుమతము

(4) మరియు నామతమునకు ప్రమాణగ్రంధము సత్యవేదము

(5) అందు సూచింపబడిన రక్షణమార్గమున (ఓంకారమందు) నిల్చి క్రమముగ వ్యవహరించినయెడల—

(6) "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" యని కీర్తింపబడిన సత్యదైవము సాక్షాత్కరించును.

అంతట శాశ్వతానంద మనుభవింపగలము.

ఈ లోకమున నరుల కెల్లరకు ఇహపరంబుల రెంటిని సమకూర్చగలదియు, దివ్యమై యొప్పారునదియు ఆ నాదబ్రహ్మమే సుమా !

## హిందుమతము దైవమతమనుట

సారాంశమున దేవునిమతము హిందుమతమని నిర్ణయించితిమి. ఆ మతము దేవునిమతమా? యని ప్రశ్నించువారును కలరు. కాకేమి ! ఆ మతము దైవమతమై యున్నదనుటకు సంశయములేదు.

1. మహమ్మదుచే నుపదేశింపబడినది మహమ్మదు మతము.

2. క్రీస్తుచే ప్రవచింపబడిన కారణమున నా మతము క్రీస్తు మతమయ్యెను.

3, హిందువుచే నుపదేశింపబడిన మతము హిందుమతమని కీర్తింపబడుచుండెను.

క్రీస్తు — మహమ్మదు అనువారలు ఒకానొక కాలమున ఆయా దేశములందు తమ తమ మాతృగర్భములనుండి జననమంది యున్నారు. అది మొదలు వారివారి మతములు షుమారుగ రెండువేలేండ్లనుండి పరిఢవిల్లి ఆయాదేశపు గ్రంథములలో నున్నతస్థానమాక్రమించినవి.

ఇక హిందుమత విషయమయి చూతము. ఈ మతమును బోధించినట్టి పురుషుడు "హిందువు" అను మహనీయుడై యుండెను.

1. ఆ మహాత్ముడు ఎవ్వారి గర్భమున నుదయించెనో తెలుపగలవారుండిరా! లేరు. ఎందువలన? ఏతల్లి దండ్రిలనుండియు హిందువు ఎన్నడును ఆవిర్భవించినవాడు కాడు.

2. ఆత డేకాలమున జన్మించెనో నిర్ణయించెదము అనినను అది సాధ్యమై యుండదు. ఏలనన - ఈలోకమున 'కాలము' అనునది యేర్పడినపిదప ఇతడు జనన మందినవాడుకాడు. ఇక నాత డేకాలమున నుదయించెనని యెటుల ప్రశ్నింపగలము?

3. పోనిండు. ఆపురుషు డేప్రాంతమున నుద్భవించెనో - అను విషయమునుగూర్చి తర్కించిచూతము. ఈ లోకమున దేశము లన్నియు నిర్మింపబడినపిదప - ఏదోయొకప్రాంతమున - ఆ దివ్య పురుషుడు ఆవిర్భవించియుండడు. అయితే ఆత డెచ్చట పుట్టెనని ప్రశ్నింతము! ఈ భూమండలమును - మరియు అందలి మానవులును సృష్టింపబడకపూర్వమే - కాలములుగాని - ప్రాంతములుగాని లేని సమయమున దేశ - కాలముల కతీతుడై మరియు జీవరూపుడునుగాక వర్ణింపనలవిగానట్టి దైవరూపముతో విలసిల్లు వాడగుచు స్వతస్సిద్ధముగ ననాదినుండి - అంతటను నిండి నిబిడీకృతుడై ఉండియే యున్నాడు. జననమరణములు లేనట్టి ఆ జగదేకపురుషుడే- హిందువు అను బిరుదమును పొందిన మహనీయుడై యుండెను.

## —. హిందు - శబ్దార్థము :-

హిందువనగా దేవుడు అని సూచించునట్టి ప్రమాణములు కలవా? యనియు ప్రశ్నించువారుందురు. తెలివిగలవారికి ఆ యా ప్రత్యుత్తరములు ఆనంద దాయకము లగుచుండును.

REHB08R309



శ్లో॥ హిందుః హింమాశ్చ ప్రసిద్ధా । దుష్టానాంచ విధర్షణే
రూపశాలిని దైత్యారౌ రాజ్ఞి యోగి జనేఽపిచ॥
(సంస్కృత నిఘంటువు)

హిందుః = హిందుశబ్దము

ప్రసిద్ధౌ = ప్రసిద్ధి జెందినవాని యందును

దుష్టానాం చ విధర్షణే = దుష్ట సంహారకుని యందును

రూపశాలిని = జగన్మోహనాకారుడగు వానియందును

దైత్యారౌ=రాక్షసులకు శత్రువగు శ్రీ మహావిష్ణువునందును

రాజ్ఞి = జగత్ప్రభువునందును

యోగిజనే = యోగిపుంగవునియందును

వర్తించునని యెరుంగుడు.

ఇంకను మేదినీ కోశము - శబ్ద కల్ప ద్రుమము - తారానాథ వాచస్పత్యము – మేరుతంత్రము - శబ్ద కల్ప తరువు మున్నగు గ్రంథములను పరిశీలించుచో నా శబ్దమున కెన్నియో విశేషార్థము లున్నవని సైతము గ్రహించి - యానందింపవచ్చును. అవియన్నియు "భారతధర్మము" అను భాగమున విపులీకరింపబడెను. హిందువులమై యుంటిమని గర్వించువారున్నయెడల - వెంటనే యా భాగమును పఠించి పిదప సత్యము నెరుంగవలెను.

"దేవశబ్దమునకు-" మరియొక నామము "హిందుశబ్దము-" అనియున్నదనుకొందము. ఒకమారు ఆ రెండుపదములలోని యర్థమును తిలకించి సత్యమరయుదము.

దివ్ = ప్రకాశే – అను ధాతువునుండి దేవశబ్దము పుట్టెను. అనగా దేవుడు స్వయముగ ప్రకాశించువాడు అని దాని యర్థము. కావున నాతడు ఒకానొక కాలమున జన్మించినవాడుకాడని సారాంశమై యుండెను.

అట్టి దేవుడు జగమును సృష్టింపదలచెను. అందుకై యొక సాధనముకు కనుగొనవలసియుండెను. దానినే "ప్రకృతి" యనెదగు. నిజమారయ ప్రకృతిమూలముననే సృష్టి జరిగినది. కాని దేవదేవుడు ఆ ప్రకృతికి తోడునీడయై యుండెను. లోకమున స్త్రీలకు పురుషుడు అండదండయై యుండడా! అటులనే దేవదేవుడు ప్రకృతిని సృష్టించి దానిని రక్షింపవలసిన బాధ్యత తనపై వేసికొనెను. తన బిడ్డలను తాను రక్షించుకొనుట సహజమేకదా! అట్టి రక్షణమును సూచించుచున్న ఒకానొక నాదము కలదు. దానిం గాంతము.

## -: "హిం" అను నాదము :-

"హిం" అనునాదము రక్షణసూచకంబని యెరుంగుడు.

"హుం ఫట్ స్వాహా" అనునది యొక మంత్రమై యుండెను.

"హిం కారేణాభి జిఘ్రామి" అనునదియు ఒకానొక మంత్రములోని భాగము.

""హిం" కృణ్వతీ వసుపత్నీ వసూనాం" ఇదియు గోసూక్త మంత్రములోని భాగము.

"హిం" కరోతి అనునది కృష్ణయజుర్వేదమునందు ఒకానొక వాక్యముగనున్నది.

| | | | |
|---|---|---|---|
| హ్రాం అను | బీజాక్షరమునకు | మిత్ర | హిరణ్యగర్భులు |
| హ్రీం | ,, | ,, | రవి మరీచులు |
| హ్రూం | ,, | ,, | సూర్య ఆదిత్యులు |
| హ్రైం | ,, | ,, | భాను సవితలు |
| హ్రౌం | ,, | ,, | ఖగ అర్కులు |
| హ్రః | ,, | ,, | పూష భాస్కరులు |

దేవతలై యుండిరి. కనుకనే

హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః
మిత్ర రవి సూర్య భాను ఖగ పూష
హిరణ్యగర్భ మరీ చ్యాదిత్య సవి త్రర్క భాస్కరేభ్యో
నమః

అనుచు సూర్యనమస్కారములు గావించుచుందుము. వింటిరా! హకారసంబంధమగు హ్రం హుం హ్రాం హ్రీం హ్రూం మున్నగు నాదములు రక్షణమును జేయునవిగానున్నవని తెలియగల్గితిమి. అయితే యీ రక్షణము మనశ్శుద్ధికి సాధనంబై విలసిల్లు చుండును. జీవులందరికిని ఆరంభదశలో అనగా ధనకనక వస్తువాహనములందాసక్తి కల్గియున్నట్టిదశలో పై బీజాక్షరములు మనశ్శుద్ధినిగావించి రక్షణమొసగుచుండును. కాంతాకనకములందు విరక్తికల్గిన యనంతరము ఓంకారనాదము రక్షణమార్గముగనుండును. కావున మనబోటివారలు నేరుగ నా ధ్వనిని నోటితో నుచ్చరింపక – కర్ణరంధ్రములగుండా వినుచుండవలెను. అంతియేకాని పెద్దగాధ్వనిని జేయుచు నద్దానిని ఉచ్చరింపరాదు. ఎందుకన బునియాదులులేని మేడవలె నుపాసకుని క్రిందికి పడవేయుగలదు. అందుకనియే సన్న్యసించినవారు విరక్తులై యున్నకారణమున ఓంకారమును స్వేచ్ఛగ నుచ్చరించుట కధికారులై యుండిరి.

చదువరులారా! మీరును పై సత్యమును గుర్తించి వర్తించుచుండవలెను. ఇట్టి సూక్ష్మముల నెరుగక వ్యవహరించువారు కలిపురుషునకు సహకరించిన వారలగుదురు. తన్మూలమున దేశనాశము సిద్ధము.

1. తండ్రిలు తమబిడ్డలను రక్షింపదలతురు. కనుకనే బారసాల నాడు అనగా–

2. తండ్రిలు తమ పుత్రిలకు నామకరణ మహోత్సవము గావించునపుడు ఓంకారపదమును బలిగి విరాజిల్లుచుండును. పురిటిస్నానమును ముగించుకొనిన భార్యాభర్తలు పీటలపై గూర్చొ

నిన యనంతరము ఆ తండ్రి తనబిడ్డను తొడలపై నుంచుకొని యీ క్రింది మంత్రము నుచ్చరించును.

అంగా దంగా త్సంభవసి
హృదయా దధి జాయసే

ఆత్మా వై పుత్ర నామాసి త్వం జీవశరద శ్శతం
పశూనాం త్వా " హిం " కారేణాభి జిఘ్రామి॥ (వేదం)

ఈ రీతిగ మంత్రమును పఠించుచు- తండ్రి తన బాలుని శిరము నాఘ్రాణింపదలచి - అతనిమాడు ( కపాలము ) మీద తన ముఖమునుంచుచు "హిం" అను ధ్వనిని జేయును. తమయందున్న "హిం" అను దివ్యశక్తిని బ్రహ్మరంధ్రముగుండా లోనికిం బంపుచుందురని యెఱంగుదు.

3. గోమాతసైతము తనబిడ్డను రక్షింపదలచి క్షీరము(పాలు) నొసగును. అందుకై ముందుగ "హిం" అను శబ్దము నుచ్చరించును. పాలు చేపుకువచ్చినపుడు- ఆవులు తమ బిడ్డలకై వెదకుచు నొకవిధం బగు ధ్వనిని కల్గించుచున్నవి. మరియు బిగ్గరగా నరచును. ఆ సమయమున పై ధ్వనిలోని యక్షరమును గుర్తింతుమేని – "హిం" అని గోచరించును. గోపాలకులుగాని – పాలను పిండువారుగాని పై విషయములోని సత్యమును దెలియగల్గుదురు. గోవులు పెద్దగా అరచుచున్నపుడు - అందలిధ్వనిని వేదము సైతము - " హిం " అని వర్ణించియున్నది. వాని నాకర్ణింతిము.

"హిం కృణ్వతీ వసుపత్నీ వసూనాం వత్స మిచ్ఛంతీ మనసాఽభ్యాగాత్ -

దుహామశ్విభ్యాం పయో అఘ్న్యేయం సా వర్ధతాం మహతే సౌభగాయ" [ఋగ్వేదమున గోసూక్తము]

వసుపత్నీ=గోవు

హిం కృణ్వతీ= "హిం" అను నాదమును గావించుచు

వత్సం=తన బిడ్డను—

అభ్యాగాత్=సమీపించుచుండును.

అనుచు వేదము హింకారమహిమను వెల్లడించినది. ఇంతకు మించిన ప్రమాణమేమి కావలెను. బిడ్డలను రక్షింపదలచిన తల్లులును, తండ్రులును హిం అను ధ్వనిని గావించుచుందురని వేదమాతవలన దెలియగల్గితిమి.

పాఠకులారా! "హిం" అనునట్టి ధ్వనియందు నెలకొనియున్న మహిమను గుర్తించియుంటిరికదా! పై మంత్రములోని రెండవ పాదమై రాణించుచున్న "దుహా మశ్విభ్యాం" అను వాక్యమును గుర్తింతము. అందలి ప్రథమాక్షరమును "దు" అని తెలియగల్గుదుము. సంస్కృతభాషలో "దు" అనియు, "దూజ్" అనియు రెండు ధాతువులు కలవు. ధాతువు(రూట్సు Roots) ల నుండియే శబ్దములు ఉత్పత్తియగుచుండును.

దు అనగా ఖండించుట.

దూజ్ అనగా తపింపజేయుట.

ఒక దానిని ఖండించినప్పుడే అది తపింప నారంభించును. ఆ రెంటి వలన రక్షణము కల్గును. ఎట్లన గురువు తన శిష్యునకు పాఠములం జెప్పునపుడు అతనిని శిక్షించుచుండును. తన్మూలమున నా శిష్యుడు తపించి బాధను చెందగలడు పై రెండువిధములగు పనులు సంభవించినయెడల బాలుడు విద్యావంతుడగుచు రక్షణముపొంది ఇహపర సుఖంబుల రెంటిని అనుభవింపగలడు.

అతనికి సంభవించిన శిక్షయు (ఖండింపబడుట) అనగా దెబ్బలం దినుటయు,

తన్మాత్రలమున కల్గిన (తపనము) తాపమున్ను,

ఇవి రెండును విధిగా నేర్పడితీరవలెను, అనుచు తెలియజేయుట యెట్టిదో అట్టిదే హిందుశబ్దములోని విశేషము. ఈ విషయమును బాగుగ గురుతెరింగినవారు వివేకులై యుండురు.

ప్రకృతమునకు వత్తము.
"హిం" అను ప్రకృతిని
దునోతి

దునుమాడినందున అనగా
భిన్నముచేసినందున కాదా
ఖండించినందున లేక
శిక్షించినందువలన
సృష్టికర్తయగు దేవునకు

హిందు అను నామధేయము కల్గెను.

" హిం " దునోతీతి హిందుః అనిగాని,
" హిం " దూయతేఇతి హిందూః అనిగాని యుచ్చరింపనగును.

(4) మిక్కిలిశ్రద్ధతో గమనింపవలసిన మరియొక అంశము కలదు. అదియు హిందూశబ్దమునకు మూలకారణమై యుండెను.

వర్షముల నొసగుచు తన్మాత్రలమున లోకమును జీవింపచేయ సమకట్టినట్టి యజ్ఞములుకూడ "హిం" అను ధ్వనిని ప్రతిధ్వనింప జేసినవి. ఆ మంత్రముల నొకమారు ఆవందమయులమై విందము.

యజ్ఞనములో "హిం" అనునట్టి మహాత్మ్యరసాదం బాకటి విప్పబడుచున్నది. దానిం జూతము.

" దేవా వై నర్చిన యజుష్యశ్రియంత
తే సామన్నేవాశ్రియంత "

(1)……… " హిం కరోతి " — 1

(2) సామైవాకర్ " హిం కరోతి " — 2

యత్రైవదేవా ఆశ్రియంత తతస్వైనాన్
ప్రియుంక్తే
వాచ ఏ వైమయోగో

(3) " హిం కరోతి " 3

(4)……… " హిం కరోతి " — 4

ప్రజావేవ తద్యజమాన స్సృజ్యతే "
(కృష్ణయజుర్వేదం 2 వ కాండ
5 వ ప్రపాఠకం 7 వ అనువాకం )

పైనున్న మంత్రమున " హిం " అను అక్షరము నాల్గు మారులు ఉచ్చరింపబడెను. ఎద్దియో యొక మహాత్మ్య విశేషము లేనిదీ ఆ రీతిగ "హిం" అనునది పలుమారు ఉచ్చరింపబడను. అందలి మార్గము నెరుంగుదము.

దేవదేవుని ప్రార్థించుచున్న మంత్రములు విశేషముగ సామవేదమునందు కలవు. దేవతలును ఋషులును వేగిరముగ " సామన్నేవాశ్రియంత " = దేవదేవునకు పరమప్రియముగ నెలయునట్టి సామవేదమును గానముచేయ సాగిరి.

"హిం" కరోతి" = ఆ గానమందు "హిం" అను దానిని ఉచ్చరించుచు ఆనందించుచుండిరి. పై మంత్రమునకు విద్యారణ్యస్వాములు వ్యాఖ్యానమును వ్రాసిరి. అందు

" తృతీయోచ్చారణం యదస్తి తేన యజమానః
ప్రజా ఏవ సృష్టవాన్ భవతి "

అనుచు వివరించబడియుండెను. ఆ దేవతలవలెనే ప్రజలుకూడ "హిం" అనుదానిని పలుమారు ఉచ్చరించినయెడల-

" ప్రజా ఏవ సృష్టవాన్ భవతి "

మంచి సంతానమును కనెదరు అనుభావము సైతము ప్రకటింపబడినది. పై మంత్రమూలమున నెరుంగదగిన సారాంశ మరయుదము.

పరమేశ్వరుని మాయాబలమునుండి యేర్పడిన " హిం " అను అక్షరము ప్రజలను సృష్టించుటకును, రక్షించుటకును శక్తి కలదయి విరాజిల్లుచుండెను. సృష్టింపబడిన ప్రజలకు పరలోకమార్గమును సైతము దర్శింపచేయుటకుగాను " ఓం " కారము అనునట్టి శబ్ద బ్రహ్మము అగ్రస్థానమున నిల్చినదై యొప్పారుచుండెను.

" హిం " అనునది దేవసంబంధమగు ప్రకృతి. అది వివిధరీతులుగ పరిణమించినదై " హ్రాం " " హ్రీం " 'హ్రూం' ' హ్రైం ' ' హ్రౌం ' ' హ్రః ' అనురూపములను పొందెను. దేవదేవుని నమస్కరించుసమయమున-అవి ప్రథమాక్షరములై నవగుచు ఉచ్చరింపబడుచుండెను. దృష్టాంతమునకై సూర్యదేవుని ప్రార్థనలం జూతము.

| | | |
|---|---|---|
| హ్రాం మిత్రాయనమః<br>హ్రీం రవయే నమః<br>హ్రూం సూర్యాయనమః<br>హ్రైం భానవే నమః<br>హ్రౌం ఖగాయనమః<br>హ్రః పూష్ణేనమః | } | అనుచు నుచ్చరింపబడును. ఆసమయమున హ్రాం, హ్రీం, మున్నగు బీజాక్షరములు ఆద్యక్షరములుగ విరాజిల్లు చున్నవి. |

సూర్యనమస్కారము లొనరించువారి నడిగినయెడల "నిజము, నిజము" అని ప్రత్యుత్తరం బొసగెదరు.

సంస్కృతవాఙ్మయమునందు— అ ఆ లు ప్రారంభింపబడును. తుదియందు, య, ర, ల, వ, శ, ష, స, "హ" అను నవియు నుచ్చరింపబడును. అంత్యాక్షరము హ అని యెఱుంగుడు. ప్రథమాక్షరము అ.చివరి యక్షరము హ.అవి రెండును చేరగా అహ యని యుచ్చరింపబడును.

ప్రకృతియనునది—

అ కారమునుండి హ కారము వరకు వ్యాపించియున్నదై - తనను పూర్ణముగ నుపాసించునెడల బ్రహ్మము సాక్షాత్కరించునని తెల్పును. కనుకనే దేవుడు అహ స్వరూపుఁడై ప్రత్యక్షమగునని ఛాందోగ్యోపనిషత్తునందు ఉదహరింపబడెను.

దేవునినామము "అహః" అనియు పై యుపనిషత్తు వర్ణించియున్నది. హకారముయొక్క మహిమను గు[illegible]!

ఆ హ కారమే హిం, హుం, హ్రీం, [illegible], [illegible], మున్నగురూపములతో ప్రకాశింప దొడగెను. కావున 'హిం' కారము దైవమహిమను వ్యక్తముసేయునదియై విరాజిల్లెననుట నిర్వివాదాంశము

'హిం' అనునట్టి యీ మహత్తరమగు నాదము హిందు మతమునకును, హిందు దేశమునకును, హిందువులకును ప్రాణప్రదంబై ఆద్యక్షరముగ రాణించుచున్నదగుచు - నలుదిశల వ్యాపించి యుండెను.

బైబిలునందుసైతము హిందుశబ్దము వాడబడియున్నది. కనుకనే ఆ పదము నలుదిశల వ్యాపించియుండెనని వచింపగల్గితిమి. ప్రమాణమును వినుడు.

"అహష్వేరోషు (ఇది ఒకనృపుని నామము.) దినములలో జరిగిన చర్యావివరము. హిందూదేశము మొదలుకొని కూషుదేశము వరకు నూట యిరువదియేడు సంస్థానములను అహష్వేరోషు ఏలెను."

(పాతబైబిలు, ఎస్తేరు అను కాండ, 1 వ అధ్యాయము, 1 వ వచనము.)

ఇదంతయు ఆరువేల సంవత్సరములలోపల జరిగియున్న కథయైయుండెను. ఆనాటినుండి యీనాటివరకు విదేశీయులు సైతము హిందుశబ్దమును వాడుచునేయుండిరి.

హిందుశబ్దమునకు దివ్యమగు శాస్త్రసంబంధమగు అర్థమున్ననూ అర్థానిని గుర్తింపలేక

సింధుశబ్దము మారినదై హిందుపదముగా నేర్పడెనని తమకు తోచినటులెల్ల వ్రాసికొని యుండిరి విదేశీయులు.

భవిష్యపురాణమున సైతము ఆవిషయము ఉదహరింపబడెను.
శ్లో॥ జానస్థానే జైనుశబ్దః సప్తసింధు స్తథైవచ। హప్తహిందు ర్యావనీచ పునర్జ్ఞేయా గురుండికా॥ (భవిష్యపురాణం ప్రతిసర్గపర్వము.)

సప్తసింధు అనుశబ్దమును హప్తసింధు అనురూపముగ మార్చి యుండిరని యావనీ - గురుండికా - అను పదములు హెచ్చరించినవి.

యవనులనగా పారసీకులు, మహమ్మదీయులు మున్నగు విదేశీయులు. గురుండులనగా విదేశీయులగు ఆంగ్లేయులు అని పురాణములం దుదహరింపబడెను.

'స' అనుదానిని విదేశీయులు 'హ' అనుచు వ్యవహరించుట సాంప్రదాయమైయున్నది. కావుననే అ'సు'ర శబ్దమును అ'హు'రయని మార్చివైచిరి. 'స'ప్త యనుదానిని 'హ'ప్త యని పల్కిరి. 'సిం'ధు శబ్దమును 'హిం'దు పదముగా నుచ్చరించిరి. సింధుశబ్దము హిందు శబ్దముగా మారినమాట వాస్తవము. కాని, ఆరీతిగ మార్చుకొనినవా రెవరు ! విదేశీయులు. అయితే- భారతీయులదృష్టిలో హిందుశబ్దము యొక్క వ్యుత్పత్తి వేరుగానున్నది. భరతభూమికి హిందుదేశముఅను బిరుదమును పెట్టుకొని భారతీయులు వ్యవహరించుచునుండగా విదేశీయు లీ దేశమునకు క్రొత్తగావచ్చినపుడు సింధూనదీ ప్రాంతమున జేరిరి. అహో ! సింధునదీమూలమున హిందుపదము ఏర్పడియుండు నని భ్రమించి – అదిమొదలు తమచే రచింపబడిన గ్రంధములందు సింధు శబ్దము హిందు శబ్దముగ మారెనని చెప్పుచువచ్చిరి.

మహమ్మదీయులు ఆ వ్యుత్పత్తిని సమ్మతించినవారు కారు. కనుకనే – హిందువనగా 'శానిస', 'సేవకుడు' అనుచు ఉర్దూ నిఘంటువునందు ప్రకటించుకొని యుండిరి. ఎట్లైననేమి విదేశీయులందరకును హిందువులనిన నసహ్యమై యుండెను. కనుకనే యిష్టమువచ్చినపుడెల్ల నీ జాతిని అవమానించుచుందురు. ఎవ్వ రెయ్యది చెప్పిన నయ్యది సత్యమనుచు డూడూ బసవన్నలవలెనాదిరి తలలూపుచుండుట మాని హిందువులు స్వీయబలముచే నిశ్చయింపగల వ్యక్తులు కావలెను. మనము శానిసలముకాము సింధుసంబంధ హిందువులమూ కాము. కేవలము అహస్స్వరూపుడగు హిందువునకు సంబంధించియున్న పరమపావన మూర్తులము.

మన మూలపురుషుడు అహోనామక దేవుడు. విదేశీయుల మూలపురుషుడో అతడు అహోవా అను దేవుడు. ఇంగలీషువర్ణమును [illegible]

మహామహిమకల్గిన 'హిం' అను అక్షరమును ఆద్యక్షరముగ చేసికొని 'దు' అను మరియొక అక్షరమును అంత్యాక్షరముగ నుంచుకొనుచు వ్యవహరింపబడిన పదము "హిందు" అను నామమును పొంది యుండెనని నిర్ణయించుకొనుడు. ఈ శబ్దముయొక్క సంపూర్ణమగు అర్థమును మరియొకతావున దెలిసికొని యానందించు భాగ్యము పూర్వజన్మ కృతపుణ్య విశేష మెంతయో యుండినగాని లభ్యము గానేరదు. హిందువు మంత్రిస్వరూపుడు. కనుకనే దైవసంబంధమగు వ్యక్తియై యుండెను. ఇకనైనను దైవముమీద భారముంచి పురుష ప్రియత్నమున ముందంజవైచుచు వీరపురుషులై వర్తించెదరుగాక.

"హిం" దునోతీతిహిందుః " అను వ్యుత్పత్తి ననుసరించి హిందుశబ్దమప్పుడు ఉకారాంతపుంలింగమై గణించుచుండును. హిందూ ఇతి హిందూః అనినప్పుడు - హిందుశబ్దము " ఊకారాంతముగ నుండును.

## మేరుతంత్రిమున హిందూశబ్దము

శ్లో॥ హీనంచ దూషయత్యేవ
హిందు రిత్యుచ్యతే ప్రియే।

( ఇతి శ్రీ మహామాయా మహాకాలాన మతే మేరుతంత్రే శివ ప్రణీతే కార్తవీర్యార్జున మంత్రికథనం నామ పంచత్రింశత్తమః ప్రకాశః )

మేరుతంత్రిము అను గ్రంథమున 35 వ ప్రకాశము అను అధ్యాయమందు పై శ్లోకము ఉదహరింపబడెను.

| | | |
|---|---|---|
| హీనం | = | దూషయతి |
| హీనమగు దానిని | | దూషించుచున్న వ్యక్తి |
| హిం | దు | అను |

నామమున వ్యవహరింపబడెనని యర్థము. అట్టివాడెవడు ? దేవుడు తప్ప మరెవ్వరును లేరు.

ఆ దేవదేవునిమతమే హిందుమతము లేక హిందుధర్మము.

దేవునకును మతమున్నదా ? యని పరిహసించువారుందురు. దేవుడు ఒకానొక మతమున నున్నవాడగుచు అందలి ధర్మముల నాచరించునని అర్థముచేయవలదు. ఆ దృష్టిలో నతనికి మతము లేదని చెప్పిన చెప్పవచ్చును. దేవుని చేరవలెనని నందుకుందగిన మార్గము లెవ్వియో అట్టివానిని ఆ దేవుడు చూపించియుండడాయేమి? అతని సన్నిధానమును చేర్చగల సాధనమును అతడే చూపించియుండవలెను. కావున నతని యభిమతమునకై ఎదురుచూచుట మనవంతు. తన యభిమతంబును మనకు వివరముగ దెల్పుట యతనివంతు. అతని యభిమతం బెద్దియో యొకటి యుండితీరును. దానినే దేవుని మతమని కీర్తించుచుంటిమి. కృష్ణభగవానుడు సైతము:

శ్లో॥ యేమే మతమిదం నిత్యం అనుతిష్ఠంతి మానవాః

— గీత

మే మతం = నా యభిమతమును అనగా నా యభిప్రాయమును గుర్తించి

యే అనుతిష్ఠంతి = ఎవరు ఆ రీతిగ ఆచరింతురో అట్టివారిని పరమపదమునకుం గొనిపోయెదను అని భాషించి యున్నాడు. కావున దేవునకును మరియొకవిధంబగు మతము లేదనరాదు.

అతనిచే నుపదేశింపబడినదియు, మనచే నాచరింపబడినదియు అగు నొక మతము ఉండితీరవలెను అట్టిమతమే హిందుమతమనబడును. అయితే విదేశీయులకుమాత్రము దేవుని యుపదేశములు లేవా యని ప్రశ్నింపుడు. ఉన్నవి. ఆ యుపదేశములు వారిని సృష్టించియున్న ఆ విదేశ దేవునకు సంబంధించినవి యగును.

మనదేవుడు అహోనామకుండనియు,
వారిదేవుడు అహోవా యనియు
నింతకుపూర్వము వినియుంటిరిగదా !

కావున యెటులైననేమి ? నిజమగు దేవునిమతము హిందు దేశమున నుండెను. మరియొకదేవునిమతము నిదేశములం దుండెను. ఆ భేదమును గుర్తించునంతవరకు సంశయములు తీరునవికావు. పై విషయమై యేర్పడిన సందియములు మరియొకతావున తీర్చుకొనగలరు. అంతవరకు వేచియుండుడని ప్రార్థన. ఈ లోపలనే యుద్రేకమునుపొందుచు నోటికి వచ్చినటులెల్ల భాషించువారున్నచో అది వారి కర్మము. ఎవరికర్మమును వారనుభవింపక తీరదుకదా !

-: హిందుమత మెపుడు పుట్టెను :-

ఎంతకాలముక్రిందట నీ మతము వ్యవహారమునకు వచ్చెను - అను విషయమును దెలిసికొందము. ఆ మతము హిందువులదైనందున హిందువులు జన్మించిన నాటినుండి ఆ మతము వ్యవహారదశకు వచ్చెననవలెను. అయితే హిందువు లెపుడు పుట్టిరి? హిందూదేశము ఏనాడు భూమండలమున నుదయించెనో - ఆనాటి నుండియే హిందువులు జననమందియున్నారు. మంచిది. ఇక నాలస్య మెందులకు? హిందుదేశముయొక్క జననకాలమును గుర్తించుదము రండు. అటుపైన హిందుమత మెపుడు వ్యాపించియున్నదో తెలియగల్గుదము.

195, 58, 85, 063 సం॥ల క్రిందట హిందుదేశము ఆవిర్భవించియుండెను. అనుచు హిందూవాఙ్మయము రుజువుచేసియున్నది. కావున—

| | | |
|---|---|---|
| హిందు | దేశము | ఏర్పడి |
| హిందువులు | | 195 కోట్ల చిల్లరసంవత్స |
| హిందుమతము | ఇవి మూడును | రములయ్యెనని గుర్తింపవలెను. |

హిందువుల పంచాంగమును చూడుడు. "సృష్ట్యాది గతాబ్దాః" అను తావున పై లెక్కను దర్శింపవచ్చును. అయితే అవి ౧౯౫౫౮౮౫౦౬౩ సం॥లని తెలుగు అంకెలలో నుండును. ఇంతకుమించిన ప్రమాణము లేమికావలెను.

క్రీస్తుపుట్టుటకుపూర్వము నాల్గువేలేండ్ల క్రిందట ఆదాము హవ్వలు విదేశములందు 'ఏడెన్' అను ఒకానొక తోటలో సృష్టింపబడిరని బైబులునందు కలదు. క్రీస్తుకుపూర్వము ఏయే వత్సరములందు విదేశములలో ఏ యే కథలు నడిచియున్నవో అవియన్నియు ఆరువేలేండ్ల లోపల నడచియున్నందున వానినిజ్ఞప్తియందుంచుకొనుటకు గాను క్రైస్తవులు- బి. సి. (Before Christ) అను కొండగుర్తొకదానిని పెట్టుకొనియుండిరి. బి. సి. అనగా క్రీస్తునకు పూర్వము అని యర్థము. క్రీస్తునుండి వెనుకకుంబోయిన యెడల నాయాకథలు జరిగియుండెనని గుర్తించుటకుగాను ఆరీతిగ వాడుకొనుచుండిరి. క్రీస్తు ఒకానొక కాలమున జన్మించియుండెను. కావున నతనికి పూర్వము- ఆయా కథలు నడిచియున్నవని తెల్పుటకుగాను- గుర్తుపెట్టుకొని యుండిరి. హిందువు అను దేవుడు ఏదో యొకనాడు క్రీస్తువలె జన్మించి యుండలేదు. అందుచే దేవునకు పూర్వము అను కొండ గుర్తును "బి. జి." అను దానిని హిందువులు వాడుకొనరైరి.

(B) బి - అనగా పూర్వము = బిఫోర్ (Before)

(G) జి - అనగా దేవుడు = గాడ్ (God)

బి. జి. అనునపుడు దేవునకు పూర్వము అనుభావము వెలువరింపబడును. క్రీస్తునకు ముందు-వెనుకలు ఉండునుగాని దేవునకు ఆ ముందు-వెనుకలు ఎటుల సంభవింపగలవు ? కావున హిందువులు బి. జి. అనుటకు నేర్చుకొనరైరి. అంతమాత్రమున క్రైస్తవమతము ఘనమైన దగునా యేమి ?

బి. సి. అని యున్నందున క్రీస్తుగారు
దేవునికంటె ఘనుడై యుండడు.
బి. జి. అని లేనందున దేవుడు క్రీస్తుగారికంటె
హీనుడు కానేరడు.

ఎందుల కీ విపరీతవము ! క్రైస్తవుల సంఖ్య అధికముగ నున్నందున - ఆ క్రీస్తుమతము గొప్పదని కొందరనుచుందురు. హిందువులసంఖ్య తక్కువయినందున ఆ హిందుమతము మిక్కిలి తక్కువైనదనియు పలికించుచుందురు. అదియు న్యాయసమ్మతము కాదు.

" క్వాంటిటీ " - అనగా పరిమాణము.
అయ్యది ప్రధానమగునా? కాదు.
" క్వాలిటీ " అనగా గుణము.
అది మాత్రము ప్రధానమగునేమి. అవును.

ఇంతమాత్రమైనను సత్యమునుగుర్తించుటకు క్రైస్తవులు యత్నింపకున్నారు. జగమున రాళ్ళు-రప్పలు అధికముగ నున్నవి. రత్నములనినవో - అవి మిక్కిలి తక్కువగ నుండెను. ఎక్కడజూచి నను ఇనుపముక్కలు మిక్కుటములై యున్నవి. బంగారుతునకలు తక్కువమైనసంఖ్యతో రాణించుచున్నవి. అసత్యము అధిక సంఖ్యా కులయం దున్నది. సత్యమనిననో - అది అల్పసంఖ్యాకులయందు ప్రత్యక్షమగును. కావున - హిందువులు అల్పసంఖ్యాకలవారుగా నుండిరని పరిహసింపరాదు. ఆ రీతిగ నుండుటకు కారణము కలదు. రత్నములరీతిగను, సువర్ణము (బంగారము) చందమునను, సత్యము వలెను హిందుమతము అల్పసంఖ్యాకులతో నిండియున్నది. రత్న, సువర్ణ, సత్యములకు విలువ శూన్యమైపోయినకాలమున - హిందు మతమునకును ప్రాశస్త్యము తగ్గిపోగలదు. అట్టిదశ జగత్ప్రళయమున సంభవించునని యెరుంగుడు.

హిందు దేశము అను శబ్దము - భరత ఖండమునకు పర్యాయ పదమై యుండెను. అందుకు హేతువు లేకపోలేదు.

ఉత్తర భాగమున నెలకొనియున్న

"హి" మాలయమునుండి

దక్షిణభాగమున నిల్చియున్నట్టి దక్షిణ సింధు [దక్షిణ సముద్రము] పర్యంతము వ్యాపించియున్న దగుటచే - హిమాలయ శబ్దములోని-

"హి" అనునట్టి ప్రథమాక్షరమున్ను సింధుశబ్దములోని-

"ంధు" అను అంత్యాక్షరమున్ను చేరి - హింధు అని యేర్పడినదై క్రమముగా హిందు అను నామమున వ్యవహరింపబడు చుండెను. సంస్కృత లిపిలో హిన్దు అని వ్రాయుచుందురు. కావున "న్దు" అనునది అంత్యాక్షరంబయ్యెను, ఈ రీతిగ హిన్దుశబ్దము సిద్ధమై భరతఖండమును సూచించుచుండెను. ఆ మతము స్వస్వరూపముతో ఈ దేశమునతప్ప మరియొక తావున నిల్చుటకు వీలు లేనిదై యుండెను. ఎందుకన యజ్ఞయాగాదుల నొనరించుటకుగాను, రావి మర్రి - మేడి మున్నగు వృక్షములు ఆయా విదేశములలో లభ్యము కానేరవు. సోమరసమున కవసరంబగు సోమలతయు గోచరింపదు. కావున నామతము ఈదేశమున నిల్చియుండుటకుగాను ఎల్లలను (హద్దులను) గుర్తింపచేయు శబ్దముగ నేర్పడి అదియొక గొప్ప బిరుదముగ వ్యవహరింపబడుచున్నది.

'హిందు' అను పదము ఒక బిరుదము.

ఆ బిరుదమందొక రహస్యముకూడ గలదు.

1. హిందుశబ్దములోని "హిం" అను నాదము రక్షణమును సూచించుచున్నదని వింటిమి కావున హిందుపదము భరతఖండమునకు పర్యాయపదమై యుండెను

౩. ఆ పదము మతమునకును సంబంధించియున్నదగుటచే పర్యాయపదమై రాణింపగల్గెను. విదేశమతములకును, విదేశప్రజలకును జ్ఞానభిక్షను పెట్టును ఆరీతిగ పరోపకారమొనరించుచున్నది. దానినే రక్షణమనుచుందుము. అందుకు ప్రమాణమును గాంతము.

## విదేశీయులకు సైతము జ్ఞానమొసంగునది హిందూమతము

శ్లో॥ ఏతద్దేశ ప్రసూతస్య సకాశా దగ్రజన్మనః॥
స్వం స్వం చరిత్రం శిక్షేరన్ పృథివ్యాం సర్వమానవాః
(మనుస్మృతి)

ఏతద్దేశప్రసూతస్య = ఈ భారతదేశమున జన్మించియున్న
అగ్రజన్మనః = ఆదిమానవులనుండి
పృథివ్యాం = పృథ్వీతలమునందంతటను వ్యాపించియున్న
సర్వమానవాః = మానవులెల్లరు
స్వంస్వంచరిత్రం = తమతమ చరిత్రలను
శిక్షేరన్ = నేర్చుకొని యుండిరి.

అని యున్నందున – భారతీయులు జగద్గురువులై రాణించుచుండిరనుటకు సందియములేదు. ఆంగ్లేయు లీ దేశమును పాలించినపుడు విదేశములనుండి కొందరు పెద్దలరుదెంచి యీ దేశములోని సంస్కృతగ్రంథముల నెన్నింటినో తీసికొనిపోయిరి. మరియు నీ దేశపు పండితశ్రేష్ఠులకు ఆశలుకల్పించి విదేశములకుం గొంపోయి, వారి మూలమున శాంబులను, విమానములను నిర్మించు మార్గముల నరసిరి. ఒకమాఱు ఆంగ్లనిఘంటువులను, ఆంగ్లవిజ్ఞాన సర్వస్వమును (ఎన్ సైక్లోపీడియా) గమనింపుడు. ఆల్ జిబ్రా, జ్యామితీ, ఎస్ట్రాలజీ, పామిస్ట్రి మున్నగు విద్యలన్నియు హిందు దేశమునుండి గ్రీకు దేశమునకును, రోముదేశమునకును వెళ్ళి అచటనుండి మిగిలిన దేశములకు పోయినవని దర్శింపగలము. ఇంతకుమించిన ప్రమాణ

మేమి కావలెను ! వలయునన్నచో మరియొక పుస్తకమున ముద్రింప గలము.

## హిందువులే ఆదిమానవులు అనుటకు పాశ్చాత్యపండితుల సూచనలు :

ఆదిమానవుల జన్మవిషయమై బైబులునందు ఆరువేలేండ్ల క్రిందట సృష్టింపబడిరని యున్నను - దానిని విశ్వసింపక విదేశములలోని పండితులు సైతము లక్షలకొలది సంవత్సరములక్రిందట మానవులీ లోకమున నివసించియుండిరని తెల్పిరి. వారి యాచారములన్నియు హిందుమతమునకు సంబంధించి యున్నవని వక్కాణించియుండిరి. విదేశరాజులు మరణింపగా వారిదేహములు కుళ్ళిపోకుండ భద్రముగ నుంచుటకుగాను కొన్ని ద్రావకముల నుపయోగించి యుండిరి. ఆ శవములను దర్శించినపుడు వాని శిరములయందు శిఖలు (జుట్లు) ను - మొగమున బొట్టును కన్పడియున్నవని తమ గ్రంథములలో ముద్రించియుండిరి. అందలి సత్యము నెరుంగక బైబులుమాత్రము సెన్సునకును, సైన్సునకును విరుద్ధముగ భాషించుచుండెను. అనగా ఆరువేలేండ్ల క్రిందటనే మానవు లుద్భవించిరని పల్కెను. దీనిచే భూగోళశాస్త్ర సంబంధమగు తెలివితేటలుకూడ బైబులునం దున్నవనదాలము.

ఇంకను భూగర్భ శాస్త్రవేత్తలచే రుజువు చేయబడిన సాక్ష్యము లెన్నియో కలవు. ఆ శాస్త్రజ్ఞులు భూమిని త్రవ్వించినపుడు అందు గోచరించిన మనుజుల అస్థిపంజరములు మరియు వారిచే నుపయోగింపబడిన వస్తుసామగ్రిలు ఎన్నియో లక్షలకొలది యేండ్ల నుండి ఆయా భూభాగములలో మానవుల అస్తిత్వమును (ఉనికిని) గూర్చి రుజువుజేసినవని వక్కాణించు చున్నారు.

ఆ రీతిగ పదార్థ విజ్ఞానశాస్త్ర మొకవంక బయల్వెడలి లక్షలాది సంవత్సరముల క్రిందటనే నరులు పుడమిపై నివసించి యుండిరని హెచ్చరించినను అద్దానినంతయు నెగరగొట్టి ఆరువేలేండ్ల క్రిందటనే మానవులు జన్మించియుండిరని క్రైస్తవులు ప్రవచింపసాగిరి.

భూగోళ, ఖగోళ విషయజ్ఞానమును ఒకింతయైనను జూపింపజాలని ఆ విదేశమతమును ఎవరు విశ్వసింపగలరు? కావున తెలివిగలవారెవ్వరును ఆ మతమును స్వీకరింపరాదు.

## -: ఆది మానవుల కాలము :-

ఆదిమానవుల కాలమును గూర్చి హిందుమతము ఏమని తెల్పియున్నదో చూతము.

క. ఈ కల్పంబున మనువులు
ప్రాకటముగ నార్వురైరి పదునలుఫురలో
లోకమున జనులు పుట్టువు
లాకథితములయ్యె వరుస నఖిలములు నృపా!

(భాగవతం. అష్టమస్కంధం 6 వ పద్యం)

ఈ ప్రపంచమున అనగా ఈ శ్వేతవరాహకల్పములో (14) పదునల్వురు మనువులుండిరనియు ప్రతిమనువుయొక్క కాలము 30, 67, 20, 000 సం. ల చొప్పున వ్యవహరింపబడెననియు—సూర్య సిద్ధాంతముననూ, ఇంతయేల - బహుపురాణములందును ఉదహరింప డెను. పై గణితము ననుసరించి ఆర్వురు (6) మనువులయొక్క కాలము ఈ నాటికి గతించిపోయినది. అదిగాక ఆదిమానవులయొక్క పుట్టుకను గూర్చి వారి జననకాలము సృష్టిప్రారంభముననే సంభవించెనని పై పద్యమున వర్ణింపబడెను.

" లోకమున జనులపుట్టువ లాకథితములయ్యె " అను వాక్యమున ఆ విషయము పొందుపరుపబడెను. ఇంకను ఆ భాగవతం లోని పంక్తులను ఉన్నదున్నటుల చూతము. పరీక్షితుమహారాజు శుక మహర్షిని ఈ క్రిందివిధముగ ప్రశ్నించియుండెను.

క. వినబడియెను స్వాయంభువ-
మను వంశమువర్ణ ధర్మ మర్యాదలతో
మనుజుల దనుజుల వేల్పుల-
జననంబులు సృష్టి తెల్ల జనియించుటయున్

[భాగవతం 8 వ స్కంధం- 3 వ పద్యం )

( దనుజులు= రాక్షసులు, వేల్పులు= దేవతలు. సృష్టలు=బ్రహ్మలు) బ్రహ్మ దేవుడు రెండవరూపముధరించి స్వాయంభువ నామమున యశముగాంచుటయు, అతనివంశము రాజ్యమేలుటయు, వర్ణాశ్రమ ధర్మబద్ధులగు మానవు లుత్పత్తియగుటయు దానవులు, దేవతలు మున్నగువారు జన్మించుటయు, దక్షప్రజాపతి మున్నగు బ్రహ్మలు సైతము ఏర్పడుటయు తెలియగల్గితిమి. ఇంకను అట్టిపైన వ్యవహ రింపబడిన చరితమును వివరింపుమని పరీక్షిత్తుమహారాజు శుకయోగీం ద్రుని ప్రశ్నించెను అందుకు జవాబును భాగవతప్రమాణములందు కనుగొందము.

వ. ఇది ప్రథమమన్వంతరంబు. ఇంక ద్వితీయ మన్వంత రంబు వినుము.

సీ. స్వారోచిషుండన సత్త్వాఢ్యు బిడ్డగు
మనువు వానికి నాద్యుమత్సుషేణ
రోచిష్మదాదు లారూఢపుత్రులు ధాత్రి
నేలిరి రోచనుం డింద్రుడయ్యె

( భాగం అష్టమస్కంధం 15 వ పద్యం )

ప్రథమమన్వంతరముయొక్క చివరిభాగము వరకు అనగా 30 కోట్ల చిర పం॥ ల వరకు స్వాయంభువమనువుయొక్క వంశము లోనివారు రాజ్యమేలగా రెండవ మన్వంతరము వచ్చెను

ఆకాలమున స్వారోచిషుండను మహనీయుడు రెండవ మనువయి వ్యవహరింపఁదొడఁగె. అతనికి ద్యుమత్సుషేణ, రోచిష్మత్ అను పుత్రులుకల్గిరి. వారివంశములవారుకూడ బహుకాలము రాజ్యమొనరించిరి.

వ. తదనంతరంబ ( భాగ. అ. స్కం. )

| | | | | |
|---|---|---|---|---|
| ప్రథమ మన్వంతరకాలము | 30 | 67 | 20 | 000 |
| ద్వితీయ (రెండవ) ,, | 30 | 67 | 20 | 000 |
| | 61 | 34 | 40 | 000 |

సీ॥ మనువు మూడవ వాఁడు మనుజేంద్ర !
యుత్తముండన బ్రియవ్రతునకు నాత్మజుండు
పాలించె నిలయెల్ల బవన సృంజయ
యజ్ఞహోత్రాదు లాతని పుత్రు లధికగుణులు
[ 16 వ పద్యం ]

మూడవ మనువు ఉత్తముడు అను నామధేయము కల్గిన వ్యక్తియె యుండెను. అతనికి పవనుడు - సృంజయుడు - యజ్ఞహోత్రుడు మున్నగు వార లుదయించిరి. వారును ఆ మన్వంతరము పూర్తియగువరకు రాజ్య పాలనము జేసిరి.

ఈ భూమండల మేర్పడిన పిదప — అరువదియొక్క కోట్ల వత్సరములు గతించెను. అటుపైన మూడవ మనువు రాజ్యమునకు వచ్చిన కాలమున సైతము 30, 67, 20, 000 సం॥లు పూర్తిగావింపబడెను. ఆ లెక్క యంతయు జూతము.

ఇద్దరు మనువుల కాలము — 61, 34, 40, 000.
మూడవ మనువు కాలము — 30, 67, 20, 000

మొరశి 92, 01, 60, 000 సం॥

ముగ్గురు మనువుల రాజ్యకాలము పూర్తియగుపఁగికి షుమారు 100 కోట్ల సం॥ లయ్యెను

## గజేంద్ర మోక్షణకథ జరిగినదెపుడు ?

వ. చతుర్థ మనువు కాల ప్రసంగంబు వివరించెద.

[ 8 స్కంధం 17 వచనం ]

సీ. మానవాధీశ్వర ! " మనువు నాలవవాడు
తామసుం డనగ నుత్తముని భ్రాత
పృథివీపతులు కేతు - పృథు - నరఖ్యాతాదు
లతని పుత్రులు పద్గు రధికబలులు.

[ 8 స్కం, 18 పద్యం]

నాల్గవవాడైన మనువు తామసుండను నామమున వ్యవహరింపబడును. ఇతడు మూడవమనువుగా వ్యవహరించిన ఉత్తముండను వాని సోదరుండని యెరుంగుడు. ఆకాలపుప్రజలు కోటానుకోట్ల వత్సరములయినను జీవింపగల్గియుండిరనియు పాఠకులు మరువకుందురుగాక

తే. గీ. గ్రాహబద్ధుడయిన గజరాజు (గజేంద్రుని)
విడిపించి ప్రాణభయమువలన బాపి కాచె
హరి దయాసముద్రుం డఖిల లోకేశ్వరు
డనిన శుకుని జూచి యవనివిభుడు. (18 పద్యం )

మొసలిచే పట్టుబడినట్టి గజేంద్రుని రక్షింపదలచి దయాసముద్రుండగు శ్రీహరి మకరిని సంహరించెనని పై పద్యమునగలదు. నాల్గవమను కాలమున గజేంద్రమోక్షణము అను కథ జరిగియుండెననుచు భాగవతమునుండి దర్శింపగల్గితిమి.

భూమండలము సృష్టింపబడినపిదప మూడుమన్వంతరముల కాలము గతించెనని ఇంతకుపూర్వమే యుదహరింపబడెను. ఆనాటికే ప్రపంచవయసు 92 కోట్ల సంవత్సరములకుపైగా సిద్ధమైయుండెను. అటుపిమ్మట అనగా నాల్గవమన్వంతరమున గజేంద్రమోక్షణ చరిత్రము ఆరంభమాయెను. ఈరీతిగ కోటానుకోట్ల వత్సరముల

క్రిందట హిందుదేశముయొక్క చరితములను పొందుబరచిన భారతీయ వాఙ్మయము భారతీయుల కథాక్రమంబులను యెంతయోజాగ్రత్తగ వివరించియుండెననియు విజ్ఞులు గుర్తింపగలరు. మన బి. సి. లకుగాని, ఏ. డి. లకుగాని, ఎంతమాత్రము ఆ కథల కాలములు అందుబాటులో నుండవనియు నెరుంగుడు

జగము నిర్మింపబడిన పిదప — ఈనాడు మనము లెక్కజూచు కొనగా ఆ ప్రపంచమేర్పడి నేటికి—

195, 58, 85, 063 సం॥ గతించినదైనది.

దీనిలో ముగ్గురు మనువుల కాలమును అనగా

92, 01, 60, 000 సం॥లను తీసివేయగా

103, 57, 25, 063 సం॥లు మిగులును.

నేటి వెనుకకుం బోయినయెడల నీలోపల అనగా నాల్గవ మనువు యొక్క కాలమున గజేంద్ర మోక్షణము అను — కథ జరిగియుండెనని నిశ్చయయమగుచున్నది. ఈరీతిగ పూర్వకాలము నుండి భారతీయులు తమతమ జీవయాత్రలను సాగించి యుండిరని హిందుమత వాఙ్మయము నుండి నిదర్శనములెన్నియో కనుగొనవచ్చును.

ఈ మతమున నవతారపురుషులు ఒక్కరేకాదు. పెక్కుమంది యవతరించి యున్నారు. వారిలో ముఖ్యమగువారు పదిమంది యుండిరి. వారినే దశావతారములు అనుచుందుము.

మత్స్యః కూర్మ వరాహములు—
నరసింహ, వామన, భార్గవులు
రాఘవ, కృష్ణ, బుద్ధులు

అనునవి తొమ్మిది యవతారములు వచ్చిపోయినవి. ఇకముందు రానున్న అవతారము పదియవది కలదు. అద్దానిని "కల్కి" అవతా

రమనెదరు. కలియుగము పూర్తికానున్న సమయమున ఆ చివరభాగములో కల్కి పురుషుడు అవతరించగలడు. కలియుగముయొక్క వయసు 4 కోట్ల 32 లక్షలు. దానిలో 5063 సం|లు గతించినవి.

| | |
|---|---|
| 4, 32, 00, 000 | సం॥ ల లో |
| 5, 063 | సం॥ లను తీసివేయగా |
| 4, 31, 94, 937 | సం॥ లకు కల్కిపురుషుడీ లోకమున |

భరతఖండమునం దవతరింపగలడు. రాబోవు అవతారవిషయమును సైతము తూచిపెట్టినట్లు గణించుచు — వ్యవహరింపగల సామర్థ్యము హిందుమతమునగాక మరేమతమున జూపింపగలరు? కనుకనే హిందు మతము దైవమతమని వర్ణింపబడెను. జలప్రళయము ఎపుడు వచ్చునో! జలప్రళయ మేర్పడి తన్మూలమున నీ జగము ఆ నీటిలో ఏ నాడు మునిగిపోవునో అదియు లెక్కింపబడినది. అట్టి విషయమునుసైతము వచింపగల మతము హిందుమతముగాక వేరొకటిగలదా! లేదు.

| | | |
|---|---|---|
| ప్రపంచ వయస్సు | 432, 00, 00, 000 | సం॥ లనియు |
| అందు నేటివరకు గడచినవి | 195, 58, 85, 063 | సం॥ లనియు |
| వానిని తీసివేయగా | 236, 41, 14, 937 | సం॥ లు |

— శేషించుననియు, నేటినుండి ఇకముందు 236 కోట్ల చిల్లర సంవత్సరములకు జలప్రళయము సంభవించుననియు, హిందుమతము వివరింపగల్గెను. ఈ విషయమై బైబిలుమతమును ప్రశ్నింపుడు. జలప్రళయముమాత్రము రాబోవుచున్నదని వచించును. మరియొకమాట రెండవ జలప్రళయము రానేరాదనును.

ప్రళయము సంభవించునెడల అది యెంతకాలమునకు వచ్చునని యడిగినమీదట వచింపగలశక్తి తనకు లేదని దీనవదనమొందును.

ప్రపంచ మెప్పుడుపుట్టెను? అని ప్రశ్నించిన చూతము. జగము నిర్మింప బడినవిషయము సత్యమగును కాని ఎంతకాలముక్రిందట నిర్మింప బడినదో ఆ లెక్కను వివరింపగలశక్తియు తనకు లేదని తలవంచి పల్కును. తలయెత్తిపలుకుట కా గ్రంథమునకు ధైర్యమున్నచో శిరమును వంచవలసిన పని యేమున్నది?

మంచిది. పదియవ యవతారము కలియుగాంతమునవచ్చునని గ్రహింపగల్గితిమి. అవుగాక- నేటినుండి ఆనాటికి ఎంతకాలముపట్టునో తెలుసుకొందమా? వినుడు.

| | |
|---|---|
| కలియుగముయొక్క వయస్సు- | 4,32,00,000 సం.లు |
| అందు నేటివరకు గతించినవి | 5,063 సం.లు |
| వానిని తీసివేయగా శేషించినవి- | 4, 31, 94, 93, 7 సం.లు |

పైరీతిగ శేషించియున్న 4 కోట్ల 31 లక్షల చిల్లర వత్సరములందు కల్కిపురుషుడు రాగలడు. ఎన్నడో రాబోవువానినిగూడ హిందూమతము ముందుగనే వివరించియుండెను. ఆ మతమునకు దెలియని విషయము లేమికలవు? ఎవ్వియో కొన్ని తుచ్ఛప్రసంగములు తప్ప. విమాననిర్మాణచాతుర్యమును విద్యుచ్ఛక్తి ప్రసరణార్థమగు యంత్రతంత్రముల కౌశల్యమును గగనభాగమున గిర్రనదిరుగుచున్నట్టి నక్షత్రములసైతము సృష్టింపగల మేధాసంపత్తిని అవి యివి యననేల ఆగ్నేయాస్త్రములను, సమ్మోహనాస్త్రములను, అగ్నిస్తంభన, జలస్తంభన మున్నగు విద్యలందారితేరిన బుద్ధిప్రభావమును తుదకు బ్రహ్మాస్త్రప్రయోగ చాతురీధురీణతను మున్నగాగల శక్తుల నెన్నియో ఆ మతమున జేరియున్నవారు ఆర్జించియుండిరి.

అందలి విశేషములను ప్రమాణసహితముగ దర్శించు భాగ్యము పాఠకమహాశయులకు భారతవర్షము అనుభాగమున లభింపగలదు.

ఖైరీతిగ చతుష్షష్టి (64) కళలలో విభాజిల్లు హిందు మతము దైవమతమై యున్నదనుటకు ఎవరు శంకింపగలరు? ఎవరో భాషాపరిచయము లేనివారుతప్ప.

## దశావతారకాలములు

పూర్వకాలపు చరిత్రలు దైవసంబంధముగ నున్నను వాని లెక్కలనుమాత్రము పూర్ణముగ వివరింపగల శక్తిని హిందుమతమున దర్శింపగలము.

ఎంతయో యవసరంబని తోచినయెడల తదితరుల చరిత ములను, వాని కాలములను, అచ్చటచ్చట వర్ణించుటకుసైతము ఈ మతము వెనుకాడకుండును.

ఈ దేశమునుండి గురుండులు ( ఆంగ్లేయులు ) వెడలిపో యిన పిదప మానులు, నాగులు పాలింతురనియు అటుపైన పుష్యమి తుఁడను మహనీయుడవతరించి హిందుమతమును నశింపచేయ సమ కట్టినట్టి వ్యక్తులనోడించుచు హిందురాజ్యమును స్థాపింపగలడనియు రాబోవు విషయములనన్నిటిని ముందుగనే వివరించియుండెను. అట్టి మతమున జన్మించినట్టి భాగ్యము పుణ్యాత్ములకు దప్ప తదన్యులకు ఏమాత్రము సంభవింపనేరదు.

### దశావతారముల కాలములు

మన దేశమున దశావతారముల చరితములు అత్యంత ముఖ్యములు. కావున వాని కాలముల నొకమారు తిలకింతము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| మత్స్యావతారము- | 12, | 49, | 02, | 481 | సం. లు |
| కూర్మావతారము- | 12, | 07, | 00, | 483 | ,, |
| వరాహావతారము- | 10, | 58, | 08, | 886 | ,, |
| నృసింహావతారము | 8 | 64, | 59, | 143 | ,, |
| వామనావతారము | 4, | 40, | 45, | 004 | ,, |

| | | |
|---|---|---|
| పరశురామావతారము | 1, 46, 45, 064 | సం॥లు |
| శ్రీ రామావతారము | 1, 46, 16, 014 | " |
| త్రిపురసంహారసమయమున నవతరించిన బుద్ధావతారము- | 46, 31, 078 | " |
| కృష్ణావతారము | 5, 189 | ,, |

ఈరీతిగ దైవసంబంధమగు భూమిలో అనగా భారతభూమి యందు అవతరించిన దశావతార చరితముల కాలమును తెలియ గలిగితిమి.

త్రిపురాసుర సంహారకాలమున నవతరించిన బుద్ధావతార కాలమున్ను గుర్తించియుంటిమి.

త్రిపురసంహారకాలమున నవతరించిన బుద్ధభగవానుడు తన పనిని ముగించుకొనిన యనంతరము - శాంతచిత్తుడై కూర్చునియుండగా దేవతలామహనీయుని జేరి యీ క్రింది విధముగా బల్కిరి. ఆ విషయమంతయు భవిష్యపురాణముననే యుదహరింపబడెను.

బుద్ధభగవన్! ఓ మహాత్మా! వర్ణాశ్రమధర్మముల నాచరించిన పిదప-తత్ఫలితముగ సంభవించిన చిత్తశుద్ధిని గాంచి_సర్వోన్నతంబగు పదవిని లభింపజేయు సాధనమును అనగా దివ్యజ్ఞానమును ఉపదేశించిన యవసరము కలదు. అట్టి యుపదేశము ఆత్మోద్ధారకం బగును.

అటుగాక - అహంకార మమకారములు రెండును జీవుని బాధించుచుండగా అట్టివారలకుదివ్యజ్ఞానము బోధించునెడల - ఆ జ్ఞానము అర్హతలేనివారిహృదయములలోజేరి వారిని కష్టములపాలొనరించును. కనుకనే త్రిపురాసురుల- భార్యలు మమకారపీడిత మనస్కులైయున్న సమయమున "ఓ బుద్ధభగవానుడా! తమచే బోధింపబడిన దివ్యమగు వేదాంతభావమును విపరీతముగ నర్థముచేసికొనుచు యీపాపఫలముచే తమభర్తలను పోగొట్టుకొనిరి దుష్టులగుత్రిపురాసురులను సంహరించుట కయి తాము ఈరీతిగ వెలయుచున్నట్టి బోధను గావించియుంటిరి,

రాబోవు కలియుగంబున సైతము షుమారు రెండువేలేండ్లు గతించిన పిదప నారీతిగ మిట్టవేదాంతమునుబోధింపవలసిన యవసరమువచ్చును. ఆ సమయ మెట్టిదన— అర్హతలేనివారెల్లరు స్వార్థపరులగుచు శాస్త్రములలోని మర్మములందెలియక బాహ్యాడంబరములం దనురక్తులగుచు మాటిమాటికి యజ్ఞములం జేయుచుందురు. అట్టి మూఢవిశ్వాసముం దొలగించి యా దుష్టులను భ్రష్టులను చేయవలసిన యావశ్యకత ఎంతేని కలదు. అత డీత డననేల! ఎందరో కుచ్ఛితులు స్వతంత్రబుద్ధిచే వేదమంత్రముల కపార్థములు గల్పించి స్వచ్ఛమగుమతమును మంటిపాలొనరింపగలరు. అట్టివారిం జేరి – అనగా పరిపక్వదశరానట్టివారిని సమీపించి యీ మిట్టవేదాంతమును బోధించుటకుగాను మీ యంశను బంపి యా పనిని పూర్తిగావింపుడు, అని విన్నవించిరి. ఆ కారణముచే బుద్ధభగవానుడు తనలోని కొంత యంశమును తననుండి వెలుపల జేర్చి గౌతమబుద్ధునియందు ప్రసరింప జేసెను. ఆనాటి గౌతమబుద్ధుడుసైతము ఒకానొక దివ్యపురుషుడుగ భావింపబడెను. కావున సరియగు బుద్ధావతారమును త్రిపురాసుర సంహారమునకై యవతరించినదానినిగనే వివేకులు భావించుచుందురు.

## -: హిందూచక్రవర్తుల కాలములు :-

హిందుమతము ననుసరించి రాజులు వేరుగనుందురు. వారుగాక చక్రవర్తులు కూడ గలరు. వీరు పైవారిని మించిన వారలగుచు కీర్తింపబడుచుందురు. వారివారి కాలములం దెలియుదము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | హరిశ్చంద్రుని కాలము | 11, | 98, | 24, | 246 సం |
| 2. | నలచక్రవర్తి కాలము | 10, | 36, | 17, | 053 సం |
| 3. | పురుకుత్సుని కాలము | 9, | 36, | 17, | 053 సం |
| 4 | పురూరవుని కాలము | 8, | 16, | 12, | 025 సం |
| 5. | సగరచక్రవర్తి కాలము | 5, | 10, | 28, | 472 సం |
| 6. | శిబి చక్రవర్తి కాలము | 4, | 14, | 80, | 838 సం |

## సుప్రసిద్ధులగు రాజుల కాలములు

| | | |
|---|---|---|
| 1. | అంబరీష మహారాజు | 4, 08, 31, 058 సం॥లు |
| 2. | గయుడు | 3, 99, 20, 468 " |
| 3. | పృథుమహారాజు | 3, 22, 08, 894 " |

ఇంకను మరెందరో కలరు.

| | |
|---|---|
| యయాతి మహారాజు | 3, 10, 31, 054 సం॥లు |
| శశిబిందుమహారాజు | 2, 70, 28, 821 " |
| మాంధాత మహారాజు | 2, 34, 40, 191 " |
| భగీరథుని కాలము | 2, 15, 05, 951 " |
| భరతుని కాలము | 15, 60, 40, 457 " |

(ఇతడు దుష్యంతుని కుమారుడు)

| | |
|---|---|
| దిలీప మహారాజు | 1, 56, 08, 991 " |
| రావణుని కాలము | 1, 46, 27, 056 " |
| కార్త్యవీర్యార్జునుని కాలము | 1, 25, 47, 176 " |
| రంతిదేవుని కాలము | 1, 20, 37, 328 " |
| నహుషుని కాలము | 1, 20, 37, 328 " |
| ఇంద్రద్యుమ్నుని కాలము | 1, 12, 25, 514 " |

### -: భారతీయు లనిన నెవరు ? :-

పాఠకులారా ! మనము వసించుచున్నభూమి భారతదేశము. ఇందు నెలకొల్పబడినది భారత ధర్మము. అద్దాని నాచరించువారు భారతీయులు - అని నిశ్చయించుకొని తమ మాతృభూమిని ప్రేమించుచు నందలి ధర్మమును అనగా భారతీయధర్మమును వృద్ధిపరచుట ప్రతి భారతీయునకు ముఖ్య కర్తవ్యము. వర్ణాశ్రమ ధర్మబద్ధులై యున్నవారే భారతీయులని వేదమతమున వివరింపబడెను. దానిం గ్రాంతము.

"యే దేవా దేవసువస్థ ఇమమాయుష్యాయణ మన మిత్రాయ సువధ్వం మహతే క్షత్రాయ మహత ఆధిపత్యాయమహతే జాన రాజ్యాయైషవో 'భరతా' రాజా సోమో౽స్మాకం బ్రాహ్మ ణానాం రాజా"

(కృష్ణయజుర్వేదం. కాండ 8 వ ప్రపాఠకం, 10 అను)

బ్రాహ్మణులు, మున్నగు వర్ణములవా రుండిరని పై మంత్రమున 'భరతాః' అను పదముచే సూచింపబడెను. విద్యారణ్యస్వామి ఆ మంత్రమును వ్యాఖ్యానించునపుడు—

హే భరతాః రాజన్య వైశ్యాదయో హేధనికాః
ఏషః = ఏషయజమానః
సః = యుష్మాకం రాజా

ఏనం స్వామినం యథోచితం సేవధ్వం ఇత్యభిప్రాయః"
అని ప్రకటించి యుండిరి.

'భరతాః' అను పదమునకు "రాజన్యవైశ్యాదయో" అనునట్టి అర్థమును స్పష్టపరచి యున్నారు.

భారతీయులనగా రాజన్యులు (క్షత్రియులు)
వైశ్యులు
మరియు
బ్రాహ్మణులు
బ్రాహ్మణేతరులు
అని ప్రకటింపబడెను.

వైశ్యాః అని యుండక వైశ్యాదయః అని యున్నందున ఆదయః అను దానిలోని "ఆది" అనుశబ్దముచే బ్రాహ్మణ శాబ్రాహ్మణేతరులున్ను సూచింపబడిరి.

వేదమున నాలుగు వర్ణములు

బ్రహ్మ స్రుజ దిదగ్ సర్వం

తస్మా ద్బ్రాహ్మ్య మభవ త్సర్వం
వర్ణ్యం వర్ణా త్సంబభూవ।
తస్మా ద్బ్రాహ్మణా హిరణ్మయాః
క్షత్రియా రక్తాః
పీతా వైశ్యాః
కృష్ణా శ్శూద్రాః
(పై మంత్రము అధర్వణ వేదము లోనిది.)

ఆదికాలమున బ్రహ్మదేవుడు ఈ జగమును నిర్మించియుండెను.

బ్రహ్మచే సృజింపబడిన దగుటచే -
"బ్రాహ్మ్యం అభవత్ సర్వం"
ఈ సమస్తము బ్రాహ్మ్య మనబడెను.

అయితే ఆయా ప్రకృతిభేధముల ననుసరించి భిన్నవర్ణములతో రాణించుచున్న సూక్ష్మదేహములకు ఆలవాలమగు అణువులు బ్రహ్మదేవుని శరీరమునుండి విడివడినవయి వెంటనే సూక్ష్మదేహములుగ నేర్పడి పయనము సేయుచు ఈ ప్రపంచమునకు వచ్చుచుండును. మార్గమధ్యమున పాంచభౌతిక దేహముల నేర్పరచుకొనినవి. ఆరీతిగ గడుసుపారిన శరీరములతో విలసిల్లుచున్న రూపములనే జాతులనుచు మనపూర్వులు వ్యవహరించిరి. సూక్ష్మదేహములందు మాత్రమే వర్ణములు అనగా రంగులు గోచరించును. అవి స్థూలరూపముగ సిద్ధమై యీ లోకమున జన్మించినపుడు అవి పుట్టియుండిన (జాతాః) కారణముచే నారీతిగ రూప ధారణమును పొందిన విగ్రహములయొక్క సమిష్టితత్వము జాతిగా వ్యవహరింపబడెను.

"ఋగ్భ్యోజాతం "వైశ్యం" వర్ణ మాహుః
యజుర్వేదం "క్షత్రియ" స్యాహు ర్యోనిం
సామవేదో "బ్రాహ్మణానాం" ప్రసూతిః
(కృష్ణయజుర్వేదం)

పై మంత్రమున -

"వైశ్యం వర్ణం జాతం"

అను వాక్యముండెను. వైశ్యవర్ణము పుట్టెనని దానియర్థము.

"పీతా వైశ్యాః"

– అను అథర్వణవేదమంత్రము ననుసరించి, వైశ్యులవర్ణము (రంగు)పీత(పచ్చని)వర్ణమని తెలిసికొనవలెను. ఆ రంగు మన కనులకు గోచరించునదికాదు. ఎందు కన - మనస్సంబంధమగు సత్వ, రజస్తమో గుణములకు అనుగుణమైన తెలుపు, ఎరుపు, నలుపు రంగుల విషయమై వేదమున వర్ణింపబడెను.

సత్వగుణము : తెల్లనిరంగు గలది
రజోగుణమునకు : ఎఱ్ఱనిరంగు
తమోగుణము : నల్లనిరంగుతో నుండును

అను విషయము వేదాంతగ్రంథములందు కలదని యెల్లరకుం దెలియును. ఆ రంగులను మూడవకన్నుతో గుర్తింపవచ్చును. అనగా దివ్యదృష్టిలో కనుగొననగును. విదేశములలోని మనుజుల రంగులు బాహ్యదృష్టికి గోచరించునవియై వెంటనే మనరెండుకన్నులతో దర్శింపబడును. నీగ్రోజాతివారిరంగు నల్లనిది. కకేశియా జాతివారిరంగు యెఱ్ఱనిది. ఆంగ్లేయులు, మున్నగువారిరంగు తెల్లనిది. చైనావారిది పచ్చనిరంగు. ఇవ్విధముగ నాల్గు వర్ణములవారు విదేశములందు కలరు. కాని భారతదేశమునమున్న చతుర్వర్ణములవారు ఈ రీతిగ బాహ్యవర్ణములతో వ్యవహరింపబడరు. వారి నాల్గువర్ణములు మానసికములై యున్నవి. అవి సూక్ష్మదేహములందు ప్రత్యక్షమగును. మహర్షులు దివ్యదృష్టినికలిగిన మహనీయు లగుటచే – నా యా రంగులనుగాంచి – ఏయేవర్ణములవారెవ్వరో గుర్తింపగల్గిరి. సూక్ష్మదేహములతో నాకసమునుండి క్రిందకుదిగుచు ఆ కాలపు వాతావరణము ననుసరించినవై స్థూలరూపము జెందును నాల్గు వర్ణములుగల దేహములుగా

స్థూలరూపమును పొందుచు — ప్రత్యేకతరగతుల మాదిరి యీలో కమున జన్మించియుండినవి. అనగా జాతమయినవని యర్థము.

> జాతః అను శబ్దమున కర్థము "జనించెను." జాతి అను శబ్దమున కర్థము జననమందినది అని యెరుంగుడు. అదియే సమిష్టిగ నేర్పడినపుడు ఒక్కొక్క జాతియై రాణించియుండెను.

జాతమైనందున

జాతులు అను నామమున వ్యవహరింపబడెను. బాహ్యమునకు పుట్టుకచే ప్రధానమైనవగుచు— మరియు అంతరంగికముగా గుణ ప్రధానములగుచు - నీ రీతిగ నొక్కొక్క సమయమున జన్మ ప్రధానములుగను - మరియొక సమయమున గుణ ప్రధానములుగను వ్యవహరింప బడుచున్నవి.

తమ్మునికంటె అన్నగారు ముందుగ పుట్టియుండును. కాన జన్మ ప్రధాన సిద్ధాంతము ననుసరించి తమ్ముడు అన్నకు నమస్కరించవలెను. అన్నగారికంటె తమ్ముడు గుణముచే నధికుడైనప్పుడు అతని యన్నగారు తమ్ముని విధిగా గౌరవింపవలెను. తమ్మునివద్ద గొప్ప గొప్ప విద్యలను నేర్చుకొనివలసిన దుస్థితి కలిగినప్పుడు జన్మ ప్రధానమును పాటింపక నా తమ్ముని నమస్కరించుటయు అన్నగారికి న్యాయమగుచుండును. అల్లుడు సర్వవిధముల తనకంటె నధికుడు కాకున్నను – కన్యాదాన సమయమున నతనియందు శ్రీ మహావిష్ణువును ఆవాహనము జేసియున్నందున కన్యాదాన సమయమున మామగారు తన అల్లుని కాళ్ళు కడుగుచు నమస్కరించుచున్నాడు. ఆ యా సందర్భముల ననుసరించి జన్మ ప్రాధాన్యము — గుణ ప్రాధాన్యము అనునవి రెండును వ్యవహారమున ప్రచలితము లగుచునే యుండును. కావున హిందుదేశములోని జాతులు రంగులతో కూడి యున్నవై యుండలేదు చుండవు.

అట్టి వర్ణ (రంగు) భేదములం బెట్టుకొనినవారు విదేశీయులు. కనుకనే వారు నిరంతరము ఒకరినొకరు ద్వేషించుకొనుచు కొట్టుకొను టయేగాక చంపుకొనుచుండు దురభ్యాసమును కలిగినవారలగుచుండిరి. తమయందు నెలకొనియున్న ఆ వర్ణభేదమును భారతీయులపై రుద్దుచు వీరిలో వీరు కలహించుకొనుటకై విదేశీయులు జాతిభేదములు అను మిషబెట్టి హిందువుల మనస్సులయందు నిప్పును రగిలించుచున్నారు. క్రీస్తుగారి బుద్ధియే వారి శిష్యులకు సంప్రాప్తమైనది.

“నేను ఈ భూమిమీద అగ్ని పెట్టుటకు వచ్చితిని.” ...... లూకా వార్త 12 అ. 49 వ. అనుచు ప్రత్యేకముగా అదియొక ఘనకార్యమని తలచి క్రీస్తు గారు బోధించియుండిరి. కనుకనే విదేశీయులు తమ యిరుగుపొరుగువారిపై నిప్పుకణికలనురాల్చుచునుందురు. అనగా అన్యులమనసులను మండించుచుందురు. “హంటింగ్ నేషన్” అను బిరుదము విదేశీయులకుండెను. ఆ పేరు ఊరకనే యుండునా? విదేశీయులు వేటాడు జాతియను బిరుదమును పొందియున్నారని మరువకుడు. అన్యులపై విరుచుకుని పడుచుందురని భావము. మరియు నితరుల రక్తమునంతయు పీల్చి పిప్పి జేయుచుందురు. అది వారికి స్వధర్మమై యున్నది.

పై రీతిగ బ్రాహ్మణాదివర్ణములు భరతఖండమున నుద్భవించిన కారణమున వర్ణధర్మములు కల్గిన ప్రత్యేక మనుష్యవర్గము ఈ భరతఖండముననే వ్యవహరింపబడెనని బుద్ధిమంతులు గుర్తింపగల్గిరి. విదేశీయులు యోగవిద్యచే సాధింపదగిన సూక్ష్మదృష్టిని పొందినవారు కానందున వారికి మనస్సంబంధమగు నాల్గురంగులు తెలిసినవికావు. అందుకనియే ఆ విదేశీయులు ఆంతరంగికబుద్ధిభేదములచే విలసిల్లుచున్న నాల్గువర్ణములవారిని గుర్తింపలేకపోయిరి. ఇక విదేశీయులకు వర్ణాశ్రమ ధర్మము లేలయుండును? అది వారి కర్మము.

## హిందూమతములోని విశిష్టత

పై రీతిగ నేర్పడిన _

[1] అంతరంగికవర్ణములు నాల్గుకలవని హిందుమతము వివరించియున్నది.

[2] జన్మవిషయమునసైతము అనగా జన్మము లనేకములుకలవు అవికూడ హిందుమతమున సూచింపబడెను. ఆ విషయమున్ను విదేశీయులకు దెలిసినది కాదు.

ఇవ్విధంబుగ దెలివిగల విషయము లెన్నియో వారు తెలియజాలకపోయిరి. ప్రతిమానవునకు జన్మము లనేకములుకలవని అనగా పునర్జన్మము లుండెనని హిందుమతమున నిరూపింపబడెను. దీనిని క్రైస్తవమతెము అంగీకరింపదు.

[3] హిందుమతమున మరియొక ప్రత్యేకతయు గోచరించునని యెరుంగుడు. మృతులయినవారి నందరిని అనగా అనంత సంఖ్యాకులయినవారిని మేఘమండలమునం దెద్దియో యొక తావున నిల్పుటకు హిందుమతము సమ్మతింపజాలదు.

అనగా ఆ తావునుండి పరలోకమునకు బోనీక లోకమంతయు జలమున మునిగిపోయినపిదప తీర్పుదినము నొకదానిని నిర్ణయించుచు ఆనాడుమాత్రమే వారి పుణ్య-పాపములను దేవుడు విచారించుచుండునని నిర్ధారించినది కాదు. మృతులయిన నరులు ఏ కాలమునకు చెందియున్న వారలైయున్నను వెంటవెంటనే పరలోకముల కేగుచు పుణ్యపాపములకుం దగినరీతిగ నా యా లోకములందు సుఖదుఃఖముల ననుభవింతురని హిందుమతము ప్రకటించియున్నది.

[4] దేవునకు తలి-దండ్రు లుండరనియు, కావుననే యాదేవు డవతరించినప్పుడుకూడా ఒకానొక స్త్రీగర్భమునుండి జనించు

డనియు బోధించు చుండును. ఆ దేవుడు పరలోకమున తనకు సహజముగనున్నట్టి దివ్యరూపముతోడనే భక్తులకు సాక్షాత్కరించి అటు మీద వారికోర్కెపై స్థూలరూపమునుపొందుచు ఒకానొక బాలుని వలె నవతరించునని హిందుమతమున వివరింప బడెను. ఇట్టి విశిష్టత ఒక్క దైవమతమునగాక మరెందును కనుగొన జాలము.

## -: దేవుడు - దేవతలు - వారి దేహములు :-

అసలు - దేవుడుగాని - దేవతలుగాని - ఎట్టివారై యుండిరో ముందుగ దెలిసికొనవలెను. దేవు డొక్కడే కలడు. అతడు నిరాకారుడై మరియు నిస్సంకల్పుడై యుండును. అట్టి సమయమున సృష్టి విషయక ప్రసంగము ఆ మహాత్మునియందు ఏమాత్రమైనను నిల్చి యుండుటకు వీలులేనందున నిశ్శబ్దబ్రహ్మమై యుండెనని యెరింగివం జాలు. మొదట సంకల్పములు లేనివాడయ్యె. క్రమక్రమముగ ఏదోయొక నాడు సృష్టికై సంకల్పించియుండెను. అట్టిదశయందు మాయాప్రభావమున శబ్ద బ్రహ్మమై రాణింపగల్గెను. నిశ్శబ్దస్థితియం దంతర్గతంబై రాణించుచున్న శబ్దము - వెలుపలకు వచ్చి నాదరూపమున వ్యక్తమగు చుండెను. ఈ రీతిగ నిరాకార - సాకార తత్త్వములతో విరాజిల్లు బ్రహ్మ మొక్కడే కలడని హిందుమతము సిద్ధాంతము చేసి యుండెను. ఆ శబ్దబ్రహ్మము ఒక్కటిగనున్నను - మాయాబలంబున వివిధరూపములుగ వ్యక్తమగుచు భిన్నభిన్న దేవతారూపములై భాసింపదొడగెను

6. ఇచ్చట మనకు గోచరించుచున్న భూలోక మొక్కటే కాదు. దేవలోకములుసైతము ప్రత్యేకముగ నక్షత్ర మండలములందున్నవి. అందు వసించువారు "దేవతలు". వారి శరీరములు భూలోకవాసుల దేహములరీతి మట్టితో నిర్మింపబడినవి కావు. వెలుగుతో రూపొందింపబడి - ధగద్ధగాయమాన ప్రభతో భాసించు చుండును. వారికి ఆకలి దప్పికలు లేవు. ఇక వ్యాధు లెక్కడివి?

మరియు శుక్లశోణితములు సైతము ఆ దేహములలో నుండుటకు వీలులేకుండును.

## -: దేవతలకు కామేచ్ఛ యుండదు :-

దేవతలు తమతమ భార్యలంబొంది సంతతిని కనిరనియు — మరియు నితరస్త్రీలను జేరుచు నీచవృత్తికిందిగి యుండిరనియు పురాణములయందుదహరింపబడలేదా యని భాషాసాంప్రదాయముల నెరుంగని వారు బాహాటముగ వివదించుచుందురు. పాపము! వారి యజ్ఞానమును గూర్చి చింతింపవలసియున్నది ఆ విషయమై దివ్యమగు చర్చ జరుగును. శ్రద్ధతో నాలకింపుడు.

దేవతలయందును స్త్రీ - పురుషులు అను రెండుజాతులు కలవు. భార్యా - భర్తలు అను నామమును కల్గి వ్యవహరించుటయు ఆ లోకమందుండెను. కాని శారీరక సౌఖ్యసంబంధమగు వాంఛ అనునది మృగ్యము (లేదు). ఎందుకన నిరంతరము స్వయముగ నానందమయులై యుందురు. ఉపనిషత్తులలోని ఆనందవల్లిని పఠించిన వారు అందలి సత్యమును గుర్తింపగలరు. వేరొకభాగమున నామంత్రములం జూడనగును. ఇక ప్రత్యేకముగ నానందముకొరకు దేవతా పురుషులుస్త్రీలను వాంఛించు టెందులకు? సంతతి యభిలషింతురేని సంకల్పబలమున శిశువును సృష్టింపగలరు. సృష్టికర్తయగు భగవానుడు సైతము - సంకల్పబలము చేతనే ఈ సమస్తమును సృజించెనని యెరుగమా! దేవతలు దేవజాతికిం జెందిన కారణమున వారును దేవునివలె సంకల్పబలముతో ప్రజలను సృష్టింపగలరు. ఆయా దేవతలను వరులు ప్రార్థింతురేని — వారిలో తమతమ మానసిక శక్తులను అనగా దివ్యతేజమును ప్రసరింపజేయుచు . సంతతి ననుగ్రహింతురు. ఇక నన్య వనితలను బొందిరనుట — సత్యదూరము కదా! యింద్రుడహల్యను — చంద్రుడు తారను — బ్రహ్మ సరస్వతిని పొందగుండిరనుటయెట్లు ?

-: ఋషులు సైతము స్త్రీలను పొందియుండరు :-

మహర్షులు దైవశక్తి నార్జించిన వారలగుటచే సంకల్ప బలము తోడనే స్త్రీలయందు శిశువుల నుత్పత్తి జేయగలిగిరి. అంతియే గాని శరీరసంబంధమగు మైథునమునకై యాశపడువారు కారు దేవతలు యీ లోకమున నవతరింపదలచినను— వారిని జన్మింపజేయుటకు గాను యెవరో యిరువురుదంపతులు — ఒకరినొకరు కలియుచు గర్భమును జేసికొని- ఆ గర్భమునుండి దేవతలను క్రిందకు దింపవల సిన యవసరము లేదు. పరలోకమున విహరించుచున్న దేవుడు- ఈ లోకమున స్వయముగ నవతరించి శ్రీరామచంద్రుడయి వ్యవహరిం చినరీతి అతని పత్నియగు సీతామహాదేవియు నీ ధరాతలమునకువిచ్చే సి అయోనిజయై దర్శనమొసంగెను. జగజ్జనని యగు సీతయు జగత్ప తియగు శ్రీరామచంద్రుడున్ను తల్లిదండ్రుల గర్భములనుండి జన్మిం చియుండరని హిందూ పురాణములు వ్యక్తీకరించి యున్నవి. సీతా మహాదేవి విషయమై

"తల్లి కడుపునుండి జన్మింపకయే"

యవతరించెనని యెల్లరెరింగియే యుండిరి. ఆ సీతాదేవి జనక చక్రవ ర్తికి నాగేటిచాలులో దొరికెనని వినమా! ఇక శ్రీరామచంద్రుని విషయమున్నూ అటులనే స్వయముగ నావిర్భవించెనని నిరూ పింపబడెను. అందుకుందగిన ప్రమాణములు మున్ముందు చదువరులు పఠింపగలరు. అంతవరకు వేగిరపడుచు నీచాతినీచముగా వ్యవహరింప రాదని ప్రార్థన. దేవదేవుడను వాడెవడో! అతడే, స్వస్వరూపమున నీలోకమునకు విచ్చేసి శ్రీకృష్ణపరమాత్మయై యవతరించెను. కనుకనే దేవకీదేవి యెదుట పురిటింటిలో చతుర్భుజముల తోడను, శంఖ, చక్ర- గదా - పద్మ - కిరీటములతోను- పీతాంబరధారియై ప్రత్యక్ష మయ్యెను.

దశమస్కంధమున పూర్వభాగములో కృష్ణావతారఘట్టమును జూడుడు. శ్రీకృష్ణుడు కారాగారమున నవతరించినపుడు అతనిరూపము ఈ క్రింది విధముగ వర్ణింపబడెను.

## కృష్ణుడవతరించినపుడు ఆతని రూపము

సీ. జలధర దేహు, నాజాను చతుర్బాహు
సరసీరుహాక్షు విశాలవక్షు
జారు, గదా, శంఖ, చక్ర పద్మవిలాసు
కంఠ కౌస్తుభ మణికాంతి భాసు
గమనీయ కటిసూత్ర కంకట కేయూరు
శ్రీవత్స లాంఛనాంచిత విహారు
నుగకుండల ప్రభాయుత కుంతలలలాటు
వైడూర్య మణిగణ వరకిరీటు

తే. బాలు, పూర్ణేందు రుచి జాలు, భక్తలోక
పాలు, సుగుణాలవాలు, గృపావిశాలు
జూచి తిలకించి, పులకించి, చోద్యమంది
యుబ్బి చెలరేగి వసుదేవు డుత్సహించె.

112 వ పద్యం.

కృష్ణుడు అవతరించినపుడు ఆ దేవునకు

చతుర్బాహు = నాలుగు భుజములుండెను.
చారుగదా శంఖ = హస్తములందు గదయు శంఖము
చక్ర పద్మవిలాసు = చక్రము, పద్మమున్ను కలవు.
కటిసూత్ర కంకణ కేయూరు = మొలత్రాడును కంకణ కేయూరములున్ను ఉండెను.

వైడూర్య మణిగణవర కిరీటు = వైడూర్యములు - మణులు మున్నగువానిచే నలంకరింపబడిన కిరీటమును సైతము అతడు ధరించియుండెను.

పై రీతిగ నవతరించిన వ్యక్తిని — లోకములోని శిశువులక్రింద నంటగట్టుచు - మాతృగర్భమునుండి జన్మించియుండెనని వచించుటకు

నోరేటులవచ్చును ! పోనిండు ! అట్టి లక్షణములు కల్గియున్నట్టి ఒకానొక వింతబాలుడు పుట్టెనేమోయని సంశయించుదమనిన - ఈక్రింది పద్యమును, మఱియు వచనమును పఠించిన పిదప సత్యమెరుగయవచ్చు.

మత్తకోకిలము: ఒంటికల్చి పురాణయోగులు యోగమార్గ నిరూఢులై! 'కంటి' మందురు, కాని నిక్కముకాన; రీ భవదాకృతిన్! గంటి; భద్రము గంటి; మాంసపుకన్నులం గనబోల;దీ "తొంటి రూపు దొలంగబెట్టుము" తోయజేక్షణ! మ్రొక్కెదన్.
కృష్ణపరమాత్మ బాలరూపముననే జన్మించియున్నయెడల -

"తొంటిరూపు తొలంగబెట్టుము." అని దేవకీదేవి ప్రార్థించి యుండదు. తొంటిరూపు అనగా దేవలోకమున నున్న రూపము. అది నాలుగు భుజములతోడను, శంఖ చక్ర గదా కిరీటములతోడను వెలయుచున్నట్టి శ్రీ మహావిష్ణువుయొక్క రూపము అని యర్థమగు చున్నది. ఇక నా దివ్యపురుషుని సామాన్యబాలునిగ నెవ్వరూహింప గలరు! ఆ దేవకీదేవి - దేవదేవుని ప్రార్థించినపిదప నెవ్వియో కొన్ని మాటలంజెప్పి యటుమీద తన దివ్యరూపమును విడిచిక్రింది విధముగ మారెను.

## సాక్షాత్కరించినదేవుడు ఆ రూపమునుమార్చి బాలుడగుట

వ. అని యిట్లుపలికి - ఈశ్వరుం డా రూపంబు విడిచి

(135 వ వచనం)

క॥ తెప్పలిడక తలిదండ్రులు
దప్పక తనుజూడ మాయదనరి లలితుడై
యప్పుడటుగన్నపాపని
యొప్పున వేడుకలు సేసె నొకకొన్ని నృపా!

136 వ పద్యం.

ఆ దేవుడు దివ్యమగు దేవతారూపమును విడిచి క్రొత్తగా నొక శిశువు కల్గినయెడల నాబిడ్డ యేరీతిగ నుండునో అదేవిధంబుగ నొక చిన్నరూపముతో సిద్ధమై యా తల్లిదండ్రులకు సాక్షాత్కరించెను. అని పై పద్యమున విశదీకరింపబడెను. కావున కృష్ణభగవానుడా తలిదండ్రులయొక్క కడుపులోనుండి జననమందినవాడు కాడని యర్థము జేసికొనవలెను. కొందరికి పై వాక్యములు రుచించునవియై యుండవు. ఒకవేళ బుద్ధియందొకింతభాగము తగ్గుబడినదేమో. కనుకనే తాము జన్మించినవిధముగ దేవదేవుడు సైతము పుట్టియుండెనని వాదింపజూచుదురు. అట్టి యజ్ఞులకు ఎవరు మెప్పింపజూతురు. దిష్టిబొమ్మలవలె ప్రత్యేకముగ నచ్చటచ్చట కొందరుండుటయు అవసరమగును. దేవుడు తన దివ్యరూపమును విడిచి బాలుడై సాక్షాత్కరించి యున్నను నిజముగ నాతడు దేవదేవుడై యుండెనుగదా?

## కృష్ణుని మహిమలు

కనుకనే అయిదేండ్లు వచ్చెనో లేదో క్రీడలెన్నియో జరిపి తాను దేవదేవుడనని ఋజువుచేయగల్గెను. పదునొకండవయేట వచ్చినప్పుడు బృందావనమువీడి మధురానగరమున కరిగెను అచట కంసుని జంపెను. అది మొదలు నూటపదునైదేండ్లు జీవించియు గోపికలున్న తావునకు అనగా బృందావనమునకు తన యౌవనదశయందు ఎన్నడును వచ్చినవాడుకాడు. విశ్వరూపమును జూపుటయు, కార్చిచ్చును మ్రింగుటయు, పగటిని రాత్రిగా చేయుటయు ఆవులను, బాలురను, వేలకువేలు సృజించుటయు, ఎన్నిసంవత్సరములక్రిందటనో చనియున్న వారిని బ్రతికించుటయు, జలక్రీడను, రాసక్రీడను గావించుటయు మున్నగాగల పనులన్నిటిని పదేండ్లలోపలనే ముగించియుండెను. ఈ పని మనుష్యమాత్రుడు పాఠకులెల్లరు మరువకుందురు గాక. అట్టివానిని దేవదేవుడని కీర్తింపజాలక మానవుడనుచుండుటకు నోరెట్లువచ్చును. మరియొక దృష్టాంతమును జూపెదను. ఓ యశోదా! నీబిడ్డడు కొంటెపనులను చేయుచున్నాడు. ఇదేమి చోద్యము. అని

గోపికలతల్లులు క్రీడించినపుడు ఆ యశోదమ్మ తెల్పిన పరిత్యక్తార ములవలన నా కృష్ణభగవానుని వయసు నిర్ణయించుకొనవచ్చును.

గోపికలారా ! మా చిన్నికృష్ణుని వయసును ఒకమాటు విన్న వించెదనని యీ క్రిందివిధముగ పల్కెను.

## గోపికలతో క్రీడించినపుడు కృష్ణుని వయస్సు

క. చన్నువిడిచి చనడిట్టటు
నెన్నడు బొరుగిండ్ల త్రోవలెరుగడు నేడున్
కన్నులు తెరువని మాయీ
చిన్నికుమారుని రవ్వసేయందగునే. 331 పద్యం.

తే. అన్య మెరుగడు తనయంత నాడుచుండు
మంచివాడీత డెగ్గులు మానరమ్మ
రామలార ! త్రిలోకాభిరామలార
తల్లులార ! గుణవతీమ తల్లులార !

332 పద్యం

తల్లులారా ! మా బిడ్డ ఎన్నడును నా రొమ్మును విడచి అటునిటు బోవువాడుకాదు. పొరుగింటికయినను వెళ్ళగల ఈడు ఇంకను వచ్చినదికాదు కన్నులైనను బాగుగ తెరచి సంచరింపనేరకున్నాడు ఇతరమైనదానిని యెట్టిదియు నెరుగక తనలోతాను ఒంటరిగ ఆడుకొనుచుండును

ఇతడు లోకమున దండని మించిన మంచివాడై అంతగా ఉత్తమోత్తముడై భాసించుచుండును.

గోపికలారా ! మీరందరు మాతృదేవతలై యుంటిరి. త్రిలోకములను ఆనందింపచేయు సమర్థతను కలిగియున్న నారీలలామ లయి శోభించుచుంటిరి. మీరందరు సుగుణవంతులై యుండగా మున్న

మిమ్ము దర్శించినదిమొదలు ఆనంద మతిశయించుచున్నది. అని జవాబుచెప్పి వారి నందరిని యానందింపచేసెను.

పాఠకులారా! చనుబాలు త్రాగుచున్నట్టి కృష్ణుని వయస్సు మీరే నిర్ణయించుకొనుడు బహుశా పాతికసంవత్సరములుండునేమో అని వాదింపగలరేమి? అట్టివానిపై నేరములు మోపిన వ్యక్తులకు భాషాజ్ఞానమున్నదో లేదో అదియు మీరే నిశ్చయింపుడు. అయితే పై పద్యములలోని శబ్దములు నీచార్థమును స్ఫురింపజేయునవి కదా అని కొందరాక్షేపించవచ్చును. భాషాపరిచయము లేనందున వారల కట్టి యర్థము దోచెను. ఆ లోపమెవరిది? జ్ఞానము లేని వారిది కదా! బాగుగ జ్ఞానమార్జించియున్న ధీమంతులు కృష్ణుని నిందింపజాలరని విశదమగుచున్నది.

(Shunting limit) (షన్టింగ్ లిమిట్) అనుపదమును రైల్వే ప్లాట్ ఫారమ్ నకు సమీపప్రదేశమునందు గాంచిన బాలురు ఆ శబ్దమునకు నీచార్థమును జేయుచు కాలేజీగరల్సును బిలచుచు నుందురు. చూడు చూడు డని యా పదములం జూపి వారిచే చీవాట్లు తినుచుందురు. అంతమాత్రమున స్టేషనుకు వచ్చిన పెద్దలందరును ఆ నీచకృత్యమునకే పాల్పడియుందురని యెవ్వరనగలరు. నీచులకు నీచార్థమే తోచును. దాని నెవ్వరును కాదనజాలరు. విదేశీయులు కృష్ణ చరితమును అర్థము జేసికొనలేక అనగా భాగవతములోని పద్యముల నన్నింటిని సమన్వయించుకొను శక్తిని పొందజాలక అసహన శీలురగుచు హిందూమతమును నశింపజేయ సమకట్టియున్న కారణముచే హిందుదేవతలను నిందించుచుండిరి అందుచే తామార్జించియున్న పాపద్రవ్యమును వ్యయమొనర్చుచు తమ మతమును శ్రేష్ఠమయినదిగా వెల్లడించుటకు బూనిరి. ఆ ధనమును రుచిజూచియున్న వ్యక్తులు సైతము కృష్ణపరమాత్మను దూషించుటకు వెనుకాడకుండిరి.

ఒకమారు ఏసుగారు ఒకానొక గృహమందుండగా నెల్లరికి పరిచయంబైన యొక వ్యభిచారిణి స్త్రీ అయ్యనను జేరి తలను దువ్వుచు మరియు పాదములకు వత్తుచు ముద్దుబెట్టుకొని, అత్తరుపూసి, తాళ్ళత్తు

కడిగి, తన పమిటతో తుడుచుచు నీ రీతిగ కాలయాపనము చేసెను. అందుకుం దగిన ప్రమాణమును గాంతము.

“ఆ ఊరిలోవున్న ‘పాపాత్మురాలయిన యొక స్త్రీ’ యేసు పరిసయ్యుని యింట భోజనమునకు కూర్చున్నాడని తెలుసుకొనియొక శిలా భరిణలో అత్తరు తీసుకొనివచ్చి, వెనుకతట్టు పాదములయొద్ద నిలువబడి యేడ్చుచు కన్నీళ్ళతో ఆయనపాదములను ముద్దుబెట్టుకొని ఆ అత్తరు వాటికి బూసెను”

అనుచు లూకా సువార్త 8 అ. 37, 38 వచనములలో నుదహరింపబడెను. అందలి సత్యము దేవదేవున కెరుక. ఏదియెటులున్నను – హిందువులలో కొందరు ప్రజలు క్రీస్తునందు వ్యభిచార భావము నంటగట్టెదరు. ఈ రీతిగ వాదములను పెంచుకొనుచున్న యెడల శాంతి, సౌభాగ్యము లంతరింపగలవు. అసలు విదేశములనుండి యీ దేశమునకు క్రైస్తవులు వచ్చుటెందులకు ? వచ్చిరిపో ! యీ దేశము నాక్రమించుకొని రాజ్య మేలిన దెందుకు ? ఏలిరిపో ! వారి మతమును హిందువులమతులలో నెక్కించు టెందులకు ? మరియు తనివిజెందక-యీ దేశపు మతమును దూషించు టెందులకు ? తుదకు శాంతి భద్రతలను అడ్డగించుచు- దేశనాశన ప్రయత్నములలో నిమగ్నులై యుండుటకు సిద్ధమైరే ! ఇట్టి కార్యములన్నియు నింతకు పూర్వము జరిగియుండె ననుకొందము. ఇప్పుడయినను బుద్ధిమంతులగుచు తమ మతమునకున్న వారినిమాత్రము క్రీస్తుగారి అడుగుజాడలలో నడిపించుచున్నయెడల నెంతయో మేలుచేసినవా రయ్యెదరు.

ఒక దేశము మరియొక దేశముపై పెత్తనము చేయరాదు. అనుచు ప్రపంచ రాజకీయ నాయకులందరు నిర్ణయించినారు. కనుకనే విదేశమతములు హిందూమతముపై దండెత్తుటకు యత్నింపరాదు. క్రైస్తవులు ఆ దౌష్ట్యమును విడనాడకుండుట కనుంగొనుట శోచనీయము. హిందూమతపు [illegible] !

విషయము లన్నియు నీ రీతిగ పరిశుద్ధములై వెలయుచున్నను వాని నర్థము జేసికొనలేక —హిందుదేవతలను నిందించుచున్నారు. దేవతలందరు వ్యభిచారులట. అందు ముఖ్యముగ మనయెదుటసాక్షాత్కరించి — భాసించుచున్న సూర్యభగవానుడు కుంతిని పొందియుండెనట. ఆ విషయము వీరి కెటుల దెలిసెనో! భారతమునందుండగా చదివియుండిరట. ఆ భాగమైనను పూర్తిగ చదివిరో లేదో! ఒకవేళ చదివియున్నను, అర్థమైనదో, లేదో! అర్థముకాకపోనిండు, యెటులయిననేమి? అన్యులను నిందించుచుంటిమా, లేదా! అని తర్కించుకొని యెదుట నున్నట్టి సూర్యదేవుని నిందింపసాగిరి. ఆ దేవుడు కుంతియందు కర్ణుని బుట్టించెనట. ఈ రీతిగవారి తలలనుండి తట్టెడు తప్పులు ఉట్టిపడుచుండెను.

క॥ పాపాత్ముల పాపంబులు
బాపంగా నోపునట్టి పద్మాక్షు పై
పాపముకలదని నుడివిన
పాపాత్ముల పాపములకు భారము కలదే!

(భాగవతం)

పాప పరిహారియై వెలయు దేవుని మీద పాపమున్నదని పల్కిన పాపుల పాపములు యేనాటికైనను పరిహరింపబడునేమి?

వారిజోలి మనకేల? పై విషయమును విమర్శించి చూతము.

| | |
|---|---|
| 1. హిందూదేశమున కుంతెమ్మ (=కుంతీదేవి) కర్ణునిం గనెను. | 1. విదేశమునందు మరియమ్మ ఏసుం గనెను. |
| 2. కుంతెమ్మ అవివాహిత | 2. మరియమ్మకు ఏదోయొక రీతిగ పెండ్లియైనది. |
| 3. కర్ణుని తండ్రి యెవరు? గగన భాగమున శుద్ధాత్మయై రాణించుచున్న సూర్యభగవానుడు. | 3 ఏసుకు తండ్రి యెవరు? వాయుమండలమున నివసించుచున్న - ఒకానొక వ్యక్తి. |

| | |
|---|---|
| 4. కర్ణునిబుట్టించియున్నవ్యక్తియు, శుద్ధాత్మయేయగును. | 4. ఏసును జన్మింపజేసిన వ్యక్తి యు పరిశుద్ధాత్మయేయగును. |
| 5. కర్ణుని తండ్రియైయున్న వాడు నరుడా? కాదు. అయితే యెవరు? సూర్యదేవుడు. | 5. ఏసుక్రీస్తుకు తండ్రియై యున్నవాడును మానవుడు కాదు. అయితే యెవరు? పరిశుద్ధాత్మయను దేవత. |
| 6. కావున శుద్ధాత్మయై వెలయు దేవుని మహిమచే కర్ణుడు పుట్టెను. | (6) కావున శుద్ధాత్మగానున్న దేవుని మహిమచే ఏసు జన్మించియుండెను. |

ఈ రీతిగ పై రెండుకథలు సమానబలము కలవై వ్యవహరింపబడెను.

తప్పు లెన్నువారు తమ తప్పు లెరుగరు
విశ్వదాభిరామ వినురవేమ !

అను నీతివాక్యము ననుసరించి — భర్తయుండినను అతనిం బొందక నన్యునిచే సంతతిని గనిన — మరెవ్వను ఒక కంటిచే జూచుచు — కుంతెమ్మ విషయమై గమనింతురేని — ఈ దేశపు కుంతీదేవిని — ఆ దేశపు వ్యక్తులు నిందింపవలసిన పని కలుగనేరదు.

తా నెన్నడైనను భాషింపదలుచునేని గురిగింజ తన యడుగుభాగముననున్న నలుపును మరచి అన్యుల క్రిందిభాగమును గాంచియో కొంచకనో వారి పృష్ఠభాగమున నలుపున్న దేమి ! యనుచు పరిహసించిన నెట్లుండును. మన మిత్రుల యాగడములు సైతము అదే రీతిగ నుండెను. కుంతికి కడుపుచేసిన దెవరు ! భారతీయుడా ? క్రైస్తవుడా ? లేక మహమ్మదీయుడా ! వీరియం దెవ్వరును కారే! నరుల మూలమున కాకున్నను దేవునిమూలమున అనగా సూర్యునివలన గర్భమేర్పడెనని వచింతురేమో! అది మంచిదేకదా. దేవుడు పరిశుద్ధాత్ముడై యున్నందున తన సంకల్పబలముచే సంతతి ననుగ్రహించు

చుండును. సూర్యభగవానుడు ప్రత్యక్షదైవమైనందున స్వీయసంకల్ప బలముచే కుంతీదేవికి శిశువును ప్రసాదించియుండెను. ఇక దోషమేము న్నది. పరులను ప్రేమించుటకునేర్చుకొనజాలక "అన్యులు అన్యులు" అని బెదరిపడుచు భారతీయులను విజాతీయులుగ నెంచుకొనియో అన్యమతమున నున్నవారినిగ భావించియో వారిపై నేరములుమోపు టకు బూనుచున్నారు మన కోటిసోదరులు. వారి నీవిధముగ తయారు చేసిన వారు విదేశీయక్రైస్తవులు. మరెమ్మను పొందినది పరిశుద్ధాత్మ యగునా ? కాదా ! అటులనే కుంతెమ్మను పొందినదియు పరిశుద్ధా త్మయే యగును.

## సూర్యుడు ప్రత్యక్షదైవమనుట

సూర్యుడు ఆత్మస్వరూపుడగునా యేమి ? అనుచు వాదింతురేమో! వినుడు. ఏ వేదమున సూర్యుడు వర్ణింపబడెనో ఆ వేదము నుండియే ఆ దేవుని మహిమను అర్థముచేసికొందము.

"సూర్య ఆత్మా జగత స్తస్థుషశ్చ" (వేదం)

జగతః = ఈ జగమునకు

సూర్యః = సూర్యనామమును ధరించియున్న

ఆత్మా = ఒకానొక దివ్యమగు ఆత్మకలదని వేదమున వర్ణింపబడెను.

కావున సూర్యభగవానుని పరిశుద్ధాత్మగా నిర్ణయించుటకు గాను బుద్ధిమంతులు సిద్ధమయ్యెదరు. అయ్యది న్యాయమైయున్నది.

"యాసాంగ్ రాజా వరుణోయాతి మధ్యే
సత్యాఽనృతే అవపశ్యన్ జనానాం ॥

(వేదం)

జనానాం = ఈ లోకములోని ప్రజలు తమ జీవితాశయముకై

నడుమనడుమ

సత్యాఽనృత్యే = కొన్ని విషయములలో నిజమునుబల్కుచు మరి కొన్ని సందర్భములలో అసత్య మాడుచుండిరని యెరింగి వాని నన్నిటిని

అవపశ్యన్ = జూచుటకుగాను నిశ్చయించిన వా డగుచు-

రాజా వరుణః = వరుణనామమున వ్యవహరించుచున్న సూర్యభగవానుడు రాత్రింబవళ్ళు -

యాతి = దేశదేశములకు పయనమై పోవుచున్నాడు.

ఎంతటి పరిశుద్ధాత్మయో కానియెడల ఆ రీతిగ వ్యవహరింపగలడా !

పరిశుద్ధాత్మయై యుండెననుటకు సంశయము లేదు. సూర్యమండలముసైతము మెల్లమెల్లగ కదలిపోవుచున్నదని యీ నడుమనే విజ్ఞానశాస్త్రవేత్తలు సైతము నిర్ణయించుకొనియుండిరి. కనుకనే నరుల మంచిచెడ్డలను పరీక్షించుటకుగాను సర్కిటింగ్ ఆఫీసరువలె సూర్యభగవానుడు చరించుచుండును. పరమపావనమగు ఆ సూర్యసంబంధమగు ఆత్మయే జీవాత్మలను ప్రేరేపించుచుండును.

నిజమారయ నతని నాశ్రయించినవారికే శాంతిభద్రతలు లభ్యమగుచుండును. ప్రమాణమును వినుడు.

" ఉద్యంతమస్తంయంత మాదిత్య మభిధ్యాయన్ కుర్వన్ బ్రాహ్మణోవిద్వాన్ సకలం భద్రమశ్నుతేఽసావాదిత్యో బ్రహ్మేతి బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి య ఏవం వేద " (వేదం)

ఉద్యంతం = ఉదయించుచున్నట్టియు

అస్తంయంతం = అస్తమించుచున్నట్టియు

ఆదిత్యం = సూర్యునివిషయమై

అసౌ ఆదిత్యః = ఈ ఆదిత్యుడు (సూర్యుడు)

బ్రహ్మేతి = పరబ్రహ్మమను అనుచు
యః ఏవం వేద = యెవ్వారు పైరీతిగ తెలుసుకొనుచుందురో
సకలం భద్రం = వారు సమస్తమైన మంగళమును అనగా
శుభమును లేక శాంతిని
అశ్నుతే = పొందుచున్నారు.

అని యున్నందున ఆ సూర్యదేవుని హిందువులు ప్రత్యక్షదైవముగ నిశ్చయించినవారలైరి. అసలు నిరాకారబ్రహ్మము సర్వత్ర వ్యాపించి యుండెను. ఆతడు జీవుల శరీరములందును నిండియున్నాడు. దేవీ లోకమున దేవీరూపముగను, శివలోకమున హరహరమహాదేవ రూపముతోడను, విష్ణులోకమున శ్రీమహావిష్ణువుగను, బ్రహ్మలోకమున హిరణ్యాగర్భ రూపమునను, యిటుల నెన్నియో రూపములంధరించి మరియు నీలోకమున నెల్లరకు దర్శనమొసంగుటకుగాను నేత్రగోచర మయి వెలయు నీ సూర్యమండలమున లోభాగమందొకతావున మంగళ విగ్రహుండగుచు నెలకొనియుండెను.

శ్లో॥ ధ్యేయస్సదా సవితృమండల మధ్యవర్తీ •
నారాయణ స్సరసిజాసన సన్నివిష్టః॥

సవితృమండలమధ్యవర్తీ = సూర్యమండలమున మధ్యభాగమందెవ
టనో నివసించువాడగుచు-

నారాయణః = శ్రీ సూర్యనారాయణుండను నామమువహించి ఏ
దేవుడు విహరించుచుండెనో,

ధ్యేయః = అతనిని ధ్యానించువారు విధిగ ధన్యులగుచుందురు.

అని హెచ్చరింపబడిన కారణముచే సూర్యుడు దేవుడా ? యని ప్రశ్నించువారు తమ సంశయములం దీర్చుకొని సంతసించెదరు గాక !

ఎన్నియో రీతుల వివరించుచున్నను అర్థముచేసికొనలేక "అతడు దేవుడో లేక నరుడో మాకవసరములేదు. కామోద్రేకమునుపొంది కుంతిని భంగపరచెను" అనుచు హేళనము గావింతురు. కానిండు! ఉద్రేకమన నెట్టిదో తా మెరుంగుదురుకదా? అట్టివారు అన్నముం దినక పది పదునైదు దినము లుపవసించుచు అటుపైన కామోద్రేకము పొందగల్గినయెడల వారలే ఈ విశ్వమునకు కర్తలై యుందురని భావించుకొనవచ్చును. వీటి నన్నిటిని గుర్తునం దుంచుకొనక వెర్రివానివలె మాటాడరాదని యెరుంగుటమంచిది. సూర్యునకుసయితము కామ మతిశయించె ననుకొందము. కామమును బుట్టించు వస్తువులెవ్వి? రొట్టెలు. కోడిగుడ్లు, చేపలు, మాంసము, యెద్దునాలుకలు మున్నగునవి భక్షించినయెడల వానిమూలమున వీర్యము జనించి ఆ పదార్థము కామోద్రేకమును కల్గించునని విదేశీయులకు తెలియనిదికాదు. మంచిది! సూర్యమండలమున పై పదార్థములున్నవా? యేమి? అహో! ఆమండలములోని మంటలయందు ఆ వస్తువులు యెటుల ఫలింపగలవు? ఇక సూర్యదేవుడు వానిని దినుట యెట్లు? మరచితిని. అసలు దేవజాతికిం చెందినవారియందు ఆకలి దప్పిక లుండవుకదా? అవిలేనపుడు ఆయావస్తువులం దినవలసిన యవసరం బెక్కడిది? విషయ మటులుండ పదార్థములు కడుపులోనికి బోనపుడు వీర్య మెటుల నుత్పత్తికాగలదో యాలోచించుకొనుడు.

## దేవతల దేహము లెట్టివి?

విచారింప సూర్యలోకమున నివసించువారికి అన్నమయ శరీరములుండవని విశదమగుచుండును. అట్టియెడ రక్తముగాని, మాంసముగాని, ఎముకలుగాని ఆదేహములందుండుటకు వీలుకల్గునా? వీలు లేదనియే వేదము ప్రకటించియున్నది.

"అనస్థాః పూతాః పవనేనశుద్ధాః శుచయశ్శుచి మపియంతిలోకం
నైషాంశిశ్నం ప్రదహాతి జాతవేదాః స్వర్గేలోకేబహుస్త్రైణమేషాం॥
(అథర్వవేదం)

స్వర్గేలోకే = స్వర్గలోకమున దేవతలుందురు.

అనస్థాః = అస్థులు (ఎముకలు) మున్నగునవి వారిదేహము లందుండవు.

ఏషాం శిశ్నం నప్రదహతి = వారి మర్మావయవము ఉద్రేకము పొందునది కాదు. కామాగ్ని వారిని ఎంత మాత్రము బాధింపనేరదని భావము. ఆ యగ్ని వారిని దహింపచేయని కారణమున-

బహుస్త్రైణం = స్త్రీలు గుంపులుగుంపులుగా తమచుట్టుగుమిగూడియున్నను వారికి చలనము కలుగనేరదని "నప్రదహతి" అనుపదములు ప్రత్యేకముగ హెచ్చరించినవి.

నప్రదహతి అనుదానిలో దహనశబ్దముకలదు. దహనమనగా కాలుట. అట్టి దహనము, ఆ తాపము, ఆ మంటలు, వారిని బాధపెట్టవని 'న'అను అక్షరమువివరించియున్నది. దేవతల స్వభావము లెట్టివో ఇప్పుడైనను తెలియగలిగితిరి. అందుకై ఒకమారు ఎల్లరము సంతసించుదము.

సినిమా తెరలపై గోచరించుచున్న వ్యక్తులకు శరీరములు లేవా యేమి ? ఉండుగాక ! వానియందును రక్తమాంసములు లేవు. వెన్నెలలోను, ఎండయందును మనప్రక్కగా నేలపైన మరియొక దేహమును గాంచగల్గుదుము. మన నీడయే ఆరీతిగ దేహధారణమొనరించి మనతో బాటు వెంటనంటుచు నడిచివచ్చుచుండును. అందును రక్తమాంసము లుండవు. అటులనే సూర్యమండలమున నివసించు వారి దేహములందును ఎముకలు, నరములు, రక్తమాంసములు, చర్మము, వెంట్రుకలు ఉండనేయుండవు. ఎందుకనగా దేహములు అన్నమయములుకావు. అనగా మట్టిసంబంధములుకావు.

## దేవతా - దేహములు

"అప్య, తైజస, వాయువ్యాని లోకాంతరే శరీరాణి"

లోకాంతరే = మన లోకమున అని యెంచకుము. ఇతరలోకములందు అనగా పరలోకములలో-

తైజస = వెలుతురుతో కూడియున్నట్టి అనగా తేజోమయములై వెలయు-

శరీరాణి = దేహములున్నవని హింగుమతమున వివరింపబడెను.

## దేవతలు - సంతతిగను విధానము

దేవతలకు భార్యలుండిరా యని ప్రశ్నించువారుందురు. ఆ భార్యలనుమాత్రము ఏకాంతమున చేరి సుఖింపనెంచరు.

వారియందు సంతతిని కల్గింపవలెనని ఇచ్ఛగల్గినయెడల తమ యాత్మశక్తిని ప్రసరింపచేసి సంతతి నొసంగెదరు.

ఎవరోయొక దేవుడుండెననుకొందము. ఈజగమును సృజించినపిదప ఆదిమానవులను నిర్మించియుండును. తన వీర్యమును భార్యయందుంచి గర్భమునుకలిగించెనా ఏమి? ఛీ! దేవుని విషయమై ఆరీతిగ వచించువారు తుచ్ఛులైయుందురు. దేవ అను పదమును వినినమాత్రమున నే పరిశుద్ధభావమును పొందినమానవులకే ఏనాటికైనను పరమ పదము లభింపగలదు. సూర్యుడుకూడ దేవజాతికం జెందినవ్యక్తి యగుటచే తన సంకల్ప తేజఃప్రవాహమును భూమిపై ప్రసరింపచేసెనని తలయొగ్గి వినుచు మరియు నాకీతిగ భావించుచుండవలెను. అతడే నిజమైన మానవుడు. మరియు నీతిగల వాడగును. "దేవజాతికి అన్నమయ దేహములుండవు సుమా. కనుక నే ఆకలిదప్పికలు లేవు. వారి శరీరములందు రక్తమాంసములుకూడ శూన్యము. ఎర్రియగు దినని క్రొగణమున వీర్యము అను [illegible] [illegible] సృష్టింపబడెను.

వీర్యము లేనపుడు కామోద్రేకమునకు తావు కలుగదు. సూర్యభగవానుడు దేవజాతికిం జెందిన వ్యక్తియగుటచే నతని దేహమున సైతము కామోద్రేకమును కల్గించువీర్యము (శుక్రము Slherm) ఎంత మాత్రము ఉండుటకు వీలులేదనవలెను. ఇక స్త్రీలను పొందుటెట్లు? అను విషయమును బాగుగ నవగాహనము చేసికొనువారు వివేకులై యుందురు. ఇంకను సంశయములున్నచో "సూర్యభగవాన్" అను భాగమున జూచుకొనినంజాలు.

ఈసూర్యుడుగాక వేరొకసూర్యుడు నరజాతికించెందినవాడు ఒకానొకడుండెననియు, ఆతడును ఋషివంటివాడనియు, కామవశుడై కుంతినిం బొందెననియు, మరియొక క్రొత్తయెత్తునుయెత్తి పైపైకి దుముకువారుందురు. ఆ కృత్యము ఘోరమృగములకు సంబంధించి యున్నది. పెంటనేపరిశుద్ధాత్మ అను నరుండొకడు కలడనియు నాతడే అపుడపుడు వచ్చి మరియమ్మను గూడుచుండెననియు, తన్మూలమున ఏసుక్రీస్తు పుట్టెననియు హిందువులు వాదింపగలరు. కావున ఒకరిమతమును వేరొకరు నిందింపరాదని ప్రార్థన. నిందించుభావము లేనియెడల నితరమతములవారిని తమ మతములోనికి చేర్చుకొనుటకై పిచ్చివేషములు వేయకుందురుగాక!

దేశానర్థదాయకమై మరియు నన్యుల బాధించునదియై వెలయు మతప్రచారమును జేయక-ఎవరిమతమున వారలు నిల్చియుండుటకు నేర్వవలెను. అంతియేకాని అన్యమతముల వారిని తమమతములోనికి జేర్చుకొనుటకై కుతంత్రములనెన్నడును పన్నరాదని మనవి. ఎందుకన నవి యసహ్యాకర విషయములు మరియు మానవత్వమును భంగపరచగల కృత్యములు. ఇంకను కలహమునుబుట్టింపగల చేష్టలు. కావున ఆదుష్కార్యములనుండి విరమించువారు దేవునిపరమపదమును జేరగలుగుదురని విశ్వసింపవలెను అట్టి దశ యేర్పడినయెడల దేశమున శాంతిభద్రతలు నెలకొల్పబడును.

: కుంతీదేవియు నితరుల ను పొందియుండెనట :

సూర్యుని పొందెను అనుమాట అటుంచుదము.

యముని తోడను - ఇంద్రునితోడను - వాయువుతోడ కుంతీదేవి కలసిమెలసి సంచరించెనని అన్యులనుచుందురు.

అహో! దేవేంద్రుడెవరో వారికిం దెలియునా! తెలియుచో నాతడు ఏ దేశవాసి? ఎవని పుత్రుడు? అతని భాష యెద్ది? వీనినన్నిటిని తేల్చవలసియుందురు. అటుపైన తాము తెల్పిన కథను నడిపింప వచ్చును. హిందు వాఙ్మయము ననుసరించి యింద్రుడు - యముడు వాయుదేవుడు వీరలెల్లరు దేవభాషను మాటాడుచుందురని తెలియ గలుగుదుము. వారిపేర్లు సైతము సంస్కృతభాషకు (దేవభాషకు) సంబంధించియున్నవి. పై దేవతలు టిబెట్టు నందు వసించుచున్న ప్రజ లయి యుందురని వాదించువారుండిరి. ఆ దేశమున ఆదికాలమునుండి నేటివరకు సంస్కృతభాష కలదని నిరూపింపగలరా! అచట దేశభాష ప్రత్యేకముగా వేరొకటి లేదనియు వచింపగలరేమి? అది సాధ్యము కానపుడు - దేవతలను టిబెట్టులోని ప్రజానీకమునందు జేర్చుట అవి వేకమగును. పోనిండు దేవతలకు అన్నమయదేహము లుండవనియు తేజోమయములై వెలయు శరీరము లున్నవనియు - ప్రమాణములను ఇపుడే వినియుంటిరి కదా! టిబెట్టులోని ప్రజలకు యెముకలున్నవో లేవో తెలిసికొందము. దలైలామా అను పేరును వినియుందురు అతడు టిబెట్టులోనివాడు. మన భరతఖండముననే ఇపుడు వసించు చున్నాడు. అతని వద్దకుంబోయి - చర్మమున్నదో లేదో ఒకమారు చూసివచ్చినం జాలు. ఎందుకీపిచ్చి! ఆ పిచ్చివ్రాతలు మరి మరి హెచ్చుమీరిన చచ్చువాదములను బోలినవిగా నున్నవి. విలువలేని మాటలును - సరకులేని వ్రాతలును- చురుకుతనము లేని చేతలును - ఇవి యెవ్వియు మతమును ఉద్ధరింపజాలవు. పలికిన పలుకులు ములుకు లయి - అభేద్యములై - అప్రతిహతములై - వెలయురీతిగ - అవి ఆ యాగ్రంథములలోనివో - లేక సభారంగములకో - యెక్కుటకు

సిద్ధము కావలెను. ఒక్కొక్క గ్రంథమును ప్రమాణముగా తీసికొని మాటాడదలచినపుడు ఆ గ్రంథము యొక్క భావమును జూచుకొన వలదా? దేవతలనుగూర్చి వర్ణించియున్న భాగములు హిందుమతగ్రంథములయం దనేక స్థలములలో కనుగొనగలరు. వానిం గుర్తునందుంచుకొని దేవతలవిషయమై మాటాడవలెను అటుగానిచో ప్రతిపక్షులు పక్షులరీతిగ నెగిరిపోయెదరు. అనగా నిలువబడి వాదింపజాలరు.

## : దేవలోకము లనగా — నక్షత్ర మండలములు :

మేఘమండలమునకు పైనున్న భువర్లోకమును దాటి ఆ వల వెలుగొందుచున్న నక్షత్రమండలములున్ను సూర్య - చంద్ర మండలములున్ను దేవలోకములై రాణించుచున్నవని వేదశాస్త్ర పురాణ — ఇతిహాసముల యందంతటను గుర్తింపగలము.

"నక్షత్రాణి వై దేవగృహాణి" (వేదం)

నక్షత్రమండలములందు దేవతాగృహములున్నవని పై మంత్రమున కర్థము. ఇంతయేల? ఆ మండలములే దేవతల యిండ్లు. ఇంద్రుడు - యముడు - వాయుదేవుడు - మున్నగు వారందరు అన్నపానీయము లెరుంగని వ్యక్తులై యుండిరి. అట్టివారితో కుంతీదేవి సంచరించెనని బల్కుట కేవలము తెలివిలేని తనము. హిందూమతమును ఖండించుచున్న గ్రంథము లెన్నియో గలవు. అవి తమతమ కర్తలకుం జెప్పి ఓ కర్తలారా!"యింకను చదువుకొని రండు""సత్యమునన్వేషించుటకు మీ మీ మనసులం త్రిప్పుడు"

అటుపైన మంచిపుస్తకముల వ్రాయగల్గుదురు. అని హెచ్చరించుట అవసరమగుచున్నది.

దేవతాబృందమునకు ప్రభువైయున్న దేవేంద్రుడెక్కడ ?
దక్షిణదిశకు పాలకుండయిన యమదేవు డెక్కడ ?
మరుద్గణంబులకధిపతియై వెలయు వాయుదేవుండెక్కడ ?

అట్టి మహనీయులను నీచాత్ములనుచు ప్రసంగింపరాదని మనవిచేయు దును. పాపాత్ములం దెన్నియో భేదములుండును. వానిననుసరించి కొందరిని విసర్పనరకమునను, మరికొందరిని అవిసర్పనరకమునను తది తరులను విషాదీనరకమునను, శేషించినవారిని అవిషాదీనరకమునను పడవేయుచున్న యమునిం దూషించుచున్నచో అట్టి పాపులను ఏదో యొక నరకమునకుం బంపివేయుటకు యముడు సిద్ధపడుచుండును.

## పంచకన్యలు తలిదండ్రులు లేకయే జన్మించియుండిరి.

శ్లో॥ అహల్యా, ద్రౌపదీ, తారా, తారా, మండోదరీ తథా
పంచకన్యాః పఠేన్నిత్యం మహాపాతక నాశనం॥

అహల్యాదేవి - ద్రౌపది – వాలిభార్యయగు తార – బృహస్పతి భార్యయగు తార - రావణుని పత్నియగు మండోదరి –

ఈ యైదుగురు కన్యలు - తల్లిదండ్రుల గర్భముల నుండి జననమందినవారు కారు. వారెల్లరు అయోనిజలు. అనగా స్త్రీల గర్భములనుండి పుట్టినవారు కారు. తమంతట తామే – ఎచటనుం డియో ఉట్టిపడినట్లు అట్టె మనయెదుట ప్రత్యక్షమైరి. అనగా మన పూర్వులు స్వయముగ నా దృశ్యమును కనుగొని యానందింపగలిగిరి. అట్టివారు ఇంకను మనదేశమున నెందరో కలరు.

## రాధా - కృష్ణులు తలిదండ్రులందు జన్మించియుండలేదు.

కృష్ణపరమాత్మయు, రాధాదేవియు తలిదండ్రులనుండి గాక స్వయముగ నావిర్భవించియుండిరి. ప్రమాణమును వినుడు.

వ॥ దేవీ! నీవు శంకాభయంబులు విడిచి యశ్రుమోక్షంబులు సేయక శీఘ్రంబున వృషభానుగృహంబునకుం జని కళావతి జఠర మందు తొమ్మిదిమాసంబులు వాయువుచేత మాయామయ గర్భంబు పూరించి దశను మాసంబున

నాత్మరూపంబు పరిత్యజించి
శిశురూపమున నావిర్భవించి

వివస్త్రుండవై పుడమిం బడి రోదనంబు గావింపు మట్లు గావించిన
నీవు నయోనిజ సంభవుడ వయ్యెదవు.

ఏను నేను నయోనిజసంభవుండనగుదు.

మనకిరువురకును గర్భసంస్థితి లేదు.

భూస్పర్శ మాత్రంబున జనకుండు నంద వ్రజంబు సేర్చె. కృష్ణ భగవాన్ అను భాగము రాబోవుచున్నది. అందు మిగిలిన సంశయము లన్నియు నివారింపబడును.

[బ్రహ్మవైవర్తపురాణం. కృష్ణజన్మ ఖండము 1 వ అశ్వాసం]

విదేశములయం దీ రీతిగ జన్మించినవా రొక్కరును లేరు. ఎందుకన - అవి దేవదేవుని రాజధానులై యుండవు. దేవదేవునకు రాజధాని హిందూదేశమై యుండెను. కావున నతడు అప్పుడప్పుడు - ఈ తావునకు విచ్చేయుచుండును. ఆరీతిగ ననేక పర్యాయములు అవతరించి ధర్మస్థాపన మొనరించి వెడలుచు వచ్చుచుండెను.

విదేశములలోని నరుల సృష్టిని - యెహోవా అను దేవుడు చేసియున్నాడు.

స్వదేశమున అనగా మన భరతఖండమున

ఆహోనామకుండగు దేవదేవుడు మనుజులను
సృష్టించి యుండెను.

క్రీస్తునన్న పేరుగలవాడు భూమికిదియు నొకరీతిగ జన్మించియుండిరి క్రీస్తుగారివలె - పురుష సంబంధము నొందక - తమతల్లినుండి జన్మించినట్టి వ్యక్తులు స్త్రీలను మరెందరో మనదేశమున నుండిరి. అందు

మన యాంధ్రదేశమున సంభవించిన ఒకానొక వ్యక్తిని మాత్రము తమయెదుట సాక్షాత్కరింపజేతును. అతడు వేములవాడ భీమకవి. నిరంతరము అతని తల్లి శివాలయమునందు ధ్యాననిష్ఠతో కాలము గమపుచుండ - నొకదినంబున శివభగవానుడు సాక్షాత్కరించి - నావరప్రసాదమున నీ కొక బిడ్డ కల్గునని దెల్పి - అంతర్హితుడయ్యె. ఆ మహిమచే పురుషసంబంధము లేనిదయ్యు- పుత్రునిం గనెను. ఆమె రహస్యముగ నెవరినో పొంది భీమకవిని బుట్టించుకొనెనని - క్రైస్తవు లనెదరేమో! వెంటనే మరియమ్మయు నటులనే కావించి యుండెనని హిందువు లనెదరు.

క్రైస్తవులచే వ్రాయబడిన గ్రంథములలో - హిందుమతమును దూషించినట్టి విషయము లెన్నియో కలవు. ముక్తిమార్గప్రదర్శనము శాస్త్రియొక్క హిందూమతము ఏది నిజము ? అను గ్రంథము అందు ముఖ్యమైనది.

" దుశ్చరితుడగు కృష్ణుడెక్కడ ? కేవలము పాపరహితంగ జీవించిన ఏసుప్రభు వెక్కడ ? "

అను వాక్యములు శాస్త్రిగారి గ్రంథమున 116 వ పేజీయందు కలవు.

ఇక "ఏది నిజము" అను గ్రంథవిషయముపై వచింప బనిలేదు. అది హిందుమతమును దిట్టితిట్టి తన పట్టుదలనంతయు జూపించి గట్టెక్కియుంటినని .అట్టె నెమరుచూచుచున్నది. తన వాదమును మరె వ్వరును ఖండింపజాల రనియు కృతనిశ్చయముతో నున్నది.

"హరిహరులనుపూజించువారు నరకమున కరుగుదురు.

అనియు క్రైస్తవులచే ప్రకటింపబడిన కరపత్రములు గలవు.

హిందుమతగ్రంథములను మరియు హిందూమతమును ఈ దేశమున కానరాకుండ జేయుటకు మనియు ప్రకటింపబడిన గ్రంథములుగాని, పత్రికలుగాని పలయువారికి ననావద్ద లభింపగలవు.

వానినన్నిటిని హిందూమత గ్రంథమాలయొక్క భవనమున దర్శింపవచ్చును. స్వరాజ్యము వచ్చినపిదపనే – కేరళయందు 120 దేవాలయములును – వానికిందోడుగ కొండపయినున్న శబరిమల దేవాలయమున్ను క్రైస్తవులచే బిద్దలుసేయబడినవి. కాంగ్రెస్ ప్రభుత్వముచే నియమింపబడిన కమిటీ వారు సమర్పించిన నియోగి రిపోర్టును చూచి పై సత్యమును గుర్తింపవచ్చును. ఇట్టివార్తలన్నియు నాలకించినపిదప నిజముగుపురుషపుంగవుని హృదయ మెటులుండునో చదువరు లూహించెదరుగాక! హిందుమత ప్రచారార్థమై యీ గ్రంథకర్త

పల్నాడుతాలూకాకు వెళ్ళినపుడు మాచెర్లకు సమీపముననున్న రాయవరం మున్నగు గ్రామములలోని దైవవిగ్రహములు వాగులయందు పడవేయబడినవని ఆయా గ్రామవాసులు తెల్పియున్నారు. విన దుర్భరము, దురంతము దురూహ్యము. దుశ్శాసనుడు, దుర్యోధనుడు మరిమరి జ్ఞప్తికి వచ్చుచున్నారు. ఇంకను రానున్న బాధలెన్నియోకలవు. వానిని మనమో మనబిడ్డలో గుర్తింపగలరు.

హిందుమతమున నెన్నియో దుశ్చరిత్రములున్నవని ఏ.ని గ్రంథము వెలిబుచ్చుచున్నది. వానిం జూతము.

## క్రైస్తవుల ప్రశ్నలు

ఏ. ని. గ్రంథమున 69 వ పేజీని చూతము.

(ఏ) బృహస్పతి సొంతయన్నయగు రుచికునిభార్యయైన మమతతో రతిక్రీడలం దేలెను.

(బి) చంద్రుడు చదువునేర్చుకొనుటకై యొజ్జకడకేగి గురుతల్పకుండయ్యెను.

(సి) సుదర్శనుడు సొంతమనుమరాలియందు సంతానమును బడసెను.

(డి) ఆకూతి, రుచి, ప్రజాపతి సంతానమయిన యజ్ఞుడు, దక్షిణయును (అన్న చెల్లెండ్రు) వారలు భార్యాభర్తలయిరి. ద్వాదశపుత్రులలో నొకడగు కేత్రజుడనగా భర్త యిష్టముమీద అంకురితనను చేయగా పుట్టినబిడ్డడు మరియొకడు కానీనుడు అనగా పెండ్లిగాకమునుపు అంకురమగనికి బుట్టినవాడు. వేరొకడు సహోద్రజుడు అనగా గర్భిణితోనుండగా బెండ్లాడినయామెకు బుట్టినవాడు. (19 పుట)

అనుచు నీ రీతిగ నొక్కొక్క వ్యక్తిని గురించి పైవిషయములన్నియు వివరింపబడెను.

శ్రీకృష్ణుడు తన బావమరిదియగు శిశుపాలునకు మాట్లాడిన రుక్మిణిని చెల్లెలను భేదములేక పెండ్లియాడెను. శిశుపాలుని కుమార్తె తనకు కూతురైయుండగా నకులుడు వివాహమాడెను. పంచపాండవులు ద్రౌపదిని స్వీకరించిరి. ఆమెయందు వారు బిడ్డలను కనిరి. దాల్భ్యఋషి హస్త, పునర్వసు, పుష్యమి నక్షత్రములలో ఆదివారము కలిగినపుడు వ్రతమారంభించి, ప్రతి భానువారము బ్రాహ్మణునితో రమింపుడని కృష్ణునిభార్యలకు బోధించినట్లు మత్స్యపురాణము 69 అలో కలదు " అనుచు నాగ్రంధమున ప్రకటింపబడెను.

## క్రైస్తవుల ప్రశ్నలకు సమాధానములు

పై సంశయములన్నియు ఆగ్రంధములోనివేసుమా! అందలి వాక్యములున్ను ఏ. ని. గ్రంథమున నున్నవేయగును. ఒక్కొక్క ప్రశ్నకు వరుసగా సమాధానము వ్రాసగబడుచున్నవి.

గగనభాగముననున్న తారాగణమునందు బృహస్పతి అను నక్షత్రమొకటి కలదు. బృహస్పతి యనగా గురుగ్రహము. అటులనే శుక్రనక్షత్రమున్ను మరియొకటియుండెను. గురుమౌఢ్యమి అని విను చుందుము కదా! బృహస్పతి యను నక్షత్రము మరియు శుక్ర నక్షత్రముఎన్నిదినములు ఆకాశమున గోచరింపవో ఆదినములను మూఢము

క్రింద పరిగణించెదరు. ఉపనయనాది శుభకార్యములు ఆ మూ ఢమి యందు జరుగవు. కావున గురుశుక్రులను మానవజాతిలో చేర్చుట అవివేకమగును. గగనభాగములోని గురుమండలమునకు అధి పతిగ నున్నవాడే బృహస్పతి యని గుర్తునందుంచుకొనుడు. అతడు దేవతలకు గురువు. శుక్రుడు రాక్షసులకు గురువై యుండెను. ఆవిష యము మనమెల్లర మెరుగుదుము. గురుశుక్రులు సైతము భూలోకమున నివసించు మనుజులు కారు. అట్టి బృహస్పతి యొక్క దేహము అన్న మయ శరీరమై యుండదు. వెలుతురుతో చేయబడినది అని యెరుగుం గుడు. తేజోమయములై వెలయు నక్షత్ర మండలములందు నివసించు చున్నవారి దేహములు తేజోమయిములై యుండక అనగా వెలుతురుతో నిర్మింపబడినవై యుండక మట్టితో సృష్టింప బడిన వగునా? తేజోమయ దేహములున్నవారికి అన్నపానము లుండవని ఇంతకుపూర్వమే గుర్తించియుంటిమి. అన్నము దినని వారికి వీర్యము అను ధాతువు కలుగనేరదు. అట్టి రేతస్సు లేనప్పుడు- కామమెక్కడిది? అటుపైన స్త్రీలంజేరి సుఖించుటెక్కడ? అతని అన్న గారయిన రుచకుని భార్యయు తేజోమయ దేహము తోడనే నక్షత్ర మండలము నందు విరాజిల్లుచుండును. ఆమె యందు బృహస్పతి — తన యాత్మశక్తిని ప్రసరింపజేయనెంచెను. పరిశుద్ధ ఆత్మ అను ఒకా నొక దివ్యతేజము — మరియమ్మతో క్రీడను గావింపలేదా! అట్టిదే బృహస్పతి క్రీడావిధానము.

(బి) చంద్రుడున్ను భూలోకవాసి కాడని ప్రత్యక్ష సాక్ష్యము వేరుగ నుండవలెనా!

అతడు దేవుడైనందున అన్నపానములు లేనివా డగును. ఇక వీర్యముండుటకు మార్గమెక్కడిది ? వీర్యము లేనివాడు స్త్రీలతో భోగించుటెట్లు ; నరజాతియం దుద్భవించినను - బాలురకు వీర్య ధాతువు ఏర్పడని కారణమున స్త్రీవాంఛ కలుగదు. అట్టిబాలురకే స్త్రీవాంఛ లేనపుడు తన జీవితాంతమువరకు అన్నపానీయము లెరు గని చంద్రభగవానుడు గురువుగారిభార్యను పొందగలడేమి. ఆ

గురువుగారి సహధర్మచారిణి (భార్య) మాత్రము మానవజాతికిం జెందిన తుచ్ఛదేహముతో విలసిల్లుచున్నదా! లేదు. తేజోమయమగు దేహమునుదాల్చిన కన్యకామణియైయున్నది, ఆమెకును కామమునునదియున్నదనుటకు యెటుల సాధ్యము! ఆ స్థితిలో సంభోగమందిచ్ఛ కలుగుట యసంభవము. కనుక చంద్రదేవుడు - ఆమెను పొందియుండెననుట తెలివిలేనితనము. పుస్తకములయందా రీతిగనున్నదనెదరేమో! ఉండుగాక. దేవలోకపుకథలను- ఆ దేవలోకపు మర్యాదలతోడనే అర్థముచేసికొనవలెను. చంద్రుడు తనసంకల్పమును బృహస్పతియొక్క- భార్యపై ప్రసరింపచేయగా బుధుడు అను ఒకానొక దివ్యపురుషు డుదయించెను. అతడును ఖగోళవాసియేసుమా! బుధగ్రహము అను నామమును వినియుండమా! ఆ గ్రహముకూడ గగనభాగమున ప్రేలాడు నక్షత్రము లం దొకటియై యుండెను. కావున నతడును గర్భమునుండి జననమందినవాడు కాడు. చంద్రుని సంకల్పబలమే తేజోరూపమునుపొంది క్రమముగా బుధుడు అను తైజసరూపిగా భాసించుచుండెను.

(సి) సుదర్శనుడుకూడ మనుమరాలియందు సంకల్ప తేజమును ప్రసరింపజేసెనని యెరుంగుడు.

(డి) ఎచటనో ఒక తావున అన్నచెల్లెండ్రు భార్యాభర్తలై యుండిరని హిమావాఙ్మయమున గోచరించెననుకొందము. వెంటనే ఆ సోదరసోదరీమణులను దేవజాతికిం చెందిన దివ్యరూపులనుచు నా గ్రంథములనుండియే గ్రహింపగలము. ఆకూతి, రుచి, ప్రజాపతి అను వారలు సైతము దేవతాగణమున చేరియున్నారు. కావున వారికిని శరీరసంబంధమగు మైథునధర్మము సంక్రమించినదికాదు. పండ్రెండు రకములగు పుత్రులుండురని శాస్త్రకర్త వివరింపదలచినపుడు వారిలో క్షేత్రజుడు, కానీనుడు సహోఢుడు అను పేర్లచే వ్యవహరింపబడువారలెందరో పేర్కొనబడిరి. అంతమాత్రమున మనపూర్వులు వారిని మంచి వంశములందు లెక్కించియుండిరా? లేదు. ఇక దోషమేమున్నది. ఆకాలపు బ్రాహ్మణులు సైతము కృతయుగంబున సంకల్పబల

ముతోడనే తమ స్త్రీలయందును, పరస్త్రీలయందును సంతతిని కను చుండిరి. అట్టిమహిమలున్నవని యెరింగినందుననే దాల్భ్యఋషి పైరీతిగ దెల్పియున్నాడు. ఇక దోషముకలదేమి. త్రేతాయుగమునందును ద్వాపరయుగమునందును తపస్సంపన్నులగు మహాసీయులుందురేని వారు సంకల్పతేజఃప్రవాహముచే నెవరియందైనను శిశువులం ప్రసవింపచేతురు.

పరాశరుడు సైతము మత్స్యగంధిపై శుద్ధసంకల్పములను ప్రసరింపచేయగా వ్యాసమహర్షి జన్మించియుండెను. ఇంకను పుట్టెనో లేదో వెంటనే తల్లికి నమస్కరించి తపముకై వెళ్ళెదునని మనవిచేసెను. తల్లియొక్క భావమును గుర్తించి అమ్మా! నీవెపుడు తలచినను అపుడే నిన్ను దర్శింపగలను. అటుపైన నీయాజ్ఞ శిరసావహించి నెరవేర్చిన యనంతరము మరల కొండగుహాలలోనికిం బోయెదను. అని విన్నవించి వెంటనే అంతర్హితుండయ్యె.

అంబా అంబాలికలకు సంతతిలేనందున తల్లిగారి యాజ్ఞ కైకొని తన శుద్ధసంకల్పప్రభావమున సంతతి ననుగ్రహించెను. మహర్షులకు స్త్రీలే కావలెను అను నియమములేదు. క్రైస్తవుల దేవుడయిన యహోవా మట్టినుండి ఆదాము అను నరుని పుట్టించియుండలేదా? అటులనే మహర్షులు సయితము ఏవస్తువునుండియైనను అది రాయిగాని, కుండగాని, జింకగాని, శుకముగాని వానినుండియు నరులను పుట్టింపగలరు.

ఇవన్నియు నెరింగినందుననే దాల్భ్యఋషి కృష్ణపరమాత్మ యొక్క భార్యలతో బ్రాహ్మణునిమూలమున నానందమును బొందుడు అని పల్కెను. బ్రాహ్మణునితో రమింపుము అనియున్నపుడు — అతని మూలమున నానందమయస్సులగు నాశీస్సులం బడయుము అని యర్థముండునని యెరుంగవలెను.

తెలివితేటలు లేనివారి దృష్టితో "రమించుట" "అను శబ్దమునకు తుచ్ఛార్థముండును

దివ్యదృష్టిగల వ్యక్తులకు స్వచ్ఛార్థముండును.

"రతి" యను శబ్దము నుచ్చరించితి మనుకొనుడు. వెంటనే పామరు డేమని భావించును. తనకు నిత్యము అనుభవమైయున్న స్త్రీ సంపర్కము అని యర్థముసేయును. ఆత్మరతి- యోగరతి- విద్యారతి- అను పదములను ఎన్నడైనను ఆతడు వినియుండునాయేమి? ఆత్మరతి యనగా - మరియొక స్త్రీ - లభింపనపుడు - తనలోతానే యొంటరిగ శయనించుచు - తాను పరుండిన పరుపుతోడనో - బల్లతోడనో రమించుటకు ఆత్మరతియనుచు నర్థముచెప్పును. అట్టిభ్రష్టులను గూర్చి యెటులభాషింపగలము. నిద్రారతియను శబ్దమున కర్థమెద్దియని ప్రశ్నింతుమేని - మంచిగాఢనిద్రలో నుండగా - కామోద్రేక మేర్పడుననియు - ఆ సమయమున వావివరుసలు లేనివారైనను సరే యెవ్వరు లభించిన వారితోడనే భోగించుట - నిద్రారతియనుచు నర్థముచేప్పును.

కావున విద్యావిహీనులను వదలి పెద్దలభావములం దీసికొందము. జగమంతయు ప్రళయమున లీనమయిపోగా నా సమయమున శ్రీ మహావిష్ణువు క్షీరసాగరమున ఆదిశేషునిపై పవ్వళించును. ఆ దశ ఒక పద్యమున వర్ణింపబడెను. అటుపైన మరియొక పద్యము వ్రాయబడి యున్నది. దానిం జూతము.

ఉ॥ చారుపటీర హీర ఘనసార తుషార మరాళ చంద్రికా
పూర మృణాళహార పరిపూర్ణ సుధాకర కాశమల్లికా
సార నిభాంగశోభితభుజంగమతల్పమునందు 'యోగ
నిద్రారతి' జెంది యుండు జఠరస్థిత భూర్భువరాదిలోకుడై.

(315వపద్యం-3 స్కంధము)

జఠరస్థిత భూర్భువరాదిలోకుడై =భూలోకము, భువర్లోకము, సువర్లోకము మున్నగునవన్నియు తన గర్భమున నిమిడించుకొనిన వాడై ఆ మహావిష్ణువు

| | |
|---|---|
| యోగనిద్రారతిజెంది | = యోగనిద్రలో జేరి యానందించు చుండును అని యర్థము. |

అంతియేకాని - యోగియొకడును యోగిని యొకతెయు నీరీతిగ నిరువురు స్త్రీ పురుషులు బాగుగ నిద్రబోవుచు ఆ నడుమ అనగా నిద్రమత్తునందే యొడలు తెలియనిదశయం దుండినవారలై యొకరితో నొకరు రమించుకొనుటకు యోగనిద్రారతి యని అర్థము సేయనగునా ?

మరియొక శబ్దమును గాంతము.

వరాహావతారమును దాల్చిన భగవానుడు తాను వచ్చిన పనిని ముగించుకొని యుండెను. ఆ సమయమున బ్రహ్మాదిదేవత లరు దెంచి స్తుతించుచుండిరి.

ఆ ధోరణి యీ క్రింది విధముగా నుండెను.

చ॥ హరి నిజదాసకోటికి గుహాశయుడై రమియించు; నట్టి
తత్పురుషుల కిష్టవస్తు పరిపూర్ణ మనోరథ సిద్ధి గల్గు సు
స్థిరమగుచున్న ముక్తియును సిద్ధముగా జెలువారు నన్న న
స్థిరతర తుచ్ఛసౌఖ్యములు సేకుగుటల్ మరిజెప్పనేటికిన్.

(441 పద్యము 3 స్కంధము.)

| | |
|---|---|
| హరి | = భగవానుడు |
| నిజదాసకోటికి | = తనదాసులయొక్క- |
| గుహాశయుడై | = హృదయములందు నిల్చిన వాడగుచు |
| రమియించు | = వారిని ఆనందింపజేయును |

అనగా రమింపజేయును. తన్మూలమున ఇష్టములు, కోర్కెలు సిద్ధించును. కనుక నే వారికి ముక్తియును సిద్ధమై యుండును.

విషయమిట్లుండ—

అస్థిరేతర తుచ్ఛ సౌఖ్యములు = అస్థిరములును తుచ్ఛము
లును అగు స్త్రీ సంబంధములు
గాని వస్తుసంబంధములు గాని
—అగు సౌఖ్యములు.

సేకురుటల్ = సంభవంబు లగునని

మరిచెప్ప నేటికిన్ = వేరుగ చెప్పవలెనా.

అని తెలియబడుచుండెను.

దేవుడు మనతోడను, మనము దేవునితోడను రమించు చుండుటే ముక్తియని పేర్కొనబడును. అనగా ఆ పరంధాముడు తన దృష్టిని మనపై నిల్పుచున్నపుడు అట్టి కృత్యమునే రమించుటయని పెద్దలు వచింతురు. మనబోటివారైనను సరియే భక్తినవలంబించుచు మన మనసంతయు నా దేవునిమీదనే నిల్పియున్నయెడల నా కృత్యమును సైతము "రమియించుట" అని భాషాసాంప్రదాయమున నెరుంగువారు ధన్యులు.

రమయతీతి రామః= తనప్రజలను. బాగుగ రమింపజేయువాడైనందున రాముడు అను నామమేర్పడెనని విజ్ఞులు తలంతురు. ఆత్మరతికి అర్థమును వినుడు. మన మనసును లోనికింబంపి అన్యవస్తు సహాయ్యమును గోరకయే ఆ లోభాగమందు పరమాత్మతో గూడియుండుటకు ఆత్మరతియని పేరు. ఈ సమయమున కొంచెమైనను భాషాజ్ఞాన మవసరమై యున్నది. అటుల సంభవంబగునేని వేదములయందును పురాణముల యందును, ఇతిహాసములయందును మరియు వేదాంతములయందును బాహ్యులుగ దోచునవి యన్నియు నీతులునై యున్నవని మతిమంతులు తెలిసికొనుచుందురు. ఆ మతులను లోలోపలియున్న యెడల సర్వము బ్రహ్మమయముగా తోచును.

పైకి బూతుగ తోచును. లోనికింబోవ అంతయు నీతిమయమై యుండును.

మన యాంధ్రదేశమున నెల్లతావులయందు కీర్తింపబడు వేమనయోగిచే నుపదేశింపబడిన పద్యములం జాతము.

ఆ॥ కుక్కనుతిన్నవాడు గురులింగజంగంబు
పందినితిన్నవాడు పరమయోగి
ఏనుగనుతిన్నవా డెంతటివాడయా
విశ్వదాభిరామ వినురవేమ

ఆ॥ చీరెకట్టిరాత్రి సిగ్గును నెరిగియు
పగలు చీరెవిడిచి పనులుసేయు
చేడెకాదుర యిది చేవాడకత్తెరా
విశ్వదాభిరామ వినురవేమ

ఆ॥ పృధివిశుదకమేగె పృధివిపై మొలకెత్తె
మొలకపృధివికేగె మొగడె సుతుడు
ధరణిసుతులకెల్ల తల్లియేపెండ్లాము
విశ్వదాభిరామ వినురవేమ

క॥ చిన్నది మెలపాయంబున
కన్నది పతిలేకసుతుని గడు చిత్రముగా
నెన్నడు రతికేళెరుగదు
చన్నియ్యక పెంచెనవతె జగమునవేమా

శ్లో॥ గంగా యమునయోర్మధ్యే బాలరండా తపస్వినీ
బలాత్కారేణ గృహ్ణీయాత్ తద్విష్ణోః పరమంపదం॥

గంగాయమునా నదులమధ్య భాగమున నెవరయిన నొక బాలవితంతువు (భిన్నవిధవరాలు) గోచరించినయెడల వెంటనే బలా

త్కరించి యామెను చేపట్టవలెను. ఆ రీతిగ మాటిమాటికి ఆమెతో క్రీడించుచుండు రేని అదియే పరమపదమై యుండును. అనుచు నీరీతిగ వేదాంతార్థములతో నిండిన పద్యములు శ్లోకములు భారతీయవాఙ్మయమున నెరుంగగలము. పైపద్యములలోని సత్యార్థము అత్యంతరహస్యముగ నుండును. దానిందెలియుటకు యత్నింపవలెను. అంతియే కాని మహనీయుడగు ఆ వేమన యోగిని దిట్టనారంభింపరాదు. రాబోవు భాగములలో పైపద్యములలోని అంతరార్థములను జూచుటకై పాఠకులు నిరీక్షింపవలెనని మనవిచేయుచున్నాను.

శ్రీకృష్ణుడు తన బావమరదియగు శిశుపాలునకు మాటలాడిన రుక్మిణిని "చెల్లెలు" అను భేదములేక పెండ్లాడెననుచు నీచాతినీచమగు ధోరణిని జూపిరి. విదర్భదేశమున కధిపతియగు భీష్మకుడు అను రాజుయొక్క కూతురు రుక్మిణి. ఆమె శ్రీకృష్ణునకు చెల్లెలని ఏ గ్రంథమున వ్రాయబడియున్నదో చూపగలరా? రుక్మి అనునట్టి యన్నగారొకరు తన చెల్లెలిని అనగా రుక్మిణిని శిశుపాలున కొసగెదనని తెలిపియుండెను. ఆనాడు జరిగిన కథ అంతియే కదా! రుక్మిణి మాత్రము శ్రీకృష్ణునే వరించెనని భాగవతమున వివరింపబడెను. అందులకై యొక బ్రాహ్మణుని ఆశీర్వదించి —

" అయ్యా! శ్రీకృష్ణునికడకు పోయిరమ్ము. నా సందేశమును వినిపింపుము " అని ప్రార్థించియుండెను. భీష్మకమహారాజు వేదమంత్రముల మూలమున శిశుపాలునకు కన్యాదాన మొనరించెనా ? శిశుపాలునిచే మంగళసూత్రము బంధింపబడెనా ? వారిరువురు తలంబ్రాలు పోసికొనిరా ? అందొక్కటియు జరిగినదికాదు. ఇక నా రుక్మిణీదేవి శిశుపాలున కేరీతిగ భార్యయైనది ? అతనికి భార్యయైయున్నచో శ్రీకృష్ణ పరమాత్మకు చెల్లెలుకావచ్చును. ఆ రీతిగ సంభవించినదికాదు. కావున నొక మహనీయుని దూషించుటకుబూనిన గ్రంథకర్త కేవలము హిందూమతద్వేషియై యుండనోపు. లోకానుభవము మరియు సాంప్రదాయము గుర్తెరుంగనివారు ఇట్టిగ్రంథములనువ్రాయుట దేశక్షేమమునకు తగినపనియైయుండదు. ఎద్దియైనను విజ్ఞులగు

విషయమున్నదో ద్దానిని వ్రాయునెడల లోకము మెచ్చుకొన గలదు. ఇంకను వినుము.

ద్రౌపది అయిదుగురిని పెండ్లాడెనని పురాణములం దుండె నట. అది దోషమట. అట్టి విషయము తాను నమ్మనట. మంచిదే. ఏ పురాణమున అయిదుగురుభర్త లుండిరనియున్నదో ఆ పురాణము ననే ఆ భర్తలైదుగురు వేరువేరుగనున్ననూ. వారియందు వ్యవహ రించుచున్న జీవుడుమాత్రము ఒక్కడేయని నిరూపింపబడెను. దేవేం ద్రు డొక్కడే అయిదురూపములు ధరించెనని స్పష్టపరుపబడినది. అతనిభార్యయగు శచీదేవి ద్రౌపదిగ నవతరించెను. కనుకనే తనపతిని తాను పెండ్లాడెననియు కావున అందెంతమాత్రము దోషములేదనియు ఆ పురాణములు దెల్పియేయున్నవి.

హిందూదేశము – హిందువులు – మరియు హిందుమతము ఆవిర్భవించి నేటికి –

195, 58, 85, 063 సం॥ లు

అని ఎన్నియోమారులు హిందుమత గ్రంథమాల వెలువరిం చినది ఆ మహత్తరంబగు దీర్ఘకాలమునుగాంచి వెంటనేసహింప జాలని వ్యక్తు లెవరయిన నుండరా? “ఏదినిజము” అను గ్రంథమును రచించినట్టి కర్తయు అట్టివారిలో నొకరై యుండిరి. వారివాక్యము వినుము –

“ హిందుమతముపుట్టి నేటికి 195, 58, 85, 063 సం॥లైనవని ............పచరించియున్నారు, కాని ‘ఏ ఇతరగ్రంథ’ మందును వ్రాయబడి యుండలేదు.”

(ఏదినిజము. 2 వ పేజి)

ఆ విషయమై ఇతరగ్రంథకర్తలెవ్వరయిన వ్రాసియుండిరేని తాను విశ్వసింతు నని చెప్పినట్లున్నది. కావున అద్దానింజూపి ఆనం దింపజేయుదము.

'భారతభూమి' అను నామము మనదేశమున కెపుడువచ్చెనో తెలియునా ? ఈ భూమి సృజింపబడినపిదప, ముప్పదికోట్ల వత్సరములవరకు ఏ మనుప్రభువు పరిపాలించియుండెనో — అతనికి ఆగవతరము వాడయిన "భరతుడు" దివ్యముగ పాలించుటం బట్టి యీ దేశమునకు అతనిపేరున భరతఖండము అను బిరుదమేర్పడెను. **195** కోట్ల సంవత్సరములలో మొదటి మనువు యొక్క కాలమును అనగా 30 కోట్లను తీసివేయగా 165 కోట్ల సంవత్సరములకు పూర్వము నుండి భారతీయులకు హిందుమత మున్నటుల నర్థమగుచున్నది.

20-9-1947 శనివారమునుండి ప్రచురింపబడిన జన్మభూమి యనుపత్రికను చూడుడు.

"అమెరికా లోని 'కొలరెడో' గుహలలో **96** అడుగుల పొడుగుగల అస్థిపంజరాలు సుమారు యెనుబదివేల సంIIల క్రిందట జీవించిన మనుష్యులై ఉంటారని తెలుస్తున్నది."

కొలరెడో అనునది అమెరికా లోని యునైటెడ్ స్టేట్సు లో నున్నది.

లండన్ 20-9-1947

ఈ రీతిగ నన్వేషించిన కొలది సృష్టికాలము అతి ప్రాచీన కాలమునకు పోవుచున్నది.

మరియు యేల్ పట్టణమునగల విశ్వభారతీస్థానమునందు పదార్థ విజ్ఞానకోవిదుడగు " "అలోయస్ కోనరెక్" Prof- Aloiskonarek పండితుడు ఖనిజ పదార్థములయందుగల కిరణప్రసారముల శక్తి నిబట్టి వానివాని యుత్పత్తి కాలనిర్ణయముల గావించుచు యూరినైటు అను ఖనిజపదార్థము యొక్క కాలనిర్ణయమును గావించుచు ప్రస్తుత ప్రపంచసృష్టి యిప్పటికి షుమారు—

1852 మిలియనుల వత్సరములక్రిందట - అనగా—

185, 20, 00, 000 – (నూట యెనుబదియైదుకోట్ల యిరువది లక్షల) సం॥లు క్రిందట జరిగియుండెను.

ఇటీవలజరిగిన 'కనెక్టికట్' విద్వత్సభయందు సహేతుకముగను సాదృశ్యమును కనబరిచి యుండినటుల చెప్పబడియుండెను.

The hindu Illustrated Weekly of 22 Feb. 1931 -33.

కలికవిజ్ఞానం, ప్రథమభాగం 86 పేజి )

ఇందు 185 కోట్ల క్రిందట సృష్టియైనదని విజ్ఞానశాస్త్రవేత్తలు నిర్ణయించినట్లు విశదమైనది.

"ఆభాస క్రైస్తవం అను గ్రంథమున 72 వ పేజీ చూడుడు. " అవుట్ లైన్ ఆఫ్ మాడర్న్ నాలెడ్జి " డా. విలియంరోసుచే వ్రాయబడినది. 16 వ పేజి)

"So lately as the close of 19th century, chronologies were published and believed and placed the creation of the whole universe 4004 B.c. and comprised the whole course of human history with in a span of less than Six thousand years. Archaeology dates the pilt down man at 100,000 B. C. the Hedelberg man at 250,000 B. C.

and Java apeman at 500,000 B.C

(Do Page 810)

" పందొమ్మిదవశతాబ్దము ముగియుభాగములో ప్రపంచ సృష్టి క్రీస్తుకుపూర్వము 4004 సంవత్సరములుగ నిర్ణయింపబడి ప్రకటింపబడుటయు, ప్రజలవలన విశ్వసింపబడుటయు తటస్థించినందున మానవ చరిత్రయంతయు 6 వేల సంవత్సరములలో నిమడ్చబడినది.

కాని పురాతనశాస్త్రము (Pilt down man) పిల్టుడౌన్‌మనిషి క్రీ॥ పూ॥ లక్ష సం॥ రములనుండి యున్నట్లును, (Hei delbergman ఆఫ్రికాలోని హిడెల్‌బర్గుమనిషి క్రీ॥ పూ॥ రెండున్నరలక్షల సం॥ నుండి యున్నట్లును (Java age man) జావాలోని తోక లేని కోతివలె నుండు మనిషి క్రీ॥ పూ॥ అయిదులక్షల సం॥ రముల నుండి యున్నట్లును చెప్పబడుచున్నది.

పై లెక్కలన్నియు బైబులు అను గ్రంథముచే నిరసింపబడి నవి. ఎట్లన జగము నిర్మింపబడి ఆరువేలేండ్లు గతించెనని క్రైస్తవుల పరిశుద్ధగ్రంథము తెల్పుచున్నది.

విదేశీయదేవుడు ఆరుదినములలో నీ జగమునంతయు సృజిం చెనట. నరుని నిర్మించినది ఆరవదినమునందే యని అందు లిఖింపబడెను. ఏడవదినమునందు పనులెవ్వియు లేనందున ఆదేవుడు విశ్రాంతి గైకొనెను. అని బైబులునందు ఆదికాండలో రెండవ అధ్యాయమున- 1, 2, 3 వచనములలో పైభావమును దర్శింపగలము.

ఆరువేలేండ్లనాడు – ఆ దేశపు దేవుడు ఆదాము, హవ్వ అను దంపతులను ఆది మానవులుగ నిర్మించియుండెను.

ఆ దంపతుల వంశములందు జన్మించినట్టి తరములవారి వయ సును వరుసగా నెరుంగుచు నేటివరకు లెక్కించుమేని – షుమారు ఆరువేలేండ్లక్రిందట ఈ జగము నిర్మింపబడెనని నిశ్చయింపగలము.

భూగర్భ శాస్త్రవేత్తలగు విదేశీయ పండితులు బైబులులోని సృష్టికాలమును నిరసించుచు – అది న్యాయమయినదికాదని వాదిం చుచున్నారు. అందువలన బైబులు సత్యవేదముకాదని ఋజువగుచు న్నది. ఇందుకు ప్రత్యుత్తరము 'ఏదినిజము' అను గ్రంథకర్త వివరింప వలసి యుండును.

2. బైబులు ననుసరించి "దేవుడైన యెహోవా తూర్పున 'ఏడెన్' అను ఒక తోటను నిర్మించి తనచే సృష్టింపబడిననరుని దానిలో ఉంచెను."

(ఆదికాండ. 2వ అధ్యాయం 8వ వచనం)

అని తెలియ గల్గితిమి.

"ఏడెన్" అను తోట - కాస్పియన్ సి - బ్లాక్ సి అనునట్టి రెండు సరస్సులకు నడుమ ఎంతయో దూరమున ఉండెనని భూగోళ శాస్త్రప్రకారము గుర్తింపగలుగుదుము. ఆ దేశము ఏషియామైనరు లోనిది. దానిని పాలస్తీనా అనియు నిర్వచింతురు. విదేశీయ దేవుడు విదేశీయ మూలపురుషులగు ఇరువురు దంపతులను ఆ దేశమున సృజించియుండగా అద్దానిని కాదనుచు ఆ దంపతుల జననము భరతఖండమున గలిగెనని ఏ.ని గ్రంధకర్తగారు వ్రాసియున్నారు. ఆ పంక్తులం జూతము.

"కాని ఆదాము – హవ్వలు "యీ భరతఖండమునందే" ప్రద్యోతమహారాజు అనంతరము, విష్ణువరప్రభావముచే, కలిపురుషుని కోర్కెప్రకారము జన్మించిరని, భవిష్యపురాణము ప్రతిసర్గపర్వములో వ్రాయబడియున్నది.

(ఏదినిజము 72 పేజి)

దీనిచే వీరికి ఆ పురాణము ప్రమాణమైయుండెనని యర్థమగుచున్నది.

తాను క్రైస్తవుడైయుండి - క్రైస్తవులకు పరిశుద్ధగ్రంథమై వెలయు బైబిలును ధిక్కరించుచు – హిందువులకు పరమ ప్రమాణమై రాణించుచున్న భవిష్యపురాణమును యేల స్వీకరించియుండెనో! ఆ హిందువు – రాజకీయపుటెత్తువలె యున్నను. ఆ యెత్తును వేయుచున్న యెడల బైబిలు పరిశుద్ధగ్రంథము కాకపోవును. తాము ఆ పురాణమును నమ్మలేదని పల్కుదురేమో! వెంటనే యా పుణ్యావచనములను

వల ఖండింపకుండెను. అందుచే నద్దానిని సమ్మతించెనని అర్థమగు చున్నది. కాదందురా! ఇపుడైనను ఖండించుటకు బూనుకొనవలెను. ఆ పనిచేయుదురేమో చూతము. క్రైస్తవలోకమంతయు ఆదాముహవ్వల జననమును విదేశములలోని యేషియామైనరు ప్రాంతమగు 'యేడెన్' అనునట్టియొకానొక తోటయనుచు గగ్గోలుపెట్టుచుండ నద్దానిని పెడచెవినిపెట్టి తద్విరుద్ధముగ వ్రాయుటకు ఏదో కొంపమునిగి నంత బాధ వచ్చియుండును. అద్దానిని తొలగించుకొనుటకై యీ క్రొత్తయెత్తును వేసియుండవలెను అని నిర్ణయింపనచ్చును. ఆ విషయమై యన్వేషింతము.

"నరులు భూమిమీద విస్తరింప నారంభించినతర్వాత కుమార్తెలు వారికి పుట్టినపుడు దేవుని కుమారులు నరులకుమార్తెలను చక్కనివారిని జూచి వారందరిలో తమకు మనసువచ్చిన స్త్రీలను వివాహము జేసికొనిరి."

అని బైబులునందుండెను. ఆ స్త్రీ లెవ్వరో తెలిసికొనియుంటిరా? వారి చెల్లెండ్రేసుమా! లేదా అక్కలయి యుందురు. విదేశములలోని ప్రజలు ఒకేతల్లికడుపున పుట్టినను తమకుమార్తెలను పెండ్లాడుచుందురను విషయము బైబులునుండియే స్వీకరింపగలము.

అట్టి ఘోరమగు వృత్తాంత ముండునాయని ప్రశ్నింపుడు. లేకేమి? అది పరిశుద్ధగ్రంథమగుటచే తనదృష్టి కుండున్న పరిశుద్ధ విషయములం దెల్పియున్నది.

ఈనాటి భారతీయక్రైస్తవులు భారతీయులగర్భమున జన్మించు టంబట్టి — వారు ఆదామహవ్వల బిడ్డలైయున్న సోదరసోదరీమణుల పెండ్లిండ్లను మెచ్చుకొనలేకపోయిరి. అందుకనియే బైబులులోని వాక్యములను మరెవ్వరును చదివియుండరని నిశ్చయించుకొని వానిని కప్పిపుచ్చుచు పరమపావనమై వెలయు హిందువులగ్రంథమును అనగా భవిష్యపురాణమును బాగుగ పఠించి తనమ్మౌలమున నేర్చుకొనిన జ్ఞాన బలముచే నీ క్రిందివిధముగ వ్రాసెను.

"మరియు ప్రద్యోతమహారాజు (యొక్క) పితరుడగు క్షేమకుని మరణానంతరము 12 వేల సంవత్సరములకు ఆదాము అను పురుషుడును, హవ్వయను స్త్రీయును హిందూదేశమున బుట్టిరనియు వారే మ్లేచ్ఛవంశ ప్రవర్ధకులనియు భవిష్యపురాణములోనే లిఖింపబడెను. ఇక వారి సంతతివారగు (అనగా భరతఖండమున జన్మించియున్న ఆదాము హవ్వల సంతతివారగు) సోదర సోదరీమణులు పెండ్లియాడిరని ఎట్లు చెప్పగలరు? అప్పటికే మానవులెందరో హిందూదేశమందు కాపురముచేయుచుండిరికదా? ("ఏది నిజము" 72 వ పేజీ) 6 మొదలు (పంక్తివరకు)

ప్రద్యోతమహారాజు- క్షేమకుడు- మున్నగువారును ఇంకను మరెందరో ప్రజలున్నూ హిందుదేశమున కాపురముచేయుచుండగా అటుపైన 12 వేల వత్సరములు గతించినపుడు ఈదేశమున ఆదాము హవ్వలు పుట్టియుండిరని ఆ గ్రంథకర్త నిర్ణయించియుండెను. కనుకనే వారిసంతతివారగు బాలికలున్ను, బాలురున్ను అన్నదమ్ములైయున్న హేతువున తమలోతాము పెండ్లాడలేదు. అంతకుపూర్వమే హిందూదేశమున జన్మించియున్న భారతీయబాలురులేరా! ఆదాము సంతతివారి బాలికలను హిందూబాలురకిచ్చి వివాహము చేసిరి. ఇక దోషమేమున్నది? అనుచు తనయింటి కంటుకొనిన నిప్పులమంటను వెంటవెంటనే చల్లార్చుకొనుటకై యీ క్రొత్తయెత్తునువేసి విజయభేరిని మ్రోగించెను. ఎంతకైనను సాహసింపగల తెలివియున్నచో కొంతకాలమీ లోకమున కీర్తిని గడింపవచ్చునని యెంచి పైరీతిగ వ్రాయుటకు సాహసించిరికాబోలు!

బైబులుగాని, దేవుడుగాని తమకు నచ్చనినాడు ఇతరమత గ్రంథములనైనను ఆశ్రయింపకతీరదు. అందుల కెవ్వరును అడ్డుపడజాలరు.

"మనుబ్రహ్మ అనునామముగల దేవుడొకడుండెను. అతని భార్య "శతరూప" యను నామముగలదై వ్యవహరింపదొడగెను. ఆ మన్నువుయొక్క సంకల్పబలముచే జనించుటంబట్టి ఈ లోకన్ను

లోని నరులు మనువుయొక్క సంతతివారైయుండిరి. కనుకనే ఆ "మను" అను శబ్దమును మొదటి యక్షరములుగ నుంచుకొని "మనుజ" అను పేరును బెట్టుకొని యుండిరి. అదే రీతిగ, మనుష్య- మానవ నామము లతో వ్యవహరించుటయు జరిగినది."

అని హిందుమతగ్రంథమాలలో వివరింపబడెను. అద్దానిం గాంచి- ఏ. వి. గ్రంథకర్తగారి కొక సంశయ మేర్పడెను.

విదేశీయులు – యెహోవా అను దేవునకుగాని,
ఆదాము అను వ్యక్తికిగాని,
జన్మించియున్నయెడల, వారు
యెహోవీయు లనియు,
ఆదామీయు లనియు

పిలువబడుచుందురు. ఆకారణమున "మనుజులు" అను నామము వారల కెటుల సంభవించును. అనుచు వారి హృదయము ఆందోళనము పొందెను. తుదకు యీ క్రిందవిధముగ నిర్ణయించినవారైరి.

## మనుబ్రహ్మకు- ఆదాము అనుపేరు పర్యాయపదముగ నుండెనట

ఆదాము అనువ్యక్తియు–మనుబ్రహ్మయు వేరుగా లేరనియు, ఒకరికే ఆ నామములున్నవనియు మనుబ్రహ్మ మూలముననే సృష్టి యంతయు జరిగియుండెననియు నిశ్చయించి తనగ్రంథమున ప్రకటించి యుండెను. ఈ రీతిగ విదేశీయులుసైతము మానవులలోనే పరిగణింప బడుదురు - అను సిద్ధాంతమును లేవదీయగల్గెను.

మనుబ్రహ్మయే ఆదామనియు, అతడు ప్రత్యేకముగ లేడనియు, ఏ.వి. గ్రంథకర్త వ్రాసియుండురా! అని యెందరో సంశయించుచు ఇది అభూతకల్పనము అనియు జెప్పి పరిహసింతురు. అందుకై ఆ గ్రంథములోని విషయములనే ఇచట కొన్ని సూచుచున్నాను.

"సూక్ష్మముగ పరిశీలించితిమేని ఆ యా పురాణములలో వర్ణింపబడిన 'బ్రహ్మ ఆదా'మనియు అతని అర్థాంగియగు శతరూప హవ్వాయనియు, వారికిపుట్టిన ప్రియవ్రతుడు ఉత్తానపాదుడుఅనువారు కయీను, హేబేలు లనియు, వారితరువాత జన్మించిన వందలాది స్త్రీ పురుషులవలననే ప్రపంచమందలిప్రజలు వృద్ధిపొందిరనియు గ్రహింపగలము బైబిలునందలి ఆదికాండమునుచదివినవారికి, పురాణములను పఠించినవారికి సత్యచరిత్ర తెలియగలదు."

(ఏదినిజము – 73 పే 1 టు 7 పంక్తివరకు)

మనువుయొక్కపుత్రులనే ఆదాము-హవ్వల బిడ్డలనుచు వక్కాణించియుండిరి. ఇదంతయు సాహసము కాకపోదు. వారి జీవితములో నిదియొక గొప్ప కళంకమైయుండును. అదేయిది. ఇదేఅది. స్వదేశమే విదేశము. విదేశమే స్వదేశము. స్వదేశీయులే విదేశీయులు. ఆ విదేశీయులే స్వదేశీయులు. అనుచు నెల్లరిని యేకముచేయుటకుగాను యత్నించినట్టి చిత్రముగు ఒకానొక వ్యక్తియెయుండనోపు. ఇకముందు స్వదేశమతమే క్రైస్తవమతము. క్రైస్తవమతమే స్వదేశమతము. అనియు నెల్లరకుంజెప్పి ఓ భారతీయులారా! మీరందరు క్రైస్తవులై యుంటిరి. అని హెచ్చరింపవచ్చు. ఇట్టి వలలను పన్నుచు నెన్నిటినో మనుష్యచేపలను బట్టుకొననెంచెను. అది క్రైస్తవులకు సహజమగు జాలరివృత్తియైయున్నది.

హిందువులు శాస్త్రసంబంధమగు కర్మల నాచరించునపుడు

"శ్వేతవరాహకల్పే, సప్తమే వైవస్వతమన్వంతరే
అష్టావింశన్మహాయుగే'

అనుచు సంకల్పకాలమున నుచ్చరింతురు. దానియర్థమును వినుడు. నేటి ప్రపంచమునకు శ్వేతవరాహకల్పమునిపేరు. దానివయసు 432 కోట్లసంవత్సరములు. అందులో పదునాల్గు మనువులవంశస్థులు రాజ్యమేలెదరు. ఒక్కొక్కమనువువంశస్థులరాజ్యకాలము 30, 67, 20,000 సంవత్సరములు.

మొదటి మనువు - స్వాయంభువు

రెండవ మనువు - స్వారోచిషుడు

మూడవ మనువు- ఉత్తముడు

నాల్గవమనువు - తామసుడు

అయిదవ మనువు - రైవతుడు

ఆరవమనువు - చాక్షుషుడు

ఏడవమనువు - వైవస్వతుడు

ఈరీతిగ పదునాల్గుమంది మనువు లుండిరి.

| సప్తమే | వైవస్వత | మన్వంతరే |
|---|---|---|
| \| | \| | \| |
| ఏడవవాడు | వైవస్వత | మనువు |

ఆర్గురు మనువులకు -

30, 67, 20, 000

6

184, 03, 20, 000 సం. లు పట్టును.

అటుపైన ఏడవమనువు సైతము - భూమండలమును సూక్ష్మ దేహముతో పాలించుటకు బూనెను. షుమారు 12 కోట్ల వర్షముల క్రిందట నితడు రాజ్యమునకు వచ్చెను. ఈ వైవస్వతుని కాలమును అటుంచుచు- బైబులులోని నోవహు అనువాని కాలమును గుర్తింతము. ఇందుకైముందుగ ఆదాముయొక్క వంశస్థులకాలమును దెలుసుకొనవలెను. ఆదామునకు షేతు అను బిడ్డపుట్టినప్పటికి 130 వండ్లు.

| | | | |
|---|---|---|---|
| షేతుకు యేనోషుఅనువాడు పుట్టినపుడు | | | 105 వండ్లు |
| ఏనోషుకు కేయినాను | ,, | ,, | - 90 ,, |
| కెయినానుకు మహలలేలు | ,, | ,, | - 70 |

| | | | |
|---|---|---|---|
| మహాలలేలుకు యెరెదు | ,, | ,, | - 65 ,, |
| యెరెదుకు హనోకు | ,, | ,, | - 162 ,, |
| హనోకుకు మెతూషెల్ | ,, | ,, | - 65 ,, |
| మెతూషెలుకు | ,, | ,, | - 180 ,, |
| లెమెకునకు నోవహు | ,, | ,, | - 182 ,, |

నోవహు అనువాడు




అనుముగ్వురను కనినప్పుడు 500 సం॥ల వయసును కల్గియుండెను.

నోవహుయొక్క కాలముననే జలప్రళయము సంభవించెనని బైబులునందు కలదు. ఆనాటికి ఆదామునుండి గతించిన సంవత్సరములు షుమారు 1600 సం॥ లయ్యెను.

బైబులుననుసరించి ఆదాముజన్మించి నేటికి—

6000 సం॥ లయ్యెను. దానిలో

1600 సం॥ లను తీసివేయగా

4400 సం॥ ల కాలమందు నోవహు తన జీవయాత్రను సాగించెనని అర్థమగుచున్నది.

నేటికి పూర్వము షుమారు ' నాల్గువేలనాటివాడు '

'నోవహు' అనియు

'ఆరు లనాటివాడు' ఆదాము అనియు సారాంశము.

విషయమిటులుండ— ఆదాము అనినను స్వాయంభువ మనువు అనినను ఒక్కటే యని వ్యవహరింపనగునా?

స్వాయంభువమనువును ఆదాము అనుచు నిశ్చయింతుమేని

(1) ఆదాము జన్మించి— 195 కోట్ల సంవత్సరముల క్రిందట అని తెలుపవలసి యుండును.

(2) వైవస్వత మనువును నోవహు క్రింద లెక్కింతుమేని నోవహు కూడ 12 కోట్ల వత్సరముల వాడని నిర్ణయింపక తప్పదు.

వైవస్వత మనువు రాజ్యమున నిల్చియున్న సమయమునను పూర్వమే ఈలోకమున జలప్రళయము సంభవించినది. అనగా సుమారు 12 కోట్ల సంవత్సరముల క్రిందట భూమండలమున ప్రళయము సంభవించెను. నోవహు యొక్క జీవితకాలమందు విదేశములలో జలప్రళయము సంభవించెనని నిర్ణయించినయెడల బైబిలులోని జలప్రళయము 12 కోట్ల సం॥ల నాటిది కావలెను. నిన్న మొన్నటి ఆదాముహవ్వలకును ఆదికాలపునాటి శతరూప బ్రహ్మలకును ఎంతమాత్రము సంబంధము పొసగదు ఈ విషయమునంతయు పాఠకులు గుర్తించెదరు గాక! ఆ గ్రంధకర్త పైవాని నన్నిటిని దెలిసికొని జ్ఞానమును పొందుటకు సమయ మాసన్నమైనది. ఆయనచే గావించబడిన ఆక్షేపణము లన్నిటికి సరియగు ప్రత్యుత్తరము లిచ్చుటకు హిందుమత గ్రంధమూల బద్ధ కంకణముతోనున్నది. ఆంధ్రులందరును విధిగా పుస్తకములను దెప్పించుకొని పఠింతురు గాక!

దేశాభిమాన పూరితులగుచు తమ పూర్వమతమున జేరెదరు గాక! ఎందుకన తనను ప్రార్థించువారికి తాను మోక్షము నొసగజాలనని క్రీస్తుగారు స్వయముగ దెల్పియుండిరి. ఆ వచనముల నాలకింపుడు.

"ప్రభువా ప్రభువా అని నన్నుపిలుచు ప్రతివాడు పరలోక రాజ్యములో ప్రవేశింపడు గాని పరలోకమందున్న నా తండ్రి చిత్త ప్రకారము చేయువాడే ప్రవేశించును"

(మత్తయి. 7 అ. 21 వచనం)

" ఆదినమందు అనేకులు నన్నుజూచి ప్రభువా ప్రభువా మేము మీనామమును ప్రవచింపలేదా ? నీ నామమున దయ్యములను వెళ్ళగొట్టలేదా ? నీనామమున అనేకమైన అద్భుతములు చేయలేదా ? అని చెప్పుదురు. అప్పుడు నేను మిమ్ము నెన్నడును ఎరు

గను. అక్రమముచేయువారలారా ! నా యొద్దనుండిపొండని వారితో చెప్పుదును. (మత్తయి, 7. అ. 23, 23 వచనములు )

తనను ప్రార్థించువారికి పరలోక రాజ్యమున జేరుటకు అర్హత కలుగనేరదనుచు బాగుగ వివరించియుండెను. విషయమిటు లుండ ఏసుగారి పాదములం బట్టుకొని వ్రేలాడుటెందుకో తెలియ జాలకున్నాము. పోనిండు. వారి దేవుని చిత్తమెట్టిదో తెలిసికొందము.

## విదేశీయదేవుని చిత్తము

(1) విగ్రహములను పూజించుచు, దైవభక్తులమని ప్రకటించుకొనువా రున్నయెడల వారిని రాళ్ళతో చితకగొట్టవలెను.

(2) మరియు కత్తులచే సంహరింపవలెను. అంతియేకాదు.

(3) వారు నివసించుచున్న గృహములనుసైతము నేల మట్టము గావింపవలెను.

అనునవి ఆ దేవుని చిత్తమందున్న విషయములు. కావున నారీతిగ ప్రతివ్యక్తియు నాచరింపవలెను. క్రీస్తుగారు తన భక్తులను పరీక్షించు సమయమేతెంచినపుడు తన తండ్రిగారిని ఆ భక్తులు తృప్తిపరచిరా లేదా? యనుసంశయమును సైతము తొలగించుకొనవెంచును.

తాను ప్రియకుమారుడైయున్నందున తన తండ్రినికూడ ప్రియముగ జూచుట తనకు విధియని నిశ్చయించుకొనెను. అది న్యాయసమ్మతము. తా నుపదేశించిన ధర్మములెన్నియో కొన్ని మహత్తరములై వెలయువవి కలవు. ఆ రీతిగ బోధించినంగాని ప్రజలు తనను విశ్వసింపజాలరు. అట్టిధర్మములాలకించిన కారణమున లోకులు వందలకొలది తనను వెంబడింపగలరు. ఈరీతిగ పూర్వరంగమునంతయు సిద్ధపరచి అటుపైన-

జనులారా! నేను మి మ్ముద్ధరించువాడను గాను. నాకొక తండ్రి గలడు. అతనికి బద్ధుడనై యుంటినని విశ్వసింపుడు అని నమ్మించుచుండును.

లోకమును సృష్టించినట్టి యజమాని యెహోవా అను దేవుడనియు— పరలోకరాజ్యమున సైతము అతడే అధిపతియై యుం

డెననియు కావున ముక్తిప్రదాతయు నాతడే యనియు నిర్ణయించుకుని అటుపైన ఆ దేవుని చిత్తప్రకారము అనగా ఆయన ఆజ్ఞాపించు రీతిగ వ్యవహరించుటకు గాను ముందడుగు వేయవలెను. అదియే క్రైస్తవులకు కర్తవ్యము.

## ఆ దేవుని యాజ్ఞలెవ్వి ?

[ ద్వితీయోపదేశ కాండ 13 అ. 6 నుండి 17 వచనములు ]

" నీ తల్లి కుమారుడే గాని, నీ సహోదరుడే గాని నీ కుమారుడే గాని నీ కుమార్తెయేగాని నీ కౌగిటి భార్యయేగాని నీ ప్రాణ స్నేహితుడే గాని భూమియొక్క యీకొన మొదలుకొని ఆ కొనవరకు నీకు సమీపముగా నుండినను నీకు దూరముగనుండినను నీచుట్టు నుండు జనముల దేవతలలో నీవును నీ పితరులును యెరుంగని యితర దేవతలను పూజింతము రమ్మని రహస్యముగ నిన్ను ప్రేరేపించిన యెడల వారి మాటకు సమ్మతింపకూడదు.

వారిమాట వినకూడదు, వారిని కటాక్షింపకూడదు, వారియందు జాలిపడకూడదు, వారినిమాటుపరచకూడదు, అవశ్యముగ వారిని జంపవలెను. చంపుటకు నీజనులందరికి ముందుగాను నీచెయ్యి మొదట వారిమీదపడవలెను.

నీవు నివసించుటకు నీ దేవుడైన యెహోవా నీకిచ్చుచున్న నీపురములలో యేదో యొకదానియందు పనికిమాలిన కొందరుమనుష్యులు నీమధ్యలేచి మీరు యెరుగని యితరదేవతలను పూజింతము రండని తమపురనివాసులను ప్రేరేపించిరని నీవువినినయెడల నీవు ఆ సంగతిని శోధించి పరిక్షించి బాగుగ విచారింపవలెను. అది నిజమైనయెడల అనగా అట్టి హేయమైనది నీమధ్యజరిగిన యెడల,

"ఆ పురనివాసులను అవశ్యముగ కత్తివాత సంహరించి"

దానిని దానిలోనున్న సమస్తమును దాని పశువులను కత్తివాత నిర్మూలనము చేయవలెను. దాని కొల్ల సొమ్మంతటిని విశాలవీధిలో చేర్చి నీ దేవుడైన యెహోవాపేరిట ఆ పురమును దానికొల్లసొమ్మునంతటిని అగ్నిహోత్రిగ కాల్చివేయవలెను. అది తిరిగి కట్టబడక

యెల్లప్పుడు పాడుదిబ్బయై యుండును.

వింటిరా! విదేశ దేవుని విశాల హృదయము. సర్వభూత దయామయుండన నీరీతిగ నుండవలెను. ఎంతటిఘోరమగుదుర్వార్తను వినియుంటిమో! చదువరులే గ్రహింపగలరు. పరిశుద్ధగ్రంథములనిన నిటులుండవలెను. ఈరీతిగ వ్యవహరించినవ్యక్తిగానున్నవాడే- పరిశుద్ధమగు సత్యదేవుడై యుండును.

పాఠకులారా!

అట్టిదేవుని ప్రార్థింతురేమో! జాగ్రత! ఆ దేవుని విడనాడివేరొక దేవదేవునిగాని అన్యదేవతలనుగాని భజించువారుండినగుకొందము.

అట్టివారు తనయెదుట కొన్ని విగ్రహములం బెట్టుకొని వానిని గాంచినపుడెల్ల దేవదేవుని జ్ఞప్తికిం దెచ్చుకొనుచు ప్రార్థించుచుందురు. అట్టివారొనరించిన నేరమేమున్నది? ఒకవేళ నేరమైయున్నను అల్పదోషముక్రింద లెక్కింపవచ్చును. విషయమిటులుండ మంచి చెడ్డల విభజింపజాలక తాను దేవుడైయుండియు విగ్రహారాధకులను కనికరములేక కత్తులతో బొడిచి సంహరింపుడని ఆజ్ఞాపించుట న్యాయమైయుండదు.

విదేశీయదేవుని చిత్తమీరీతిగ మంచిచెడ్డల నెరుంగనిదై దేవదేవుని భక్తులనుసైతము హింసింపచేయుటకు సిద్ధమగుచున్నది. భారతీయులారా! ఇట్టి దేవుని సంబంధమగు క్రీస్తుగారిమతము మనకెందులకో! మీరే యోచింపుడు. తన కంఠమును తాను కత్తిరించుకొనవచ్చునా? ఇయ్యది గుర్తించి భారతీయులు మేల్కొనవలసియున్నది. మన కెంతమాత్రము ఆ మతము క్షేమకరము కాదు.

[1] విదేశరాజ్యమును కాగుకాదనుచు - స్వరాజ్యమును నెలకొల్పుకొని యుంటిమి.

(2) విదేశవస్తువులు కూడదని - స్వదేశవస్తువులను నిర్మించుచుంటిమి.

(3) ఇక విదేశమతము మాత్రము మనకెందులకు! స్వదేశమతముననే నిల్చియుండుము? అది న్యాయమగు విధానము. కావున బాగుగ నాలోచించుకొని ఆ విదేశమతమును విసర్జింపుడు.

సత్యవిషయమునంతయు గప్పిపుచ్చి "ఏదినిజము" అను గ్రంథమున నీ క్రిందివిధముగ వ్రాసియున్నను మాడుడు.

"మొదటి ఆజ్ఞ ఏదనగా -

( ఏ. ని. 37 పేజీ చూడుడు.)

దీని వ్యాఖ్యానమును సైతము ఈ క్రిందివిధముగ నా గ్రంథముననే వ్రాయబడియుండెను.

" పది ఆజ్ఞలలోగాని + + + వేరుకాదు. "

పైవిషయముల బాగుగ నర్థముచేసికొనుడు. విగ్రహారాధకులను జంపుడు అని విదేశ దేవుడు తెల్పియున్నట్టి వాక్యములు బైబులునందు లేవట. ఉన్నయెడల వానిని దాచిపెట్టవలెను కాబోలు. పై బోధలయందు అంతరార్థములున్నవేమో! వానింజూపి యొప్పింపరాదా ? అదియు సాధ్యముకానియెడల మౌనముగనుండిన మేలు. విగ్రహారాధకులను జంపుడు. అను వాక్యములు. బైబులులో లేవనికదా ! వారి వాదము.

" పది ఆజ్ఞలలోగాని, ...... మీదుమిక్కిలి......చేయకూడదని వ్రాయబడియున్నది. " ( 37 పేజీ పదినిజము )

" నీతల్లికుమారుడు " అను వాక్యమును చదివియుంటిమి. అందు విగ్రహారాధకులను జంపుడనియు వ్రాయబడియుండెనే ! పది ఆజ్ఞలలోగాని ధర్మశాస్త్రములలోగాని, దేవుని వాక్యములలోగాని " చంపుడు " అనుమాట లేదని పల్కిరి.

బైబులును చదివియు చదవనిరీతిగ వ్యవహరించిన మహనీయుడు ఆతడొక్కడేయని వ్రేలెత్తి జూపవలసివచ్చును.

ఎచటనో యొకతావున కూర్చొని యేదోయొకవిధంబుగ దేవుడుండెనని విశ్వసించుచును విగ్రహములనెదుటనుంచుకొని జీవించుచున్నవారలు లోకమునకేమియుపకారముల గావించియుండిరో తెలుపగలరా !

అట్టి యోగ్యులనుసైతము కత్తులచేపొడిచి చంపుడుఅనియాజ్ఞాపించుచున్న దేవునిచిత్తప్రకారము చరింపవలెనుకాబోలు! విదేశమునదియొక్కటే ముక్తిమార్గమైయుండును.

ఆ యెహోవాగారి శిష్యులు నేడు క్రైస్తవులుఅనునామమును బెట్టుకొనియుండిరి. దీనినిమనకు రాదని ప్రార్థన. అట్టిభక్తులు విగ్రహా

రాధనము గావించువారి విషయమై యెటులవర్తింపవలెనో యీ క్రిందివిధముగ హెచ్చరించియున్నాడు ఆ విదేశీయదేవుడు.

-:యెహోవా ఆజ్ఞలు:-

(ద్వితీయోపదేశకాండ. 8 వ అధ్యాయం 3 నుండి 6 వచనములు)

(విగ్రహారాధకులతో) "నీవు వారితో" (అనగా విగ్రహారాధకులతో) వియ్యమందకూడదు

నీ కుమారునకు వానికుమార్తెను పుచ్చుకొనకూడదు.

నన్ను అనుసరింపకుండ ఇతర దేవతలను పూజించునట్లు నీ కుమారుని వారు మళ్ళింతురు. అందునుబట్టి యెహోవా కోపాగ్ని నీమీద రగులుకొని ఆయన నిన్ను త్వరగా నశింపజేయును. కావున మీరు వారికి చేయవలసినదిగా వారి

బలిపీఠములను పడద్రోసివారి విగ్రహములను పగలగొట్టి

వారి దేవతా స్తంభములను నరికివేసి

వారి ప్రతిమలను కాల్చవలెను.

(ద్వితీయోపదేశ కాండ 8అ 24 టు 25 వచనములు)

నీవు ఆకాశము క్రిందనుండు వారినామములను నశింపజేయవలెను.నీవు వారిని నశింపజేయువరకు ఏ మనుష్యుడు నీ యెదుట నిలవలేకపోవును. వారిదేవతల ప్రతిమలను మీరు అగ్నిచేత కాల్చివేయవలెను.

(3) (ద్వితీయోపదేశకాండ 11అధ్యా 23 టు 28 వచనములు)

అప్పుడు యెహోవా మీ యెదుటనుండి ఈ సమస్తజనులను వెళ్ళగొట్టును. మీరు మీకంటె బలిష్టులైన గొప్ప జనముల దేశములను స్వాధీనపరుచుకొందురు. మీరు అడుగుపెట్టు ప్రతి స్థలం మీది అగును అరణ్యము మొదలుకొని లెబనోను వరకును ఫరాతు నది మొదలుకొని పడమటి సముద్రము వరకును మీ సరిహద్దు వ్యాపించును. ఏ మనుష్యుడు మీ యెదుట నిలువడు. తాను మీతో చెప్పినట్లు మీ దేవుడయిన యెహోవా మీరు అడుగుపెట్టు దేశము మీద మీ బెదురు మీ భయము పుట్టించును. చూడుడి నేడు నేను

మీ యెదుట దీవెనను శాపమును పెట్టుచున్నాను ... యెహోవా ఆజ్ఞలను మీరు వినినయెడల దీవెనయు ... వినక నేడు నేను మీకు ఆజ్ఞాపించు మార్గమును విడిచి మీ రెరుగని యితర దేవతలను అనుసరించిన యెడల శాపమును కలుగును. అని హెచ్చరించియున్నాడు.

మిత్రులారా! జాగ్రతగా వినుడు.

ఎవరు విగ్రహారాధకులను సంహరింపక విడుతురో వారు ఆ దేవునిచే శపింపబడి నరకమున కరిగెదరు అని యర్థమగుచుండెను. క్రీస్తుగారు ఈ లోకమునకు రానంతవరకే అట్టుల జేయవలయునని యేసు ఈలోకమునకు వచ్చిపోయిన పిదప ఆ యాజ్ఞలన్నియు చెల్లుబడి కావనియు కొత్త రకమగు ధోరణిని వెలిబుచ్చుచుందురు. అయితే క్రీస్తుగారేమనిరి. దేవుని యాజ్ఞలను ఆచరింపబనిలేదు. నా యాజ్ఞనే అనుసరింపుడు అని తెల్పిరా లేదు. మీ కుమిక్కిలి దేవుని చిత్తప్రకారము నడుచువారికే ముక్తి లభించుననిరి. కావున విగ్రహారాధకులను చంపుటయే కర్తవ్యమగును.

(ద్వితీయోపదేశకాండ- 12 అ. 2 నుండి 6 వచనములు)

మీరుస్వాధీనపరుచుకొనబోవు జనములు గొప్పపర్వతములమీద నేమి, మెట్టలమీద నేమి, పచ్చని చెట్లన్నిటికిక్రింద నేమి, యెక్కడెక్కడన్నాతే తమ దేవతలను పూజింతురో, ఆ స్థలము లన్నింటిని మీరు బొత్తిగా పాడుచేయవలెను. వారి బలిపీఠములను పడగొట్టి, వారి విగ్రహములను పగులగొట్టి వారి దేవతా స్తంభములను అగ్నిలో కాల్చి వారి దేవతల ప్రతిమలను కూలగొట్టి, వాటిపేరులు ఆచ్చట లేకుండ నశింపచేయవలెను. యెహోవా దేవుడు ... తన నామమును స్థాపించుకొనుటకు, నివాసస్థానముగా ఏర్పరచుకొను స్థలములను వెదకి అక్కడికే యాత్రలు చేయుచుండవలెను." అని వారి దేవుడు ఆజ్ఞాపించి యున్నాడు.

చూడజూడ విదేశీయులు తమ దేశమును విడిచి అన్య దేశముల నాక్రమించుకొనుచు అక్కడి ప్రజలయందున్న ఆచారములను మర్యాదలను నశింపచేయవలెనని వ్యక్తమగుచున్నది. కనుకనే తాము వెళ్ళిన స్థలములందంతటను ఆ దేశపు ప్రజలమతమును నశింపచేయు

చున్నారు. అది అంటువ్యాధివలె సంక్రమించినదై ఆయా దేశీయుల మూలమునను పైరీతిగ కార్యక్రమములను సాగింపచేయుచున్నది. ఇదంతయు భరింపరాని విషయము. మానవమాత్రుల కసహ్యకర వృత్తాంతము. మరియు నీచాతినీచ కృత్యము. ఘోరమృగములంబోలిన చర్యలు యిందు గోచరించుచున్నవి.

(ద్వితీయోపదేశకాండ. 28 అ. 58 నుండి 62వచ.)

నీవు జాగ్రత్తపడి- ఆ మహిమగల భీకరమైన (దేవుని) నామమునకు భయపడనియెడల యెహోవా నీకును నీ సంతతికిని ఆశ్చర్యమైన తెగుళ్ళను కలుగజేయును. అవి- దీర్ఘరోగములై యుండును. క్షయవ్యాధులన్నిటిని ఆయన నీమీదికి తెప్పించును. అవి నిన్ను వెంటాడును. ప్రతి తెగులును ఆయన నీకు కలుగజేయును.' అని వ్రాయబడియుండెను.

పాఠకమహాశయులారా! విగ్రహారాధకులను చంపనియెడల- పైన నుదహరింపబడిన రోగములనన్నిటిని ఆ విదేశీయదేవుడు సంక్రమింపజేయునట. ఇదేమిచిత్రము. ఆతడు దేవుడా! మరియొకవ్యక్తియా! యేమియు దోచకున్నది.

(ద్వితీయోప- 29 అ. 26 నుండి)

తామెరుగని అన్యదేవతలను ఆయనవారికి నియమింపని దేవతలను పూజించి వాటికి నమస్కరించిరి. కనుక- శాపములన్నిటిని యీ దేశముమీదికి తెప్పించుటకు దానిమీద యెహోవా కోపము రవులుకొనెను.

దేవుని యాజ్ఞలను మన్నింపనట్టి వ్యక్తులను ఆ దేవుడు బాధించి యుండెననియు, పై వాక్యములవలన తెలియగల్గితిమి.



శ్రీ మహాగణాధి పతయేనమః

# హిందుమతము

అసంఖ్యాకులగు దేవతలు దేవలోకములందు గలరు. వారందరకు నధిపతియైన దేవదేవుం డొకడు — ఇంతింతయని వర్ణింపనలవి కానంతగ సర్వాత్మకుడగుచు రాణించుచుండెను. కావున పరమాత్మ యొక్కడే యనుచు విజ్ఞులు నిశ్చయించిరి. ఈవాదము కోటానుకోట్ల వత్సరముల క్రిందట భారతదేశమున నత్యున్నత స్థితిని పొంది ప్రతిష్ఠింపబడెను. అట్టి వాదము నెదిరించుచు విజయముగ పొందినవ్యక్తి యొక్కడును ఈ లోకమున కానరాకుండెను.

అయితే దేవు డొక్కడే చాలడా! దేవతలు అనువారు వేరొకరుండవలసిన యగత్యమేమి కల్గెను? అను ప్రశ్నయు మనల బాధించుచుండెను. ఇక్కాలమున నారీతిగ ప్రశ్నించువారు అక్కడక్కడ ప్రత్యక్షమగుచుండిరి. అట్టివారు దేవునివిషయమై — ఆత డొక్కడే కలడని సమ్మతించియు నతని క్రింద "దేవదూతలు" అనువారెందరో యుందు రనుచుందురు. ఆ స్థితియందు మాత్రము దేవు డొక్కడే చాలడా? అతడు సర్వ సమర్థుడగుచు — పనుల నన్నిటిని స్వయముగ జేయలేనివా డెట్లయ్యెను? అని ప్రశ్నింతుమేని — అందుకు ప్రత్యుత్తర మేమి తెల్పెదరు? "అతని యిష్ట మారీతిగ నుండెను. కావున నరులకును — తనకును — మధ్యవర్తులై యుండుటకుగాను — దేవదూతలను సృష్టించెనని బల్కుదురు." అహో! అటులనే — తనకును — మానవ జాతికిని మధ్యవర్తులై యుండుటకు గాను దేవతలను సృష్టించి యుండెనని యేల నిశ్చయింపరాదు? అని యెదురుపడి సమాధాన మొసంగగల ధీరవరు లుందురేని — అట్టి మహాసీయులు విజయము పొందగలరు.

సృష్టి యేర్పడిననాటి నుండి పై రీతిగా వాదించువారి నందరిని కూర్చుండబెట్టిన దిట్టలు మన భారతీయులయి యుండిరి.

యింతయేల! విదేశీయులు జన్మించుటకు పూర్వమే యీ లోకమున నాదిమానవులుగ నుద్భవించినవారు— భారతీయులు గాక వేరొకరులేరు. కావుననే దేవదేవునకు ప్రథమ పుత్రులై యుండిరి. అంతియేకాదు. అట్టి మహనీయులచే గుర్తింపబడిన — అనగా నెన్ను కొనబడిన దేవదేవుని దర్శింపవలెనని యెవరి హృదయములు పొంగి పొరలు చుండవు?

చదువరులారా! మీరు ధన్యాత్ములు. ఎందుకన దైవ దర్శనమునకై తహతహలాడుచున్నారు. అందుకనియే మీహృదయారవిందములలో విహరించుచున్న — ఆ బృందావన విహారిని మీకందరకు పరిచయము చేయుచున్నాను—

"బోలో శ్రీకృష్ణ పరమాత్మకూ జయ్"

దేవదేవుడుగాక — జీవుడనువాడు వేరొకడు కలడు. ఐతే మనమెవ్వరము? ఆ జీవజాతికి చెందినవారమే యగుదుము. అహో! దేవుడనియు, మరియు జీవుడనియు నీ రీతిగా రెండుజాతులు కలవని గుర్తింపగలిగితిమి.

## —: దేవతలు దేవదేవుని ప్రథమసృష్టిలోనివారు :—

దేవదేవుం డొకడు కలడని నిశ్చయించితిమి. అతడనంత శక్తులను కలిగియున్నాడు. ఈ విషయము కూడ సర్వసమ్మతము. దీనినెవ్వరును కాదనజాలరు. తనయందున్న ఒక్కొక్కశక్తిచే నొక్కొక్కపనిని సులభసాధ్యముగ చేయునర్హుడయి యుండెను. నిజమారయ పెక్కుశక్తులం గలిగియున్నట్టి ఆ దివ్యపురుషుడు స్వార్థపరుడయి యుండక — మరియు స్వాభిమానపూరితుడు గాక — తన శక్తుల నెన్ని

టినో అన్వ్యాలకర్పించి — వారివహాలమున జగత్ కార్యముల నన్నిటిని చేయించుననుట - యెంతటి యుక్తియుక్తముగ వెలయుచున్నట్టి మాట! అందుకనియే కోటానుకోట్ల దేవతల నెందరినో సృజించి వారిలో తనయందున్న శక్తుల (Powers) లో కొన్నిటిని ప్రవేశింపచేసెను. తన్మూలమున ననంతకోటి బ్రహ్మాండములను సృజింపగల తెలివి యా దేవతాబృందమున కేర్పడెను.

ప్రతిబ్రహ్మాండమునకు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు అను త్రిమూర్తులును - ముప్పదిమూడుకోట్ల సంఖ్యగల యింద్ర, చంద్రాది వివిధ దేవతా బృందములును, మూడుకోట్లనుండి ఋషిపుంగవులును - చతుర్దశ (పదునాల్గుగు) మనువులును నాయకులై యుండిరి. పై సంఖ్యలు శాస్త్రసమ్మతములు.

## —: దేవదూత లనువారు దేవతల సృష్టిలోని వారు :—

తాము దేవదేవునిచే సృష్టింపబడిన కారణమున తమ తండ్రి యొక్క పనియందు తాము నిమగ్నులమై యుండ వలసిన ధర్మము తమ కున్నదని యెరిగి- ఆదేవతలు సృష్టి గావించుటకు సిద్ధ పడిన వారైరి. నిజమారయ అట్టి కార్యమే- దేవదేవునికి ప్రీతికరము. కను కనే దేవతలు పూర్వాచారమును గుర్తించి- ప్రత్యేక దృష్టితో తమ క్రింద వ్యవహరించుటకు అనగా దూతలుగా నుండుటకుగాను-కొందరిని సృష్టించియుండిరి. ఆ రీతిగ సృష్టింప బడినవారే 'దేవదూతలు' అను నామమును పొంది భువర్లోకమున పై భాగమందు కొందరును- క్రింద భాగమున మరికొందరును నివాసముల నేర్పరచు కొనుచు - కాల యాపనము గావించుచుండిరి. అట్టివారలకు "దేవయోనులు" అను పేరుద మేర్పడి యుండెను. అందుకు ప్రమాణమును వినుడు-

శ్లో॥ విద్యాధరో
ప్సరో
యక్షో
రక్షో
గంధర్వ
కిన్నరాః
పిశాచో
గుహ్యక
సిద్ధో
భూతో౽మీ
దేవయోనయః" (అమరం)

పై శ్లోకములోని చివరి పదమును వింటిరా!

"దేవయోనయః" అనునది ఆపదము.

దేవ=దేవతలు

యోనయః=కారణముగా గల్గిన వారలెవరో వారు దేవయోనులు అని పిలువబడుచుండిరి. యోనిశబ్దమున కర్థము కారణము. దేవతల కారణమున జన్మించిరని యర్థము. దేవతలు వారినందరిని సృష్టించినవారలైనందున విద్యాధరులను - అప్సరసలను - యక్షులను - రాక్షసులను - గంధర్వులను కిన్నరులను - పిశాచములను - గుహ్యకులను - సిద్ధులను - భూతగణములను తమకు సహాయకారులుగ చేసుకొనియుండిరి. ఏదైన నొక కార్యము సాధింపవలసి వచ్చిన యావశ్యకత కల్గునేని - పైవారిలో నెవరో యొకరిని ఆపనికై నియోగించి వెంటనే పంపివేయుదురు. కావున వారందరు దేవదూతలనబడిరి. తపము గావించువారిని పరీక్షించుటకుగాను - అప్సరసలను బంపుచుందురని వినమా! అటులనే రాక్షసులను - గంధర్వులను - పిశాచములను - భూతగణములను మున్నగు వారిని - దూతకృత్యమును గావించుటకుగాను ఆజ్ఞాపించుచుందురు.

పాఠకులారా! దేవలోకమునకును భూలోకమునకును నడుమనున్న భువర్లోకమందు ఆ దూతలు వసించుచుందురని మనువచనము:

దేవతలకున్న మహిమలకంటె నెన్నియో మఱుంగున్నట్టి నవియై వెలయు మహిమలు సహజసిద్ధములైనవి యెన్నియో ఆ దూత

లయందు నెలకొనియున్నవను విషయము చదువరులు మరచిపోరాదు. భూతగణములలోని దూతలు— భూలోకవాసులను తమ వశమునందుం చుకొనుటకుగాను విశ్వప్రయత్నములు గావించుచుందురు. అందుకై చిత్రవిచిత్రములగు వలలను పన్నుచు - మనుష్యులు అను చేపలను ఆ వలలందు చిక్కించుకొన నెంతురు, అందలి మెరలను గాంచి మోహముంజెందిన వ్యక్తులందరు దేవదేవుని సన్నిధానమునకుం జేర గలుగుదురా! అయ్యది కల్ల.

ఈ క్రింది విషయము భూలోక— భువర్లోక— సువర్లోకములకు సంబంధించియున్నది—

| | |
|---|---|
| దేవతలు వశించునది దేవ లోకము. అనగా సువర్లోకము. దీనినే స్వర్గమనెదరు. | ఇందు దేవత లుందురు. |
| దేవ దూతల లోకము భువర్లోక మనబడును. | ఇందు దేవయోని విశేషము లుండును. అనగా దేవదూతలు వసింతురు. |
| మానవుల లోకము భూలోకమై యున్నది. | ఇందు పశు, పక్షి, వృక్షాదులును, మానవులును వసింతురు. |

మరియొక దివ్యమగు రహస్యమును ఆకర్ణింపుడు. మనకంటె నొకింత క్రింద భాగమున నున్న మానవులు — తమకు పైనున్న దేవతలయొక్క సమీపమునకుం బోవగూడని యెంచి ఈర్ష్యాసూయ లకు నిలయమై యున్న ఆ దేవదూతల సంఘములోనివారు తమ యందున్న శక్తుల నన్నిటిని ప్రజలపై వినియోగించుచుందురు, మరియు తమ జీవితాంతమువరకు ఉదయోన్ముఖ ప్రవృత్తులుగ భావించి ఆరీతిగ వ్యవహరించుటయందు మిక్కిలి చాకచక్యమును ప్రదర్శించు నట్టి తెలివితేటలను కల్గివర్తించుచుందురు.

ఈర్ష్యాసూయలు — రోషము — మున్నగునవి నెలకొని యున్న జాతికి పై కృత్య మంతయు సహజమే కదా!

దేవలోకములను దర్శించిన వారలుండిరా! యని కొందరు ప్రశ్నించుచుందురు.

—: దేవలోకము లెవ్వి యన వినుము :—

"నక్షత్రాణి వై దేవ గృహాణి" (కృష్ణయజుర్వేదం)

నక్షత్రాణి = నక్షత్ర మండలము లన్నియు, దేవగృహాణి = దేవతలు వసించుచున్న తావులై యుండెను. అనగా దేవతల గృహములు తారా మండలములం దుండునని భావము. వానినే పరలోకములు అని పేర్కొనుచుందుము.

చదువరులారా! వినుడు... దేవలోకము లున్నవా? ఉన్నచో — వానిం జూపగలవారుండిరా? యనుచు నెవరైనను ప్రశ్నింపవచ్చును. ఆస్థితియందు ఏమని ప్రత్యుత్తర మొసంగెదరు? — వెంటనే వేద ప్రమాణములను జూపుచు — నక్షత్రముల గుంపుల వైపుకు మీదృష్టిని మరలించి — ఇవియే దేవలోకములు అనుచు నొక్కి వక్కాణించుచుండుడు. మీ కొసంగబడిన ఉపదేశము ఇదియే సుమా!

—: దేవుడొక్కడే కలడు :—

దేవలోకములకును — భూలోకమునకును అధినాథుడైన దేవదేవుం డొక్కడే కలడని — ఎన్నడో 195 కోట్ల వత్సరముల క్రిందట భారతీయులు విశదీకరించి యుండిరి. పాపము! లోకజ్ఞానము ఒకింతయైనను లేనివారున్నయెడల — "కోటానుకోట్లు వత్సరముల క్రిందట మానవు లుండిరిగదా — ఆనాడు పై రీతిగ బోధించువారుందురు!" అని భాషించుచుందురు. మరియు ఆరువేలేండ్ల క్రిందటనే నరజాతి యేర్పడెను. అంతకు పూర్వమునుండియే భారతీయులు దేవుని విషయమై యెటుల ప్రవచించియుందురు?" అనుచు తమకు తోచినటులెల్ల జ్ఞానములేనివారై వాగుచుందురు.

ఇక్కాలమున నెందరో బుద్ధిమంతులు భూగర్భశాస్త్రమున (జియాలజియందు) ఉత్తీర్ణులగుచు- లక్షలకొలది వత్సరముల క్రిందట మానవు లీ భూమియందు నివసించి యుండిరని వెల్లడించిరి. అచ్చటచ్చట భూమి త్రవ్వబడినపుడు అందు లభించిన మానవుల కళేబరములలోని అస్థిపంజరములను మరియు వారిచే నుపయోగింపబడిన వస్తుసామగ్రిని పరీక్షించి - లక్షలయేండ్లకు పూర్వమే వీని యునికి యుండెనని ఋజువు చేయగలిగిరి.

ఈ విషయమై విపులముగ తెలియదలచినవా రున్నయెడల ఒకమారు —

| | | |
|---|---|---|
| 100 పేజీలు కల | హిందూమతము (దైవమతము) | వెల ఒక రూప్యము |

అను మా గ్రంథమాలలోని ప్రథమ భాగమును గాంచినం జాలు. ఇంకను దశావతారముల కాలములు సైతము ఆ గ్రంథమున గుర్తింపగలరు. అంతటితో సంశయము లన్నియు మటుమాయమగును. ఇంతకును పూర్వజన్మ సుకృతముండవలెను. అదిలేనిది ఆ గ్రంథము చదువవలెనను వాంఛ కలుగనేరదు. దురదృష్టవంతుల కెంత జెప్పినను వారి హృదయక్షేత్రములు బీటిభూములుగ సిద్ధమైనందున నందు ధర్మబీజములు నిక్షేపించబడజాలవు.

దేవదేవు డొకమారు వారి హృదయములను శుద్ధము జేయుగాక ! ఋషి పుంగవుల యొక్కయు, దేవతా బృందముల యొక్కయు ఆశీస్సులు లభించుగాక !

సారాంశము వినుడు !

ఆరు వేలేండ్లకు పూర్వము లక్షల కొలది వత్సరముల క్రిందట మానవు లీ లోకమున నివసించియుండిరని నిశ్చయించుకొనవలెను. కోటానుకోట్ల వత్సరముల నుండియు మనుజు లీ లోకమునగలరని భాగవతాది గ్రంథముల నుండి ప్రమాణముల నెన్నిటినో గాంచగల్గు



దును. మచ్చునకై ఈ గ్రంథమాలలోని– "దైవమతము" అను గ్రంథమును జూచుకొనిన యెడల ఇంకను మరెన్నియో నూతన విషయములం దెలియగల్గుదురు.

దేవు డొక్కడే కలడని రుజువు చేయుగల ప్రమాణములు లెక్కలేనన్ని హిందువుల వాఙ్మయము నందంతటను ప్రదర్శింపబడినవి. ఆ విషయమై వివరించు వేదమంత్రము నొకదానిని గాంచి యానందింప వచ్చును.

"యో, దేవే, ష్వధి దేవ, ఏక
స్తస్మై, దేవాయ. నమో, అస్తు

దేవేషు = దేవతలెందరో గలరు. వారందరిలో
అధిదేవః ఏకః = అధినాయకుండగు దేవుడు ఒక్కడే యుండెను.
తస్మై దేవాయ = అట్టి దేవాధిదేవునకు
నమో అస్తు = నమస్కరించుచున్నాము.

అనుచు మన పూర్వులు ప్రార్థించియుండిరి. కావున దేవుడొక్కడే యనునదె హిందువుల సిద్ధాంతము. ఆ దేవునకు అనంత నామధేయములున్నవి. అతని సృష్టి అనంతమైనది. అతనిచే సృష్టింపబడిన బ్రహ్మాండములు సైతము అనంతకోట్లు కలవు.

మరియు వేదమున నుపదేశింపబడిన– మరియొక మంత్రమును గాంచుడు. "అనంతా వై వేదాః" (వేదం)

వేదాః = వేదములు కూడా
అనంతాః = అనంత సంఖ్యకలవై రాణించుచున్నవి. మరియొక చిత్రమును గనుడు. అతని నామము అనంతుడనియు, అనంత పద్మనాభ స్వామియనియు పేర్కొనబడును.

అతడు "అనంతుడై"యుండెను. కనుకనే అతని నామధేయము "అనంతుం" డనుచు ప్రసిద్ధి బడసెను. అతని వేదములు "అనంతములు"



అతినిస్పృష్టియుంతయు "అనంత కోటి బ్రహ్మాండ రూపము". [illegible] దొక్కటి "అనంత పద్మనాభ స్వామి వ్రతము" అని [illegible] రింపబడుచుండెను.

## —: దేవునకు అనంతనామములు కలవు :—

అనంతనామములలోని ముఖ్యమైనవానిని వినుడు.

స, బ్రహ్మ, స, శివ, స్స, హరి, స్సేంద్ర, స్సో [illegible] స్వరాట్ " (మంత్రపుష్పం)

- సః = దేవుడొక్కడయి యున్నను - ఆతడు
  బ్రహ్మ = బ్రహ్మయనియు,
  సశివః = శివుడనియు,
  సహరిః = మహావిష్ణువనియు,
  అక్షరః = అక్షరుండనియు,
  పరమః = పరమాత్మయనియు,
  స్వరాట్ = స్వరాట్ అనియు,

  నీ రీతిగా వివిధ నామములచే కీర్తింపబడుచుండును.

॥ ఇంద్రం, మిత్రం, వరుణ, మగ్ని, మాహు, [illegible] స్స, సుపర్ణో, గరుత్మాన్

॥ఏకం, సద్విప్రా, బహుధా, వదంత్యగ్నిం, [illegible] శ్వాన. మాహుః॥ (ఋగ్వేదం)

సత్ = ఎల్లకాలములందు దేవుడనువా డున్న [illegible]

ఏకం = విచారింప నాత డొక్కడే కలడు.

విప్రాః = వేద సారము నెరింగిన వారు,

బహుధా = బహు విధముల నా దేవుని

వదంతి= కీర్తించుచుందురు. అది యెట్లన—
మిత్రం= మిత్రి దేవుడనియు,
వరుణం= వరుణ దేవు డనియు,
అగ్నిం= యజ్ఞేశ్వరుండనియు,

నీ రీతిగ ననేకయో నామములచే దేవుడు పిలువబడుచుండెను. వివిధ నామములతోడను - రూపములతోడను విలసిల్లుచున్న దేవ దేవుం డొక్కడే కలడని హిందుమత సాంప్రదాయముల నెరింగిన వారు తీర్మానించియుండిరి.

"హిందువులు మందమతులు" అని విదేశీయులు నిశ్చయించి ఆ హిందువులను నిందించుటలో అగ్రగణ్యులై యుండిరి. అందుకనియే ఈ మతమును నశింపజేయువలెనని కంకణము కట్టిరి. ఆ రీతిగ తమ పనిని ఏనాడు పూర్తిగావించి కృతకృత్యు లగుదురో, ఆనాడు జన్మ సాఫల్య మగునని నిర్ణయించుకొనిరి. వీని కన్నిటికి ఋజువు లున్నవా? యని సంశయింపవలదు. ముున్ముందు నవి యన్నియు నివారింప బడును.

(1) "హిందుమతము" అను గ్రంథ మొకటి "ఫాకుస్" అను నామ ధేయముగల క్రైస్తవ పండితునిచే వ్రాయబడినది. ఆ గ్రంథము నుండియు - మరియు —

(2) "ముక్తి మార్గము" అను క్రైస్తవ ప్రచురణము నుండియు—

(3) "నా కాడి ఎత్తుకొనుడు" అను పొత్తము నుండియు—

(4) "ఏ-మానిఫెస్టో-ఆఫ్-ది రోమన్ కాథలిక్స్ ఇన్ ఇండియా" అను అఖిల భారత క్రైస్తవ తీర్మానము నుండియు—

(5) ఇంకను మరెన్నియో క్రైస్తవ గ్రంథములనుండియు— అంతేగాక పెక్కు కరపత్రములనుండియు—

ప్రమాణములం జూపుచు, పాఠకులకు త్వరలో అందజేయబడును. వానికై వేచియుండెదరుగాక !

నిజమారయ - ఇదంతయు ననవసరము. తమ మతమును గురించి తాము చెప్పుకొనినయెడల నెవ్వరును కాదనజాలరు. హిందు మత విషయమై జోక్యమును కలుగజేసుకొనుటమాత్రము అసహ్యాకర విషయము. తమ మతములోనున్న విషయములనే చెప్పుకొనరాదా? భారతీయుల హృదయములలో - హిందుమత ద్వేషమును రగుల్కొల్పుటకు హేతువేద్ది! హిందువులు శాంతమూర్తు లయినందున నెంతయో కాలమునుండి లోలోన కృశించుచు, పెదవులను కదల్పజాలకున్నారు. ఎవరో కొందరు క్రైస్తవులు హిందుమతమును దూషించుచు కొన్ని గ్రంథములను వ్రాసిన మాత్రమున- ఆ మతస్థుల నందరిని హిందుమతద్వేషులక్రింద పరిగణింపవచ్చునా? యని మన మిత్రు లడిగెదరు. ప్రత్యుత్తరము వినుడు. క్రైస్తవమత ప్రచారమునకై ఏర్పడిన ట్రైనింగ్ స్కూళ్ళలో ఫాకుహారి హిందుమత గ్రంథమును, మరియు దానికి దోడుగ హిందుమతమును దూషించుచున్న తదితరగ్రంథములను పఠింపజేయుచున్నారు. కావున క్రైస్తవ మత ప్రచారకులు అందలి విషయములను హిందువులయెదుట బోధించుచుందురు. మరియు నా గ్రంథములలోని విషపూరితములగు భావముల నన్నిటిని భారతీయుల హృదయములలోనికి ప్రవేశపెట్టగలరు. అందువలననే-హిందువులు వారి మతము నజేరనుద్యమించుచున్నారు. కోటికొక్కరుబుద్ధిమంతులు మన హిందువులలో లేరనినాడు. దుర్బుద్ధులకు గురియైయున్న అధిక సంఖ్యాకులయెదుట అల్పసంఖ్యాకులగు బుద్ధిమంతులు కొందరున్నను. లేకున్నను ఒక్కటే.

క్రీస్తుమత ప్రచారకులు షుమారు 5000 మంది మన దేశమంతటను ఆవరించియున్నారు. దీనింబట్టి యెంతటి దుష్ప్రచారమును సాగించుటకు యత్నములు జరుగుచున్నవో తెలివిగలవారికి తెలియక పోదు. విదేశీయుల కెంతయో లాభములేనిది కోటానుకోట్లద్రవ్య

గొప్ప యుద్యమమును సాగింపగలరేమి ? ఈ మాత్రమైనను మనవారు గ్రహించినంజాలు.

ప్రతిసంవత్సరమున-పదికోట్లరూప్యములు విదేశములనుండి ఈ దేశమునకు దిగుమతి యగుచున్నవి. ఆ ధనముచే గ్రామముల యందుసైతము పెద్దపెద్ద చర్చిలను, ఆసుపత్రులను, పాఠశాలలను స్థాపించుచు-

“లోకోపకారమునకై వాని నుపయోగించుచుంటి” మని పైకి చెప్పుచున్నారు. తెలివిలేని హిందువులు, అది నిజంబని విశ్వసించి మోసపోవుచుండిరి. కనుకనే నోరులేనివారెందరో వారి మతమున చేరుటకు హేతు వగుచున్నది. హిందుమతమున నెన్నియో లోపములు కలవని క్రైస్తవులు బహిరంగ సమావేశములలో నుపన్యసించుచుండిరి. రైళ్ళలోను, బస్సులలోను, బజారులందును, గృహములలోపలను జేరి బోధించుచుండ -

కన్నులను విప్పి- నోరు తెరచుకొని- ఏమియు తోచని వారలగుచు - చెవులు నిక్కర పొడుచుకుని వినవలసిన గతులు పట్టుచున్నవి. అంతియేగాని ఇంతటి దుష్ప్రచారమును చేయవచ్చునా? అని విచారించు వార లొక్కరును లేరైరి. మన భరతమాత అట్టి దౌర్భాగ్యులను గాంచి యెంతగ విలపించుచున్నదో పరమాత్మకే యెరుక.

దీని కంతటికిని హేతువు-తమ మతము నందున్న గొప్పదనమును ఎరుంగని లోపము తప్ప వేరొకటి లేదు. దైవభక్తి యనునది హిందువులలో లేదని తెలుపజాలము. కాని అచంచలంబగు భక్తి విశ్వాసములు లేవు. ఆ భక్తియందు దృఢత్వమసలే పూజ్యము. స్వార్థపరత్వముతో కూడిన భక్తియే కాని- విశాల హృదయమును కల్గియున్న అనన్యభక్తి కాదు. అట్టి భక్తి లేనపుడు అనగా దొంగ భక్తి యుండినను లేకున్నను ఒక్కటే. దేవుని వాక్యములయందు ఏమి ప్రమాణము లేనివారగుచు - అనగా అత డాజ్ఞాపించిన ధర్మ

ముల నాచరింపని వారలగుచు — "రాం రాం సీతారాం" అని కేకలు వేసినంత మాత్రమున నయ్యది భక్తి యనిపించుకొనదు.

కావున నిజముగ భక్తి గలవారు తమవలె నితరు లందరు భక్తులగుటకుగాను ఇంటింట తిరిగి వేలకొలది ధనమును జేర్చుచు మత ప్రచారకుల నేర్పరచవలసియుండును. ఆ పనిని చేయనంత వరకు ఆస్తికులును, భక్తులును, లోకజ్ఞాన సంపన్నులును— మన దేశమున లేరనియే నిర్ణయింపబడును. ధనికు లెందరు లేరు! ఉండియు నిరుపయోగ మగుచున్నది. మతప్రచారమునకై వినియోగింప బడని ధనము ఇంధనము (కట్టెపుల్ల) గాక — హృదయ శోధనము జేయునది యగునా. చదివినవా రెందరు లేరు! చదువు పొట్టకూటికి మాత్రమే యుపకరించినయెడల పశువులకును నరులకును భేదము కలుగ నేరదు. ఆ విద్య దేశము నుద్ధరించుటకు వినియోగపడవలె గదా! సంస్కృత పండితులును, తెలుగు పండితులును ఉండిరి. ఉద్యోగముల విడనాడి మతప్రచారమును గావించుటకుగాను ఏల సిద్ధపడకుండిరి? వారిలో గొందరికి అటువంటి భావము లుండినను — పాపము! పోషించువారు లేరైరి. కనుక ధనమును విశేషముగ మతప్రచారకుల కొరకే వినియోగింపవలెను. అట్టివారలు మాత్రమే దేశాభిమాను లగుదురు. ప్రతి పౌరుడు ఈ దేశానికి ప్రభువైయున్నాడు. కనుకనే స్వరాజ్యము అను శబ్దము సార్థకం బగును. ఈ రీతిగ కోటాను కోట్ల ప్రభువులు మనదేశమును పాలించుచుండిరి. ఆంధ్ర దేశమున షుమారు మూడుకోట్లమంది ప్రభువులుండిరి. అందు హిందువులైన వారు రెండు కోట్లకు మించియున్నారు. వారిలో నొక కోటిమంది నాస్తికులున్నను దైవమును విశ్వసించువారు కోటికి తక్కువ కానివారుండిరి. ఒక తలకు ఒక రూప్యము చొప్పున ధర్మ మిచ్చినను ఆంధ్ర దేశమున కోటి రూప్యములు ప్రచారమునకు పోగు పడగలవు. తుదకు లక్షమంది యైనను బుద్ధికలవా రుండరా. వారి ద్రవ్యమైననుచాలు ఈ మాత్రపు పనిని గావింపగల పుత్రులు ఆంధ్ర మాతృ గర్భము నుండి జన్మించి యుండరా! ఉండియు, లేకుండియు నొక్కటే యగుచున్నది.

ఆంధ్ర యువకులారా! బద్ధకంకణులు కండు. మీతల్లిని మీరు రక్షించుకొనుడు. అందుకై గ్రామ గ్రామమున మతప్రచారము గావించుటకు గాను — ధనమును ప్రోగుచేయుడు. మీ యుడుకురక్తమును పొంగి పొరలుచున్నట్లు భావించుచుంటిరి గదా. లెండు! కార్యరంగమునకు రండు. పురుషత్వము కలవా రెల్లరు ముందంజ వేయుడు. అటుపైన దేవదేవుని యాశీస్సులం బొందుడు.

విదేశరాజ్యము మన దేశమునకు హానికరమని యెరింగి అందుకై పోరాడిన మీ తెలివి ఈనాడు ఎందుదాగినది?

విదేశమతము కూడా మనదేశమునకు హానికరమని యెరుంగరా? ఆ మతస్థులవలన నిపుడే యెన్నియో బాధల ననుభవించుచుంటిమి. ఇకముందు వారి సంఖ్య పెరిగిన కొలది హిందుజాతి యీ దేశమున నిలువజాలక — వారి మతమున జేరవలసిన దుర్గతులు పట్టును. లేదా నీతిగలవారు తమ ప్రాణములను గోల్పోవలసి యుందురు.

భర్తకుం తెలియనీయక భార్యయందును భార్యకుం తెలుపక భర్తయందును విదేశమతము- అంటువ్యాధివలె చెలరేగి విచ్చలవిడిగా నలుదెసల నంటుకొనుచున్నది. ఎంతయో కష్టించి ఆర్జించుకొనిన స్వరాజ్యమును భంగపరచుటకై యత్నించుచున్న విదేశమత ప్రచారమును గాంచియు - చవిచూడని వారివలె మన హిందువులు మనకెందుకని వెనుకకు బోవుచున్నారు. ఈ పాపమంతయు నెపుడో యొకనాడు బ్రద్దలయి మన వంశములవారిని ముట్టడించుచు క్రైస్తవమత మహాగ్నిగుండమున నాహుతులం చేయగలదు. ఆనాటి దేశాభిమానము ఈనాడు మంటగలిసినది. అగుచో-మన వంశపరంపరకు ఆ మంటయే శరణమై యుండగలదు.

కావున భారతీయు లికనయినను మేల్కాంచి ఆ వ్యాధికి తగిన ఔషధమును అన్వేషింపవలెను. శాంతికాములమై వ్యవహరించుట మంచిదే. కాని 'దేహమందొకతావున పాదమందు పుట్టుమచ్చంత

పుండు పుట్టినదయ్యె - నేటికిటు చూచుకొనగా అరచేతి వెడల్పున పెరిగి పెద్దదై బాధించుచుండెను. క్రమముగా పాదమంతయు నాక్రమించి మోకాళ్ళ వరకు రాగలదు. పిదప తొడల పర్యంతము వ్యాపించును. అప్పుడు డాక్టరేమనును? ఆభాగమంతయు తెగగొట్టి పారవేయవలెను, అని హెచ్చరింపడా? అదేగతి మన భారతీయులకు సంభవింపగలదు. దూరదృష్టి లేనివారగుచు- దేశమందన్ని మూలలం చూడక తమకు ధనమున్నదనియు-గొప్పగొప్ప చదువులం జదివిన కారణమున పొట్టపోసుకుని జీవింపగలమనియు _ అట్టి తుచ్ఛబుద్ధిని కలిగియుండుట కంటె_వెంటనే తమ ధనమునుమతిప్రబోధకై త్యజించుట మేలు.తమ విద్య యొక్క- మహిమచే హిందుమతమును ప్రచారము చేయుటకై యుద్యోగమునుండి విరమించుకొనుట శ్రేయస్కరంబు. అట్టివారలు భరతమాతయొక్క- దీవెనలకు పాత్రులయ్యెదరు. వేదమాతయు - దేవమాతయు-తమను కనుపార గనిన మాతయు-వారి వంశాభివృద్ధికై యాశీర్వదింపగలరు.

ఈ మాటలను లెక్కింపక-స్వేచ్ఛగా విహరింతురేని _ వారి బిడ్డలు - ధనవంతులయి యుండజాలరు. మరియు విద్యల నార్జించలేని బండభాయిలై వర్ధిల్లగలరు, అని మన పితృదేవతలు శపింపగలరు. దేవదేవా! ధనికులకును, విద్యావంతులకును, బలవంతులకును, వైవిధంబగు సద్బుద్ధి నొసగుము. హే కృష్ణప్రభో!

" బుద్ధియోగం దదామ్యహం"

అని నరునకుం దెల్పితివి. భారతీయులము నరులమే సుమా. కావున మాకెల్లరకు ఆ బుద్ధిని దయచేయుము.

బుద్ధిప్రచోదకా! హే సూర్యభగవాన్! మా బుద్ధిని మంచి మార్గములలోనికి ప్రసరించునట్లు అనుగ్రహింపుము. ఇవియే మా భారతీయుల తరపున నా వందనసహస్రములు.

రాబోవు పరిణామములను గుర్తింపగల తెలివితేటలను కల్గించు స్వామీ దేవదేవా! నీవు మా హృదయముననే నివసించియుంటివి గదా! మా మొరలాలకింపుము. నీవు తప్ప యీనాడు హిందువుల కెవ్వరును – దిక్కుగలవారు లేరు.

"నీవే తప్ప నితఃపరం బెఱుగ
మన్నింపం దగున్ దీనునిన్"

అని ప్రతి భారతీయుడు నిన్ను ప్రార్థించుగాక.

చదువరులారా! చైనావారు హిందువులపై దాడి వెడలిరని వింటిమి. శాంతికాముకులమై యెవరియింట వారుకూర్చునదగునా. వారు విదేశీయులై యుండిరనియెంచి కసి తీర్చుకొనక నొంటరిగయుంటిమో యింటింటి హాయివద్ద గూర్చొననగునా! యెవరి దోషము వారిదే యని నిశ్చయించి శాంతివాక్యములం బల్కుచు మానముదరిను నహింపవలెను కాబోలు! ప్రభుత్వమేగాక ప్రజలు సైతము సైన్యములను సిద్ధముచేయుచున్నారు. మందుగుండు సామానులను తయారుచేయుచున్నారు. వెంటనే ప్రతి క్రియకై ముందడుగు వేయుచున్నారు.

క్రైస్తవులు మనమతముపై దాడివెడలినమాట సత్యము. హిందుమతమును నశింపజేయవలెనని ప్రతిజ్ఞలం జేయుటయు నిజంబు. అవుగాక.

అందుకై మిమ్ముకోరుచున్న విషయము లెవ్వి! వారివలె దౌర్జన్యమునకు బూనుడని కాదు. మీ ప్రజలు– మీ మతమునువెరుగని కారణమున నన్యమతమున జేరుచుండిరని హెచ్చరించుచు–మీ శక్తులను విజృంభింపజేసికొని మీమతమందున్న గొప్పతనమును ప్రతి భారతీయునకు ప్రబోధింప జేయుడు. అందుకై అనగా మత ప్రచారమునకై ధనరూపముననను – ఉపన్యాస రూపముననను – గ్రంథరూపముననను – కరపత్రముల మూలముననను దేశమం దన్నిమూలలలో వ్యాపింపజేయుచు ప్రతి భారతీయుని హృదయక్షేత్రములపై హిందూమత ధ్వజమును ప్రతిష్ఠింపుడని మరిమరి ప్రార్థించుచున్నాను.

ఇదియే — ప్రీస్తుమతప్రచారకులు నాచరింపదగిన పద్ధతి. ఈ పని యందు అన్యమతద్వేషము లేకుండవలెను. అన్యులను హింసింపజేయు భాగమున్న శూన్యము. ... సంబంధమును అర్ధముచేయగల ... తెలియవలెను.

> గాంధిమహాత్ముడు విదేశీయులంగూర్చి "క్విట్ ఇండియా" అనగా మా దేశమునుండి వెడలిపొమ్మని ప్రబోధించియుండెను. అటులనే ఓ క్రైస్తవమతప్రచారకులా ఆసుపత్రులు — ఇటువంటి బోధించునట్టి యుద్యమమునుండియు స్కూళ్ళనుండియు వెడలిపొమ్ము.

అనియే మనము బోధింపవలెను. ఇందు సేవ మెంతమాత్రము లేదు.

> గాంధిగారి బోధ దుష్టప్రచారకులక్రింద వచ్చునా? లేదు. హిందుమత ప్రచారముకూడా ఉద్రేకముతో సత్ప్రచారము క్రింద — చేర్చబడగలదు?

మనకు స్వరాజ్యమేర్పడి పదునైదు వత్సరములైనది. ఈ యల్పకాలముననే — ఇరువదిమూడులక్షలమంది హిందువులు క్రైస్తవమతమును స్వీకరించియున్నారు. ఈ వార్తను వినిన వెంటనే నీతిగలవారి గుండెలు బ్రద్దలు కాగలవు. మొండిబండలవంటి గుండె లున్నయెడల–నవిమాత్రము నిప్పుకు నీరెత్తిన చందమున శాంతముగ నుండగలవేమో?

స్వరాజ్యపాలనము మరియొక శతాబ్దమువరకు ఇటులనే నిల్చి యున్నదనుకొనుడు. కోట్లకొలది హిందువులు క్రైస్తవులయ్యెదరు. అల్పసంఖ్యాకులగు ప్రజలుమాత్రము హిందువులుగా నుందురు. అల్ప సంఖ్యాకుల రక్షణము అనునది యీ స్వరాజ్యమున నుండదు. క్రైస్తవు లధికసంఖ్యాకులై మనరాజ్యమును హస్తగతముగ జేసికొనినయెడ ఆనాడు అల్ప సంఖ్యాకుల రక్షణము కాదు — భక్షణము జరుగును

మహాత్తర నష్టము రానున్నదని యెరింగినవారు ఇట్టి గ్రంథములను వ్రాయుటయు న్యాయమై యుండును. విదేశమతములవారిచే వ్రాయబడిన గ్రంథములలోని విషపూరిత వాక్యములం గాంచినపుడు వానికిం దగిన ప్రత్యుత్తరములను సున్నిత మార్గముల గుండా- లిఖంచక-ఏల విడనాడగలము ? ఆ రీతిగ వ్రాయబూనుటయు సర్వసమ్మతమై యుండును. క్రైస్తవులపై ద్వేషమును బూని యీ గ్రంథము వ్రాయబడెనని యెవ్వరును భావింపరాదు. వారు మనకు మిత్రులై యున్నారు. ఎట్లన- వారందరును పూర్వము మన హిందువులే. ఎవ్విధమో కొన్ని భోగములనాశించి క్రైస్తవ మతమును స్వీకరించినవారలైరి. కావున వారును మనమును మైత్రిని వహించి వ్యవహరింపవలసియున్నది. ఇంతటినుండి తమ క్రొత్త మతము యొక్క ప్రచారమును విడనాడి- ఆ మతమున నున్నవారు అంతటితో నిల్చి పోవలెను. అనగా హిందువులను క్రొత్తగా తమ మతమున జేర్చుటకై ఆసుపత్రిలలోను- స్కూళ్ళలోను - దుష్ప్రచారమును సాగింపక, శాంతభావముతో మెలంగవలెనని ప్రార్థన. క్రైస్తవులచే నింతకు పూర్వమునుండి వ్రాయబడిన గ్రంథములలో హిందుమతమున నాయా విషయములందు దోషము లున్నవని, యెవ్విధంబుగ లిఖింపబడినవో వానినన్నిటిని జూపుచు అందుకు తగిన జవాబును వ్రాయుట న్యాయమును అవసరమును అయ్యెండెను. హిందువులకు సత్యమును దెలుపవలసిన యావశ్యకతయు విశేషముగ నున్నది. అందుచే హిందుమత గ్రంథమాలా రూపమున నెన్నియో గ్రంథములు వ్రాయబడవలయును. ఆ పుస్తకములలో హిందుమతముయొక్క నిజరూపము సులభశైలిలో నుదహరింపబడవలెను. ఇపుడు వ్రాయబడుచున్న గ్రంథమువంటి గ్రంథములు తెలుగుభాషలో లేని లోపమొకటి గలదు. ఎందుకన విదేశ మత స్వరూపము ఆ గ్రంథములయం దుదహరింపబడలేదు. ఇటుల బలుకుట ఆత్మస్తుతియని కొందరందురు. వారి కా భావములు గల్గుటయు దేశ దౌర్భాగ్య హేతువు. భార్య తన భర్తయొక్క నామమును ఉచ్చరింప గూడదు. అటులనే భర్తయు భార్యయొక్క నామధేయము నుచ్చరింపరాదు. ఇది సామాన్య

ధర్మము. కొన్ని సమయములందు దంపతులు-తమ పతియొక్కయు, సతియొక్కయు నామధేయములంజెప్పుకొనుట ధర్మమైయున్నది. అటులనే గ్రంథకర్తయొక్క-భావమును గుర్తించునెడల-హిందువుల మనస్సులను పైకి లేవదీయుటకై వచింపబడిన సత్యవిషయమై యున్నదని గ్రహింప గోరుచున్నాను. అట్టిదానిని ఆత్మస్తుతిక్రింద పరిగణింపరాదు. ఇట్టి గ్రంథములు అత్యంతి ముఖ్యములు అని తెలుపుట ఎన్నటికిని నేరము కానేరదు-

చదువరులారా! క్రైస్తవులుకూడా యితరులకువలె నాకును పరమమిత్రులయియున్నారు. ఎందుకన వారు తమ మతమునందును, తమ మతప్రవక్తయందును, ఎంతయో భక్తివిశ్వాసములు కలిగిన వ్యక్తులయి యుండిరి. అందుచే వారిని మిక్కిలి ప్రేమించుచుందును. ఆ విషయమై యెవ్వరును సందేహింపరాదు. అయితే- హిందూమతమును నశింపచేయుటకై పన్నిన పన్నాగములు మాత్రము దేశద్రోహకరములై యున్నవి. ఆ విధానమును మార్చుకొనుడని వారికి తెలియపరచుట తప్పనిసరి యగుచున్నది. కోటానుకోట్ల హిందువులు తమ మతమును విడనాడి అన్యమతమున చేరుచున్నప్పుడు చీమునెత్తురు లున్నంతవరకు హిందువుల హృదయములు తపింపవా? కమ్మవారిలోను - రెడ్లలోను - కాపులలోను మిగిలిన జాతులవారిలోను తమ బంధువులు క్రీస్తుమతమున చేరుచుండిరని వినినపుడు - వారి హృదయము లెంతగా పరితపించినవో! ఆవిషయమై ఈ గ్రంథకర్త యెదుట వారు వివరించుచున్నప్పుడు - యితడును ఎనలేని బాధను పొందియున్నాడు. తన భార్య-క్రీస్తుమతమున చేరి తన నెన్ని విధముల బాధించుచున్నదో ఒకానొక భర్త, యొకదినంబున ఈ గ్రంథకర్తతో మొరలిడినాడు. తన భార్యతో నెంతగ చెప్పుచున్నను-ఆ సతీమణి క్రీస్తుమతమున చేరుటకంగీకరింపక హిందుమతమున నిల్చియున్నదని యెంచి ఒకదినంబున దోసిలిం బట్టించి అందు నిప్పుకణికలను పోసియుండెవని హిందువులు దీనవదనులయి దెలిపిరి. ప్రభుత్వ [illegible]

ఆనాడు శ్రీ మహావిష్ణువు హిరణ్యకశిపుని విషయమై వచించలేదా? [illegible]యింతటను పాపము పండవలెను. క్రైస్తవ మిషన్ వారి ఆస్పత్రికి ప్రసవించుటకుగాను ఒక గర్భిణి స్త్రీ వెళ్ళగా అచటి మత బోధకులు ఆమెను బలవంతపెట్టుచు ఏసుక్రీస్తును ప్రార్థింపుమని వత్తిడి చేసిరట. తనకిష్టము లేకున్నను విధిలేక ప్రార్థించియుంటినని తన బంధువులకు చెప్పినది. పల్నాడు తాలూకాలోని కొన్నిగ్రామములందు భారతీయ క్రైస్తవులు వినాయక విగ్రహములను- అంకమ్మ, పోలేరమ్మ విగ్రహములను లేవనెత్తి నాగులేరునందు పడవేసియుండిరని - ఆయా గ్రామములలోనికి ప్రచారమునకేగినపుడు అచ్చటి ప్రజలు ఈ గ్రంథకర్తకుం దెల్పిరి. ఎన్నడో కాదు, యిదేసమయమున అనగా స్వరాజ్యము లభించిన పిదప నూటయిరువది దేవాలయములు కేరళరాష్ట్రమందు క్రైస్తవులచే నేలమట్టము గావింపబడినవి. ఆంధ్రులలో శ్రీ రామచంద్రుని భక్తురాలయిన శబరిని గురించి యెరుగనివారు లేరు. ఆమె యొక్క నామముతో విలసిల్లుచున్న —

"శబరి మల" అను పర్వతం బొకటి కలదు. ఆ కొండపైనున్న గొప్ప దేవాలయముకూడా క్రైస్తవులచే బుగ్గలు చేయుబడినది. వెంటనే కాంగ్రెసు ప్రభుత్వమునకు హిందువులు మొరపెట్టుకొనిరి. కాని ఆ రాష్ట్రమందలి ప్రభుత్వమంతయు క్రైస్తవులహస్తములయందిమిడియున్నందున —

[illegible] హిందువుల దరఖాస్తు బుట్టదా[illegible] గావింపబడెను. కాంగ్రెసు ప్రభుత్వముచే [illegible]బడిన "నియోగి కమిటీ వారు" తమ రిపోర్టులో [illegible] నారు. ఆ [illegible] ప్రమాణము కావలెనని నిశ్చయించి [illegible] "నియోగి [illegible]" అను పెద్ద గ్రంథమును ఆంగ్లభాషలో [illegible] సత్యము గ్రహింపవచ్చును. "[illegible] [illegible]ముచు [illegible]టకుగాను క్రైస్తవరాజ్యముగ నెలకొల్ప[illegible] "[illegible]! మీమ్ములనంద[illegible] ఉపదేశించ[illegible] బోధించుట [illegible] ప్రతిపత్తులు [illegible] [illegible] ఆ [illegible] వ్రాయుచున్నది.

యిట్టి దౌష్ట్యము నెంతయో చేసియుండిరని యెరింగినవారు అందలి సత్యమును వెలిబుచ్చకుండుట పాపహేతువు కాదా? యివి యన్నియు గుర్తునకుం దెచ్చియుంటిమేని ఆ విషయమును యెరుంగని క్రైస్తవులు - తమ మతముచే నితర మతమునకు సంభవించిన బాధలను గణింపగలరు. వారిలో వివేకులయినవారు యికమీదనయినను తమ మత ప్రచారమును చేయుటను నిల్పివేయగలరు, అని విశ్వసించుచున్నాను. అసలు హిందు దేశమునకు విదేశ మతములవారి నీతు లవసరములేదు.

ఎందుకన - మతము లన్నిటిలో మహోన్నత స్థితిని వహించి యున్న మతము హిందుమతము. అట్టి మతమున నున్నవారలకు అన్య మతముల వారి బోధ లెందులకు. మతము అనునది లేనిదై గొడ్డు పోతు వలెనున్న దేశము ఎందైన నున్నయెడల క్రైస్తవులు ఆ తావున కేగి ఆ దేశపు ప్రజలకు తమమతమును జెప్పుకొనవచ్చును. ఎవరైనను సరియే పెండ్లికాని పడుచును పెండ్లాడవచ్చును. మరియు పోషింపవచ్చును. పతిని కల్గియున్నట్టి వనితవద్దకుం బోయి- ఓ భామామణీ నా యందచందములు చూడుము. నా భవనమును దర్శింపుము. నా యాస్తిపాస్తుల నెరుంగుము. నా తెలివి తేటలను పరీక్షింపుము. అవసరమగుచో నా బలమును అర్థముచేసికొనుము. ఇట్టి వానిని జేరక- అందచందములులేని — ధనధాన్యములులేని - మేడమిద్దె మేడలులేని - తెలివి తేటలులేని నీమగనితో కాపురమేల చేసెదవు. అతని విడనాడి నన్ను జేరుము అనినటు లుండదా ఆ క్రైస్తవుల బోధ!

హిందువులారా! మీలో దాత లెందరో కలరు. సత్రములకు గుళ్ళకు సప్తాహములకు ఉత్సవములకు వేలువేలుగా ధనమును వ్యయమొనరించుచున్నారు. వాని కన్నిటిని మించినది మతప్రచారము. ఎందుకన - దానిమూలమున హిందువులెల్లరు హిందుమతముననే నిల్చిపోయెదరు. లేదేని క్రైస్తవు లయ్యెదరు. ఆ క్రైస్తవులకై పత్రి

ములుపయోగపడును. అనాడు రామోత్సవములు జరుగవు, గుడిగోపురములుండవు.

రాబోవు మీ వంశముల వారందరు క్రీస్తుమతమును స్వీకరించు నెడల-ఇక మీధర్మములవలన ప్రయోజనమెద్ది? మత ప్రచారమునకై ధనమొసంగక — ఎన్ని యుత్సవముల జేయించుచున్నను - అవి యన్నియు మీ వంశములవారిని ఉద్ధరింపజాలవు. దేవుని ధ్యానింప రాదని కాదు. రోగము వచ్చినపుడు దైవధ్యానమును గావించుచున్నను వైద్యచికిత్సను ఎటుల గావించుచుంటిమో అటులనే మతప్రచారము అను వైద్యచికిత్సకై ధనమును వెచ్చింపుడు. మందులను నిల్పి - కేవలము దైవధ్యానము మీదనే నిల్చియుండగలమా? ఆరీతిగ నుండ దగినవారు లేరు. సర్వసంగపరిత్యాగ మొనరించినవారికి రామనామమే దివ్యౌషధంబు. ఇంకను మనమెల్లరము ఆ తరగతియందు నిల్చిన వారమై యుండము.

"కావున మానవ ప్రయత్నమును చేయుటవం
టిదే మతప్రచారము. దేవుని ఉత్సవములను
చేయునట్టివిధానము - రామనామ సంకీర్తన
మును బోలియున్నది."

కావున ఒకవైపునుండి ఉత్సవములకై యెంతటి ధనమును వెచ్చించుచుంటిమో అంతకు మించిన ధనమును మతబోధకై వినియోగింపవలెను. ఆ బోధచే ప్రజలందరు దైవమును విశ్వసించి - ఎవరి యింట వారే నిరంతరము దైవనామమును కీర్తించుకొనుచుందురు. దేశోద్ధరణమునకు ఇదియే సత్యమగు మార్గము.

ఏహిందువునైనను కదిలించి చూడుడు. మీ మతమున నున్న సంశయములకు ప్రత్యుత్తర మొసంగమని కోరుడు. పాపము! అనాథులగు హిందువుల కేమి తెలియును.

అన్యమతములవారు వీరిని జేరి అయ్యా! మీ మతమున - నవతారపురుషుడని కీర్తింపబడిన రామచంద్రుడు భార్యకై యేడ్చెనే! అట్టివాడు దేవు డెట్లగును?

కృష్ణావతార మున్నదికదా! అతడు వెన్నను దొంగిలించెను. గోపికలను చెరచెను. అతడు మీ కెట్లు దేవుడయ్యెను? రాళ్ళను పూజించుచుందురు కదా. అవి దేవరూపములా! సర్వలోకములను సృజించినట్టి మహనీయుడు- అనగా ఆ దేవుడు మీ యెదుట బండయై పడియుండె నేమి! దేవత లెందరు వ్యభిచరించిరని పురాణములలో కలదు. అట్టి గ్రంథములు అట్టి దేవతలు - మీకు పూజ్యాలా అని ప్రశ్నించుచుందురు.

వానికిం జవాబు చెప్పలేక పోవుదురుగాక- కాని - ఓయీ! క్రైస్తవమతస్థుడా! మీ క్రీస్తు దేవుడైనయెడల - కత్తులచే పొడిపించుకొని చచ్చెనే. ఒక వ్యభిచారిణి స్త్రీచేత - అత్తరు పూయించుకొనెనే. తనను చంపుటకై రాజభటులు వచ్చుచుండిరని యెరింగి అయ్యో నా ప్రాణములను దీయుటకై వచ్చుచుండిరని దుఃఖించుచు నేలపై బడి దొర్లి దొర్లి - బిగ్గరగా నరచెనే! దేవుడైనయెడల - నిట్టి పనులం జేయు నేమి" అని మరల ప్రశ్నించుటకు - వీరి కావిషయములు తెలియక పోయెను. అహో! ఈరీతిగ వారి మతముననున్న విషయములు కూడా హిందువులకు దెలిసినయెడల - ఇంతటి ముప్పు - మన దేశమునకు వాటిల్ల నేరదు. అవతలిపార్టీ తరఫున వాదించుటకు ప్లీడర్లు కలరు. మనపార్టీవారికి వకీళ్ళు లేరైరి. యీగతి సంభవించినది. అట్టి లోపమును తొలగించుకొనుటకై -

మతప్రచారము - మతగ్రంథ ప్రచురణముతప్ప వేరొక మార్గము గోచరింపదు.

ఈ రీతిగ తెలివితేటలులేని బిడ్డలు పుట్టిరే- యనుచు మన భారతమాత మిక్కిలి విలపించుచున్నది. ఆమెనుండి వెలువడిన కడుపు మంటలు బిడ్డల నేనాటికైనను కష్టముల పాలొనరింపక మానవు. మాతృదేవిని రక్షింపవలసిన బాధ్యత పుత్రులకు లేదా. తమ భార్యామణిని ఘడకటికటిఁలొనుంచుకొని సుఖించుటే తమకు కర్తవ్యమైయున్న దేమి! ఈభరతదేశమున ఫలించిన ఫలములను మరియుపాడిపంటలను- కడుపునకెక్కింవి పొట్టను నింపుకొనుచున్నవారు ఆమాతృదేవి విషయమై విదేశముల వారిచే సంభవించుచున్న భరింపరాని యవమానములను తొలగింపవలెనను భావములు- పుత్రుల కేల కలుగకున్నవి. పాపము శమించుగాక.

వేదమాతయొక్క కన్నీటికాల్వలు చైనావారి మూలమున వివిధములగు ఇక్కట్లయొక్క బిందువులను కురిపించుచున్నవి. దౌర్భాగ్యచిహ్నమగు పాపిష్ఠకర్మ-మొద్దియైన నొకటి యుండునేని ఈమాటలు వెగటుగా దోచును. ఏ నాటికైనను కానిండు! ఏనాటికైనను కర్మఫలములు తత్కర్తలను వెంబడింపక మానవు. సమయముకై నిరీక్షించుకాలము పరిపక్వమైననాడు - అవి వెదకుకొనివచ్చి విధిగా ననుభవింప చేయును. ఆరీతిగ ననుభవించువారి చరితమును వినినవారుగాని స్వయముగ దర్శించినవారుగాని పైవిషయము నంతయు నర్థము జేసికొనియుందురు. తెలిసి తెలియనివారివలె వ్యవహరించు వారున్నయెడల వారు దేశమున కపకారులగుదురు. ఒక యుదాహరణము జూపెదను.

పూర్వకాలమున జయచంద్రుడు అనురాజు పృథ్వీరాజును జంపించుటకుగాను మహమ్మదీయులను జేరదీసి వారిమూలమున తన శత్రువును జంపింపగల్గెను. ఆసమయమున తాను కృతకృత్యతం జెందితినని సంతోషించియుండెను. కాని ఆదుష్కర్మము తగినఫలమును అందజేయక విడుచునా? కనుకనే మహమ్మదీయులు జయచంద్రుని తత్వము నెరింగినవారలగుచు - ఆటడు మరియొక సమయమందైనను అన్యులతో జేరి తమను విధిగ నశింపజేయ సమకట్టునని యెంచిరి. కను

కనే దయాదాక్షిణ్యములులేక నతనిం జంపివైచిరి. వింటిరా! కర్మ ఫలముల రీతులు ! - పరులను మోసగింపగల తెలివియున్నదని భ్రమించువారి గతులు- తమనుమించిన తెలివిగలవారిచే దుర్గతులుగా సిద్ధపరుచబడుదురు- అని విశ్వసించుట తెలివిగలవారి లక్షణము. కావున మోసకృత్యములం దారితేరినవారు యిక నను మేల్కాంచి జాగ్రత్త వహింపవలెనని ప్రార్థన. మరియు వారు గరూకులై వ్యవహరించు టయు నెంతయో మంచిది.

ఒక భరతమాత విషయమే కాదు గృహమందున్న తల్లులను గూర్చియు గమనింపవలసిన విషయము లన్నియో గలవు. తొమ్మిది నెలలు కడుపార మోసి-మట్టినిం దినుచు- తినిన యన్నమును నైతము కక్కుచు - నా తల్లులు బిడ్డలం బెంచుచుందురు. పిల్లల విషయమై "దేవదేవా! యని సంబోధించుచు - తల్లులు ఎన్నికష్టముల ననుభ వించిరో తమ భార్యల మూలమున దెలుసుకొనవచ్చును. పసిబాలు రకు వ్యాధులంకురించినపుడు ఆ మాతృదేవతలు పథ్యములం చేయుచు వివిధ కష్టముల కోర్చి దుఃఖములపా లయ్యెదరు. మలమూత్రములు నెత్తుచు - వారి నిమిత్తమై పాకిపనిని చేయుచు నుండిరి. కనుకనే మాతృదేవికంటె పరమదైవము వేరొకటి లేదని పెద్దలు వచించిరి. యౌవనమదముచే అట్టి తల్లులను బాధించు పుత్రులుండిరని వినిన నాడు గుండెలు బ్రద్దలగుచుండును. కాని తత్కర్మఫలము తమ వార్ధక్యదశయందు-

అనుభవమునకు రాకపోదు. ఆనాడు తల్లులయొక్క యేడ్పు లను మించినవియు, ఘోరరూపమును దాల్చినవియు కన్నీటిధారలు ఒలికి యొలికి హృదయములనుండి పలుకరింపగలవు. ఆ ప్రతిధ్వనులు విన విన సత్యము గోచరించును.

తల్లియగు గాంధారి తన కుమారున కెన్ని విధముల నీతిని గరపియుండలేదు! అయిననేమి? రాజ్యమదముననో, అధికారమదము ననో, యౌవనమదముననో లేక విద్యామదముననో, ఆ వాక్యములు

హృదయమునకు నచ్చినవికావు. "వినాశకాలే విపరీత బుద్ధిః" అను సూత్రము దుష్కర్మఫలము లను నెట్టుకొనివచ్చి యనుభవింపజేయక విడవదుకదా!

అంతియే కాదు— ఆ కర్మ - నరుని కంఠమునకు ఉరితాడు వలె సిద్ధమగుచుండును. "మాతృదేవోభవ" "పితృదేవోభవ" అను సూక్తులు దేవదేవునిచే మానవజాతి కనుగ్రహింపబడిన తొలి పలుకులై యున్నవి. వానినిమించిన ధర్మములు వాఙ్మయమునం దెచ్చటను లేవని ఘంటాపథముగ నుడువగలుగుదుము. కావున శ్రేయము నభిలషించువారు తమజీవితముననే గాక - తమ వంశమునం దుదయింపబోవు పుత్రపౌత్రాదులందరిని ఆనందసాగరమున నోలలాడింపవలెనని యభిలషింతురేని వెంటనే మాతృదేవిని సేవింపవలెను. అటులనే భరతమాతయొక్క కన్నీళ్ళను తుడిచివేయుటకుగాను — వేవేగః సంసిద్ధులగుచు విదేశీయులచే నేర్పరచబడిన పంచమాంగదళములనుండి సంభవించుచున్న బాధలను తొలగించుకొనవలెను.

విదేశీయుల మాయోపాయములు జాలరివాని గాలములవలెను, వలలచందముననుు, శాంతరూపమున వ్యవహరింపబడినవగుచు మెల్ల మెల్లగ నన్యదేశములవారికి హాని కలుగజేయగలవు. వారి తంత్రములు దినదినంబున నలుదిశలకుం బ్రాకుచు ఆ యా దేశీయుల హృదయక్షేత్రములను దిమ్మెసవేయబడిన రీతిగ – విదేశీయ భావనలచే గట్టిపరచుచుండును. గాలములం దుంచబడిన - ఎరను గాంచిన వెంటనే-మత్స్యము(చేప)లేమి జేయగలవు? అందలి యెరను తినబోయి తమ జీవితమును నశింపజేసికొనును. ఆగతి సంభవించినది భారత జాతికి. పట్టుబట్టి మీ మత మెట్టిదని గట్టిగ ప్రశ్నించువారున్న యెడల పెక్కుమంది హిందువులు — అందుకుం తగిన ప్రత్యుత్తరములు చెప్పలేనంత హీనదశయం దుండిరి. కనుకనే రత్నమువంటి మతమును మట్టిపాలొనరించి విదేశమతమున జేరుచున్నారు.

చదువరులారా! భారతీయులు మిక్కిలి తెలివిగలవారు, అయిన నేమి ఫలము! విదేశీయులచే సంభవించుచున్న యిక్కట్టులం దెలిసికొని తగిన ప్రతిక్రియను జేయుటకు తమ తెలివిని వినియోగింపరైరి. చీట్ల పేకలతోడను - ఆటపాటల మూలమునను - పనికిమాలిన సంగతులం జెప్పుకొనుట తోడను - చిన్నయనక - పెద్దయనక నెల్లరు జీవయాత్రను సాగించుచుండిరి. ఆయాట పాటలలోని కాలమున గొంతభాగ మైనను విదేశీయుల మతగ్రంథములను కూడ చదువుచు నందలి లోపములం దెలియుటకు ముందంజవేయకూడదా! ఏ స్త్రీనిగాంచినను- పురుషుని దర్శించినను-నవలలను చదువువారే యగుచుండిరి. పోనిండు. వానితోబాటు విదేశీయుల మతగ్రంథముల నేల చదువకున్నారు? పొరపడచుందురేమో! హిందుమతగ్రంథములను సైతము విధిగ చదివితీరవలెను. లేదేని భ్రష్టస్థితిని పొందెదరు. ఆరెండుమతములను త్రాసునందుంచి తూచుచున్నయెడల హిందుమతమహిమ వెల్లడి కాగలదు.

☞ అట్టి గ్రంథము లున్నవా! యని ప్రశ్నింపుదు. లేకేమి! హిందుమతగ్రంథమాలలోని ప్రతిగ్రంథము మీకు సహకరింపగలదు.

పురుషవరులారా! హిందుమత గ్రంథమాలలోని పుస్తకములం జదువుడని మీ స్త్రీలకుం జెప్పుడు.

పతివ్రతా శిరోమణులారా! మీపురుషులకును పై విషయమును విన్నవింపుడు.

బాలులారా! మీగురువులకు జెప్పుడు. ఈరీతిగ హిందుమత ప్రచారహర్మ్యమునకు(మేడకు) ప్రథమ సోపానము సిద్ధము కావలెను. అటుపైన నెల్లరు ముందుకువచ్చి ధనమును-ప్రోగుచేయుచు మతప్రచారకులను దేశములం దన్నిప్రాంతములకుం బంపుచు నుండవలెను. పదార్థశాస్త్ర సమ్మతముగను, యుక్తియుక్తముగనుస్వానుభవమునను

బోధింపగలది హిందుమత మొక్కటే యని దిట్టముగ నమ్ముచు. అద్దా
నిని ఖండింపగలవారు ఈధరాతలంబున గానరారనియు దృఢముగ
సకారణించుచున్నాను. మరియు విదేశమతము సైన్సును (పదార్థ
విజ్ఞాన శాస్త్రమునకు) సంబంధించియుండదు. ఇంకను వినుడు-

ఆదిమానవుల సృష్టివద్దనుండి జగత్ప్రళయము వరకును- అటు
పైన అనగా జగత్ప్రళయానంతరము జరుగనున్న విషయముల వర
కున్ను ఆమతముచే బోధింపబడిన సిద్ధాంతములు కనులుమూసుకొని
వినవలదప్ప ఎదిరించి ప్రశ్నల నడిగియుందుమేని ఒక్కదానికైనను
సరియగు ప్రత్యుత్తరము లొసంగజాలకున్నవి. అట్టి సిద్ధాంతములతో
నిండియుండిన ఆ విదేశ మతము మనదేశమునం దంతటను వ్యాపించు
నని-బుద్ధిబలము- శూన్యమైపోవును. ఇక మనజీవితము లుండినను లేకు
న్నను ఒక్కటే.

పాఠకులారా ! సర్వసంశయములం దీర్చగల బుద్ధిని అను
గ్రహింపగల హిందుమతము కావలెనా? లేక ఎయ్యది బోధించు
చున్ననుఅదేమంచిదని యెంచి - తలనువంచుకొనుచు బుద్ధిబలమును
వృద్ధిచేసు కొనుటకై తావొసంగని విదేశమతము కావలెనా ! బుద్ధి
మంతులు మీరే నిశ్చయించుకొనుడు.

శ్రీకృష్ణపరమాత్మ ఏమని హెచ్చరించెనో వినుడు- బుద్ధి
యోగం దదామ్యహం॥ బుద్ధిని వృద్ధిచేయు మార్గమును అందజేతు
నని పల్కెను. విషయమిటులుండ బుద్ధిమంతులగువారు బుద్ధిబలమును
వృద్ధిచేయగల శ్రీకృష్ణుని దివ్యమార్గమును విడిచి క్రీస్తుమార్గమును
అన్వేషింపనేల ?

—:దేవు డొక్కడైయుండ మతము లనేకము లెందుకు?

దేవుని జేరుటకు ఒక మతము చాలదా ! అనుప్రశ్న బాధించు
చున్నది. అందుకు ప్రత్యుత్తర మెవరు చెప్పగలరు ? దేవునకు తప్ప

నితరులకు సాధ్యము కానేరదు. ఆదేవుని వాక్యము హిందుమతమున నున్నందున విధిగ నామతమును- శరణువేడుదము. అంతట మన సంశ యము లన్నియు దీరును.

అజా మేకాం లోహిత శుక్ల కృష్ణాం

బహ్వీం ప్రజాం జనయంతీగ్ సరూపాం। అనుచు వేదమం త్రము ముందుకు వచ్చుచున్నది,

లోహిత=ఎరుపు }
" =తెలుపు } రంగులతో విరాజిల్లునదియు
కృష్ణాం=నల్లని }

అజాం } పుట్టుకలేనిదై వెలయుచున్నదియునగు ఒకా
ఏకాం } నొక ప్రకృతితత్త్వము విరాజిల్లుచున్నది యని వేద మున సూచింపబడెను.

బహ్వీం ప్రజాం=ఈ లోకుల నందరిని
జనయంతీం= ఆ ప్రకృతియే సృజించియుండెను. అని పై మంత్రము హెచ్చరించినది. ఈ సృష్టియంతయు ప్రకృతి ( Nature ) నుండి సంభవించెనని దాని యర్థము.

వేదమాతయొక్క- గంభీరభావము వింటిరిగదా! అట్టి ప్రకృతి దేవదేవుని అండగా గైకొని - సృష్టి గావించెనని యెఱుగుడు. తెలియ దగిన మరియొక రహస్యము కలదు-

దేవునియందు ఏకత్వ ముండెను. } ఇదియే పరమ రహస్యము.
ప్రకృతిలో నానాత్వ ముండెను. }

ఈ ప్రకృతియు, ఆ దేవుడును - ఒకేతావున జేరినవార లగుచు ఆదిమ దంపతులుగ నుండిరి. దేవదేవుని బలమును జూచు కొని ప్రకృతి రూపిణియగు ఆ జగజ్జనని తననుండియే జగము

సంతతియు నిర్మించియుండెను. మన గృహమునందు సైతము సంతతిని గనునది స్త్రీయేకదా! అటులనే నానాత్వమును గల్గియున్న ప్రకృతి భిన్న తత్త్వములతో నలరారు జగమును సృష్టించియుండెను. ఆ హేతువుననే జనుల నుద్ధరించుటకు ఏర్పడిన మతములు సైతము భిన్నగుణముల ననుసరించినవి యగుచు ననేకములై రాణించుచుండెను.

ఒక యుదాహరణముం జూడుడు-

(1) బాలురను విద్యావంతులుగ జేయదలచిన గురువు - ఆ పిల్లల గుణముల నర్థము జేసుకొనినవాడగుచు - వారితో నాడుచు పాడుచు - నటు యిటు దిరుగుచు - నడుమ నడుమ పాఠములం జెప్పి జ్ఞానమును కల్గించుచుండును.

(2) యువకులను జ్ఞానులుగ నొనరింపదలచిన గురువు వారిచే నాటకము లాడించుచు- వివిధ దేశములం దిప్పుచు-మరియు నాయా దేశములలోని వీరపురుషుల గాధలను వినిపించి - నడుమ నడుమ దేశ రక్షణకు అనువగు పాఠములం జెప్పుచుండును.

(3) వృద్ధులకు బోధింప నెంచిన గురువు ఆ శిష్యులను జన సమర్దమున నుంచక నేకాంతస్థలములం దుంచుచు - ఐహిక విషయ ములనుండి విరక్తులం జేసి అంతరాత్మలలోనే యేకీభవింపగల మార్గ ములం జూపుచుండును.

వారందరకు జ్ఞానము కల్గింపవలెననియే ఆ గురువుల యాశ యము. కాని వారి వారి ప్రకృతులను (స్వభావములను) గుర్తింప వలదా! అందుకనియే భిన్న భిన్న గ్రంథములం దెప్పించి చదవించు చుండును. విద్యార్థులకు కావలసిన విషయము జ్ఞాన మొక్కటే కదా! ఆ స్థితియందు అర్థానిని అందింపదలచిన గురువులు భిన్న భిన్న మార్గముల నుపదేశించు టెందులకు? ఇందలి సత్యమును గుర్తింపగల దెలివి యున్నచో ఒకే దేవుని జేరుటకుగాను - ఏర్పడిన మతములు అనేక రీతులుగ నుండుటకు హేతువు లెవ్వియో తెలియ గల్గుదురు.

ఎంతగా వినిపించుచున్నను లోకజ్ఞానము లేనివారలకు జవాబు చెప్ప జాలము. లోకానుభవముచే వివరించుచున్నపుడు - అందలి సత్త్వ మును గుర్తింపగల తెలివిని కల్గియున్నచో - అట్టివారలకు ఎట్టి విషయములనైనను అర్థము జేయవచ్చును. ఈ శ్రద్ధతో వినుడు-

(1) మూడు రంగులతో విలసిల్లుచున్న మూడు గుణములు ప్రకృతియందుండెను.

(2) అట్టి ప్రకృతియొక్క గుణములను అర్థము జేసికొనుచు - అందుకుం దగిన రీతిగ వివిధ మార్గములతో వ్యవహారింపవలెను.

(3) అటుగాక - అనగా-ప్రకృతియొక్క తత్త్వము మూడు విధములుగ రాణించుచున్నదని యెరుగక - ఆ ప్రకృతి విషయమై అది ఒక విధంబుగ నుండెనని భ్రమించుచు ఒకేమార్గమున నడచుట పూర్ణజ్ఞానమునకు దూరమైయుండుటే యని యెరుంగుడు.

(4) కనుక ప్రకృతిమాతను సేవించుటకుగాను భిన్న మతములను నిర్మించుకొని వ్యవహారింపవలెను. ఈ రీతిగ వివరింపగల తెలివి హిందుమతమునగాక మరెందును గోచరింపదు.

తెలివి యనునది లేనపుడు లోకము భిన్న తత్త్వములతో గూడి యున్నదని తోచదు. కనుకనే దేవుని జేరుటకు ఒకే మతము కావలెనని వాదించుచుందురు.

జగ మొక్కటిగ నున్నను - అనేక దేశములు శీతోష్ణాది భేదములతోడను,

ఆహారాది పదార్థములలోని వ్యత్యాసముల మూలమునను

వివిధములగు భాషా స్వభావముల చేతను ప్రత్యేక చిహ్నములు గలవై రాణించుచున్న కారణమున-

ప్రజలను ఉద్ధరించుటకుగాను-
భిన్న స్వభావములు గల్గిన భిన్న మతములు

ఏర్పడి యుండుటే అవసరం బయ్యెను. ఇంకను మరియొక దృష్టాంతమును జూతము-

మన దేశమున ఒక ప్రభుత్వ మున్నదనుకొందము. బహు సమర్థుడైనందున - నెహూౄగారు - ఆ ప్రభుత్వమునకు ప్రధాన మంత్రిగ - నెన్నుకొనబడిరి. అందుకనియే-ఆ మహనీయుని యెడల నెల్లరము విధేయులుగ వర్తించుచుందుము. శాసనములం జేయవలె ననిన - తానే - స్వయముగ నిర్ణయించి అములునందుంచునా? లేదు. భిన్న భిన్నములగు తత్త్వములతో నలరారుచున్న మన దేశమున నొక్కొక్క ముఖ్యమంత్రిని నియమించియుండెను. అది మొదలు - వారి వారి తెలివికిం దగినటుల - ఆయా రాష్ట్రములలోని - వ్యవహారములు ప్రచలితము లగుచుండును. వివిధ రాష్ట్రములలోని రాజకీయ వాతావరణము వేరు వేరుగ స్వల్పభేదములతో వెలయుచున్నను భారతదేశ రాజ్యాంగ మంతయు - నెహూౄగారి పరిపాలనము క్రిందనే జరుగుచుండెనని నిశ్చయింపగలము పై విషయ మంతయు గుర్తునం దుంచుకొనినయెడల - హిందుమతములోని సంశయము లన్నియు తమంతట తామే సమసిపోగలవు.

ప్రకృతమునకు వత్తము. జగమున కింతటికిని దేవదేవుడను వాడు ఒక్కడే గలడు. ఆతడు సర్వలోకములకు అధ్యక్షుడు. అయినను- ఒక్కొక్క దేశమును ఒక్కొక్క రాష్ట్రముగ - నెంచుకొని, ఆయా దేశములకుం దగినరీతిగ మత ప్రవక్తలు-అను చిన్న చిన్న అధ్యక్షులను నియమించియుండెను దానింబట్టి-చిన్న చిన్న యధ్యక్షులెందరుండిరో, అన్ని సంఖ్యలతో మతములు విరాజిల్లుచున్నవి. ఇంకను చర్చించి జూతము-

పై విషయమంతయు గుర్తునందుంచుకొనుడు. మరియొక విధంబుగ జూచినను - మతములు అనేకములై యుండవలెను. అట్టి సత్యమును గమనింతము.

(1) ఎండలచే నలంకృతములైన దేశములు, ఈ జగమున కొన్ని యుండెను. అందు నివసించుచున్న ప్రజల దేహములలోని మానసిక ప్రవృత్తులు సైతము, కొంచె మెంచుమించుగ, నొకే ధోరణిని కల్గియున్నవై యలరారుచుండెను.

(2) శీతలము (చలి)చే నలరారుచున్న ప్రాంతములు కూడ నీ ప్రపంచమున నెన్నియో కలవు. ఆ దేశమున ఫలించు సస్యములును - అందు వసించుచున్న ప్రజల చిత్త వృత్తులును - మరియొక రీతిగ రాణించుచుండెను.

(3) శీతలము, మరియు ఉష్ణము, సమముగానున్న భూభాగములు మరికొన్ని గలవు. ఆహారముకొరకై - అందు లభ్యమగు పదార్థములును - తద్దేశీయుల మనో భావములును - వేరొకరీతిగ భాసించుచుండును.

పైన ఉదహరింపబడిన మూడురకములగు దేశ భేదముల ననుసరించి - భాషలుగాని, ఆహార, విహార, వ్యవహారములుగాని భిన్నములుగ నేర్పడుచుండును.

ఆయా ప్రాంతముల వారిచే ధరింపబడు దుస్తుల విషయమై కూడ; భిన్నత్వమే ప్రదర్శింపబడుచుండును. రాజకీయ రంగములు సైతము - ఒకదాని కొకటి సంబంధించియుండవు.

తమ మిత్రులుగాని-బంధువులుగాని యింటికి వచ్చినపుడు-శీతల దేశవాసులు కుంపట్లలో నిప్పులం బెట్టుచు సుఖంపజేతురు. భారతీయులు మట్టి పాత్రలలోగాని - లోహ పాత్రలలోగాని జలము నుంచుచు - తమ మిత్రులను ఆదరించెదరు.

"బంధువుల నాదరింపవలెను" అను కోర్కె యెల్లరకు నొక్క-టేయుండును. అయినను - విదేశీయులు - నిప్పుతోను, స్వదేశీయులు నీటితోడను తమ బంధువులను గౌరవించెదరు. అనగా నొకరికి వేడితనము, మరియొకరికి చల్లదనమును కలిగించుచుందురు. అందుకు హేతువు వారివారి యిష్టమా! కాదు. దేశముయొక్క శీతోష్ణాది భేదములు — వారివారి బుద్ధులనే మార్చివైచినవి.

దీనింబట్టి - దేశమున ననుసరించి దేహములును, అందలి భావములును, వేరువేరగుచుండునని విశదమగుచున్నది. అందుకనియే ఒకే సౌఖ్యము నభిలషించిన విదేశీయులును - స్వదేశీయులును దానిననుభవించుటకై సాధనములను, వేరువేరుగ గుర్తించి, వానినుపయోగించుచుందురు.

మనసునకు ఆనందము కలిగించు సాధనములన్నియు నిటులనే భేదించుచుండును. బాగుగ వినుడు. ఇందుకు దృష్టాంతమును జూతము.

ఒకరు, జామపండును తినెదరు. వేరొకరు మామిడిపండును భక్షింతురు. అయిననేమి! వారి మనసు ఒకే యానందము ననుభవింపగలదు. బ్రహ్మానందమును పొందవలెనన్నను, ఆ మనసునకు వేర్వేరు సాధనము లుండితీరవలెను. విచారింప - కోరికమాత్రము ఒక్కటియే కావచ్చును. దానిని నెరవేర్చుకొనుటకు వేరువేరు పనుముల్లను స్వీకరింపవలసియుండును అట్టిభేదాభిప్రాయములు కలుగుటకు కారణము — అవి నివసించుచున్న దేహములు కావా ? అవును. దేహములలో సైతము భిన్నత్వముండెనని గ్రహింపుడు. అందుకనియే-వానిలో నివసించుచున్న మనసులు మాత్రము భిన్నతత్వములతో నలరారుచున్నవి. విదేశీయుల దేహములు వేరు, స్వదేశీయుల దేహములు వేరు. అనగా వారివారి ప్రకృతులు భిన్నములైయున్నవి. ప్రకృతులన - నర్థమెద్ది! స్వభావములని యర్థము. అట్టిస్వభావములు, వేరువేరుగ నేర్పడుటకు హేతువులు లేవా? ఉన్నవి. ఆయా దేశముల

ప్రకృతుల ననుసరించి, వారివారి దేహములు సయితము భిన్నస్వభావ ములను పొందుచుండును. మంచిది.

దేశములన్నియు నొక్కటే స్వభావమును కల్గియుండక- భిన్న స్వభావములతో విలసిల్లుటెందులకు? వానినన్నిటిని పుట్టించినట్టి వస్తువునందు- భిన్నత్వమున్నందున- ఆరీతిగ దేశములన్నియు, భిన్న స్వభావమును పొందినవయ్యెను, అయితే- వివిధదేశములను సృజించి నట్టి ఆవస్తువునకు అనగాప్రకృతికి- భేదస్వభావ మెటుల కల్గెనో! అని ప్రశ్నింతము. ఆతావున ప్రత్యుత్తర మీయగలవా రుండరు. ఎందు కన- ప్రకృతి యనునది - అదియే మొదటిదై యున్నది.

అంతకుపూర్వము-మరియొకటి-దానకి హేతువు-ఉన్నయెడల- జవాబుకై యత్నింపవచ్చును. ప్రకృతికి పూర్వరంగమున — వేరొ కటి లేని కారణముచే- అనాదినుండి ప్రకృతి స్వతస్సిద్ధముగ- అనగా తనంతటతానే — భేదములుకలదై రాణించుచుండెనని, వచింపవలసి యుండును. ఇంకను లోతునకుబోయి విచారింపగలతెలివి మానవు లందు లేదు. ఎందుకన — అటుపైనదానిని మించినట్టి అంతర్గతంబగు తత్వము వేరొకటి గన్పింపదు. ఇకలేనిదానికై వెదుకనేల! కను కనే — మానవుని బుద్ధి అంతటితో తనవిచెంది యానందించు చుండును. అనగా — ఆది ప్రకృతియందు భిన్నత్వము-సహజముగ నుండెనని — మనమనసు ఆనందించుచుండును. ఇక సంశయము లుండునా? ఉండవు "సంశయాత్మా వినశ్యతి" అనికదా సూక్తి! ఇక సంశయము లేలయుండును? ఇపుడు తర్కింపబడిన విషయమును బాగుగ నర్థము జేసికొనుచు సంశయరహితులై యుండుడు. మీ మిత్రులందరకును వినిపింపుడు. ఇంతయేల? ఈ గ్రంధమును చదివిన వారందరు - ఇందలి సత్యవిషయముల నన్నిటిని వారివారి బంధువుల కును — మిత్రులకును స్వసుతస్థులకును తదితరులకును బోధించుచుండ వలెను. దానినే స్వధర్మ మనెదరు. స్వధర్మమును మాంచినవారును — ఆచరింపనివారును, దేశమునకు మితిమించిన భారమును కల్గించి యుందురు. ఇంతకు మించిన ధర్మబోధ వేరొకటి లేదు. కనుకనే -

"స్వధర్మే నిధనం శ్రేయః" (గీత)

స్వధర్మ రక్షణముకై మరణించినను శ్రేయస్కరంబగునని కృష్ణభగవానుడు తెల్పెను.

(1) అనాదినుండి స్వతస్సిద్ధముగ భేదములతో విలసిల్లుచున్న ప్రకృతి యనునది ఒకటి కలదనియు —

(2) అదియే ఈజగమును సృష్టించెననియు - తనయందు నెల కొనియున్న భిన్నత్వము ననుసరించియే భిన్నస్వభావమును కల్గిన దేశ ముల నేర్పరచె ననియు —

(3) అట్టి దేశములలోని శీతోష్ణాదిభేదముల ననుసరించి సృష్టిం పబడిన ప్రజల దేహములు కూడా భిన్న స్వభావమును పొందియున్న వనియు —

4. అందువలననే — ఆయా దేహములలోని మనసులున్నూ భేదించునవియై వ్యవహరించుననియు —

యిట్టి హేతువులచే—

స్వదేశప్రజలు - విదేశప్రజలు అను భేద మేర్పడి భిన్నాభిప్రాయములను కలిగియుండిరని తెలియగలిగితిమి.

అభిప్రాయమనగా మనసునందున్న యిష్టము. అట్టి యిష్ట మునే - అనగా అభిప్రాయమునే మతము అని మరియొక నామ ముతో బిలుచుకొనుచుందుము. సంస్కృతనిఘంటువులందు - మతమనినను, అభిప్రాయమనినను, యిష్టమనినను అర్థమొక్కటే యని నిరూపింపబడినది పండితుల నెవరినయినను ప్రశ్నించిచూడుడు. అవును, అవునని పల్కెదరు. కావున మతశబ్దమున కర్థము అభిప్రా

యము. హిందూదేశప్రజల యభిప్రాయము వేరు. విదేశీయుల యభి ప్రాయము వేరు. కాదందురా! మెడపైన తలయున్నవా రెవ్వరును కాదనజాలరు. బంధువులు తమ యింటికి వచ్చినపుడు వారికి చల్లదన మును కలిగించుట హిందువులకిష్టము. కనుకనే కాళ్ళకు చల్లనిజలము నిచ్చెదరు. బంధువులకు వేడిని కలిగించి యానందింపజేయుటకై శీతల దేశవాసులు వెచ్చగానున్న హాలునకు వారిని తీసికొని పోయెదరు. వింటిరా? వారివారి అభిప్రాయములను! అట్టి భేదాభిప్రాయములేల కలిగెను? దేశభేదమునుబట్టి భావభేదము కూడ యేర్పడెనని విశదమ గుచున్నది.

> స్వదేశీయుల అభిప్రాయము చల్లనిదిగానుండెను. విదేశీ యుల అభిమతము వెచ్చనిది, ఇందలి యంశము సర్వ సమ్మతము. విషయమిటులుండ స్వదేశీయులకును విదే యులకును అభిప్రాయమొక్కటిగనే యుండునని యెవ్వరన గలరు? కావున స్వదేశమతము, విదేశమతము అని రెండు మతములు తప్పనిసరిగ నేర్పడియుండెను.

మతమనినను, అభిప్రాయమనినను, సమ్మతమనినను, యిష్టమని నను అర్ధమొక్కటేయగును.

(1) నిదురలేచినది మొదలు మరల నిదురించువరకును

(2) జీవితాంతమున పెద్దనిదుర (మరణము) యేర్పడి అటు పైన పరలోకమేగు పర్యంతమున్ను

(3) ఆపరలోకమునసైతము సుఖముల ననుభవించుట పూర్తి యగు వరకున్ను

చేయ దగిన పనులెవ్వియుండెనో- వానినన్నిటిని నెరవేర్చవలె నను అభిప్రాయము మనకెల్లరకును నుండెనా లేదా? అట్టి గొప్పదగు అభిప్రాయమే మతమను పేరుతో వ్యవహరింపబడుచున్నది. మతము అనుదాని హద్దులు ఇపు డర్థమైయుండును.

ఇహలోకమున సుఖమనుభవింపవలెననియు అటులనే పరలోకముననుసుఖమును పొందవలెననియు నేర్పడిన భావమే మతము అను నామధేయమును పొంది సుప్రసిద్ధమై వెలిసెను.

ఇహపరసాధనంబైనది మతము అని సారాంశము. అట్టియభిప్రాయము లేనియెడల పైరెండు సౌఖ్యము లెటుల కల్గును? కనుక సౌఖ్యసంపాదనమునకు ముఖ్యసాధనము మతమనుట నిర్వివాదాంశము. ఆత్మసంబంధమగు సుఖమునకును ఇహసంబంధమగు సుఖమునకును సాధనము మనసే కదా! కాదని యెవ్వరన గలరు. మనసనినను మతియన్నను మతమనినను ఒకే పదార్థముయొక్క స్వల్ప భేదములు కల్గిన తత్వమై యున్నది.

ఇహలోక సుఖములకు మాత్రమే యనుభవింపవలెనను అభిప్రాయములు మనయందు లేవు. పరలోక సుఖముల విషయమైకూడా అభిప్రాయములు కలవు, కావున ఇహమునుండి పరమును జేరువరకు తోచిన అభిప్రాయపరంపర అంతెయు మతమే యగును. అటుగాక మన అభిమతమును (అభిప్రాయమును) పరలోక విషయమున మాత్రమే యుండునని యెటుల నిర్ణయింపగలము ఇదియే యెల్లరి అభిమతము.

| | |
|---|---|
| అభిప్రాయము, | ఇవియన్నియు |
| అభిమతము, | నొకేయర్థమును కల్గియున్నవని |
| సమ్మతము, | తోచుటలేదా. |
| మతము, | |

కావున స్వదేశమతము, విదేశమతము అనునవి రెండు మతములు కలవని విశ్వసించుటకు సంశయింపరాదు. అందుకవి కే—

స్వదేశీయులు స్వదేశమతమునను,
విదేశీయులు విదేశమతమునను

నిల్చియుండవలెను. అంతియేకాని బుద్ధిబలమున్నంతవరకు మతముల యొక్క మార్పిడిని చేసుకొనరాదు. ఏనాడు బుద్ధిబలమునశించునో—ఆనాడు వనితలు తమ పతులను మార్చుకొనుటయు అట్టి బుద్ధిగల వ్యక్తులు—మతమును మార్పిడి చేసుకొనుటయు సంభవింపగలదు. మతి లేనివారు పతులను మార్చుకొనుచుందురని యెల్లరమంగీకరింతుము. అటులనే మతమును కూడా మార్చుకొనుచుందురు. స్నానమును చేయవలసిన యావశ్యకత విదేశీయులకును స్వదేశీయులకును సమానమై యుండును. అయితే విదేశీయులు మిక్కిలి యుష్ణోదకమును ఉపయోగించుచుందురు. స్వదేశీయులు శీతలోదకమును వాడుకొనుచుందురు

మనము గంగానదియందు స్నానమాచరింతుము. శీతలదేశవాసులగు ఆంగ్లేయులు థేమ్సునదిలో స్నానమొనరింపగలరా. స్నానకర్మ యొక్కటిగనున్నను ఉష్ణోదకస్నానము శీతలోదకస్నానము అను విభజనమున్నదని యెరుంగుడు. స్వదేశీయుల ఆచారమును విదేశీయులు ఆచరించినయెడల వారిజాతికి నాశనము సిద్ధము. అటులనే విదేశీయుల ఆచారమును స్వదేశీయు లాచరించినను జాతికి పతనము తప్పదు. కనుకనే మనవారు విదేశీయుల మతమున జేరుటయు దేశనాశనమునకు మార్గమైయుండును.

పై విషయములన్నియు నెరింగినపిదప మతులు సరియైన మార్గమున నున్నప్పుడు విదేశమతమున జేరవలెనని యెవరును ఉత్సాహపడరు.

మరియొక దృష్టాంతమును చూతము. నరుల కెవరికయినను గమ్యస్థానమొక్కటేయగును. దానినే పరమపదమని పేర్కొనుచుందుము. మనమెరుంగనివాని విషయమై తెలియదలచినపుడు ఎల్లరకు స్వానుభవమున నున్నదానిని గుర్తునందుంచుకొని, తెలియనిదాని విషయమై పోల్చి చూచుకొనవలెను.

హైదరాబాదులోని ప్రజలును, మచిలీపట్టణమునందు వసించువారును, గుంటూరులోని జనులును, విజయవాడ వాస్తవ్యులును,

గోల్కొండకు బోవవలెనని నిశ్చయించిగనుకొందము. వారికందరకు గమ్యస్థానమొక్కటే కదా అట్టి విషయములలో వారందరు ఒకే మార్గమున నడచిపోవుదురా. ఎవరెవరు ఏయే తావులయందుండిరో, వాని ననుసరించుచు వేరువేరు మార్గములగుండా పయనము సేయుచుందురు. బందరులోనివారును, విజయవాడ పురవాసులును, గుంటూరుజనులున్నూ, వారివారి ప్రదేశములకుందగిన మార్గముల నెరింగి ఆయా త్రోవలగుండానే హైదరాబాదు చేరి - అటనుండి గోల్కొండకు వెళ్ళగలుగుదురు. ఎవరిమార్గము వార లనుసరించుచునే గమ్యస్థానమును జేరగల్గుదురు. అదేరీతిగ- ఆయా దేశీయులు తమతమ దేశములోని ప్రకృతులకుం దగినటుల ధర్మములాచరించుచు క్రమముగా పరమపదమును జేరగల్గుదురు. గుంటూరి వారి రైలు వేరు! బందరు వారి రైలు లేరు. కావున వారివారికి ఏర్పడిన రైళ్ళమీదుగా నడిచి తీరవలెను. అదేవిధంబుగ - నాయాదేశస్థుల కేర్పడిన మతముల గుండా పయనమై పరమపదమును జేరవలెనని సారాంశమై యున్నది.

వేరొక దృష్టాంతముం జూతము. నదులకన్నిటికిని సముద్రము నందు జేరవలసిన విధి యుండెను. కృష్ణానది తనకు విహితమైయున్న తావులనుండి పయనమై పోయిపోయి సాగరమున జేరవలసి యుండును. గోదావరినదియు, కావేరీనదియు, గంగానదియు, నవియన్నియు నొకే సముద్రమునకు జేరదలచినను తమకుగాను విధింపబడిన మార్గముల మూలముననే పయనముసేయుచు - తుదకు సముద్రమున నేకము కావచ్చును. అటుగాక - అనగా తమకై యేర్పడిన భూములను విడనాడి ఏ కృష్ణానదియో గోదావరియో గంగానది వద్దకుంబోయి - అటనుండి సముద్రమున జేరవలెనని యెవరేని తెల్పినయెడల, నావిషయమును మెచ్చగల వారొకరైనను ఉండరు సరికదా, అది వెర్రితనమని పరిహసింతురు.

అదేరీతిగ పరమపదము (మోక్షము) సముద్రమును బోలినదిగా నున్నది. దానిం జేరవలెనని నిశ్చయించుకొనిన జనులు తమ తమ దేశములందు విధింపబడిన మతముల మూలముననే ధర్మముల

నాచరించుచు, తుదియందు పరమపదమును జేరగల్గుదురు. పైనదుల కన్నిటికిని గమ్యస్థానము ఒక్కటియైయున్నను, మార్గములు వేరువేరై యున్నటుల మనుజుల గమ్యస్థానమగు పరమపదమునకున్ను మతములు అను మార్గములు భిన్నములై యుండవలెననుట - మిక్కిలి శ్లాఘనీయము. కాని తుదియందు నేర్పడగిన పాఠం బొకటిగలదు-

క్రిందిమెట్టునందుండుటకు అర్హులైయున్న హిందువు లుందురు వారిచే నంగీకరింపబడిన పరలోకమునందు - గంగానదియు - అయోధ్యా నగరము అమరావతీ పట్టణము, గోవులు, గరుడపక్షులు ఇంకను వివిధములగు జాతులు-దేవతాబృందము మున్నగునవెన్నియో ఉదహరింపబడినవి.

విదేశీయమతముచే వివరింపబడిన పరలోకమందు జెరూషలేం అను పట్టణము, సొదమ - అను నగరము గొర్రెపిల్లలు, దేవదూతలు యిశ్రాయేలుయొక్క 12 గోత్రముల నామములు మున్నగునవి వర్ణింపబడినవి

ఆయా తావులను విశ్వసించుచు జీవయాత్రను సాగించుచున్న వ్యక్తులుమాత్రము లేవమాత్రము - మరియు వారి ప్రభువును ప్రార్థించునెడల ఆ పరలోకమందలి సుఖము విధిగా సంభవము కాగలదు. కాని

వారి పరలోకము గాక తుదియందు సాధింపదగిన

## పరమపదము

అను కైవల్యపదవిమాత్రము లభ్యము కాజాలదు.

హిందువులలోని జ్ఞానులకు మాత్రమే ఆ దివ్యమగుపదము సిద్ధింపగలదు. ఆ పరమపదమును ఒకానొక లోకమని భ్రమింతురేమో! అది లోకము కాదు. లోకాతీతమైన నివసింపనట్టి దివ్యమగుపదమై

(స్థానమై) యున్నది. నగరములు, నదులు మున్నగునవి యెన్నియు. గోచరింపనిది ఆ తావు. సూర్యచంద్రుల కాంతులు లేకయే స్వయంప్రకాశమును కలిగినదై విరాజిల్లుచున్నదా తావు. అందు నిమరయు. వెలుతురయు నుండని తురీయాతీతమగు స్థానమాతావు. లోకములోని నామములన్నిటికిని, రూపములన్నిటికిని, ఆదిప్రకృతికిని, అవ్వల వెలుగొందుచున్నదయి సర్వమునకు ఆధారభూతమగుదానిని పరమపదమనెదరు.

విదేశమతములోని వ్యక్తులయినను సరియే. దేవుడనువాడు యెహోవా కాదనియు, నాలుగుప్రక్కల నాలుగు ప్రాకారములు కలిగిన పరలోకమందిరం బొకటి లేదనియు, యెరూషలేం అను నగరము నయితము ఆ తావునం దెచ్చటను గోచరింపదనియు, గొర్రెపిల్లగాని, గొర్రెలను కాచువారుగాని, దేవదూతలుగాని, ఆ తావున నిల్చియుండరనియు నిశ్చయించినవారున్న యెడల అట్టివారు హిందువులలోని జ్ఞానముచే వివరింపబడిన సాధనముల నభ్యసించుచు - ముక్తులు కాగలరు.

ముక్తి, ముక్తి యని కలవరించిన నేమి ఫలము? ముక్తియను నది పైరీతిగా నత్యంత శోభాయమానముతో విరాజిల్లుచున్నది. దానిం దెలియనేరక మేఘమండలమునకు పై భాగమందున్న పంచభూతములలోని జలభూతముచే నిర్మింపబడిన లోకమును పరలోకమును కొని — మురిసిపోయిన నేమిలాభము.

"యేభూతాః ప్రచరంతి దివా నక్తం"
బలి మిచ్ఛంతః విదు దస్య ప్రేష్యాః"
(వేదము)

భువర్లోకమున నెందరో
భూతాః = భూతాది గణములవా రుండిరి.
దివానక్తం = వారు రాత్రింబవళ్ళు ఈ భూమిమీదికి తమ దృష్టిని ప్రసరింపచేయుచు, కోడెదూడలను, ఆవుపెయ్యలను. గొర్రెలను మున్నగువానిని

బలిం = తమకు బలిహరణముగా చేయుబడిన భాగుందునని
ఇచ్ఛంతః = కోరినవారలగుచుందురు. కనుకనే

దివారాత్రిములు సూక్ష్మరూపములతో నీభూమండమున
పరిచరంతి = సంచరించెదరు.

అట్టి పరలోకవాసులను చేరి సుఖింపవలెనని యెంచక - పరమపద ముకై యత్నించువారు ధన్యులు. భారతీయులలో క్రిందిమెట్టున నున్న వారెల్లరు భువర్లోకమునుదాటి ఆవల వెలుగొందు పరలోకములకుం బోవనెంచెదరు. అందును శాశ్వతంబగు సుఖంబు గోచరింపదు. కనుకనే వారిలో సర్వోన్నతంబగు జ్ఞానమునం దారితేరినవారు అనగా జ్ఞానులు పరలోకములుగా పేర్కొనబడుచున్న దేవలోకములను సయితము మన్నింపక అంతకును పైమెట్టునందున్న పరమపదమును వాంఛింప గలరు. అట్టి విషయమును కనిపెట్టినట్టి వ్యక్తులు భారతీయులై యుండి రని ఒకమారు గర్వించుదము రండు. కావున స్వదేశమతములోని క్రిందిమెట్టునఉన్నవారును-విదేశమతమున నిల్చినవారును స్వాభిమాన పూరితులుగాక ఐకమత్యము వహించి యొకరిమతమును మరియొకరు దూషింపక - నెల్లరు శాంతచిత్తులయి వర్తించెదరుగాక!

అటుగాక యొకరు మరియొకరి నిందించుచు వారి మతమును నశింపజేయవలెనని బద్ధకంకణులైలు వర్తింతురేని - వెంటనే నిందింపబడినవారు నోరుమూసుకొని దద్దమ్మలయియుండక ఆత్మరక్షణము నకు గాను -

మీ మతమునందున్న ఆ మీ లోపములకు ఏమని ప్రత్యుత్తరం బొసగెదరు! అని ప్రశ్నించుచు వారి బలాబలంబులను దెలిసికొననెంతురు. అంతట - తామొనరించుచున్న పనులు దోషభూయిష్ఠములై యుండె నని గ్రహింపగలరు. అదిమొదలు శాంతివాతావరణ మేర్పడి ఉభయ పక్షములవారు సుఖింపగలరు.

## ముక్తిమార్గము.

విదేశీయుల పరలోకము — స్వదేశీయులపరలోకము — వేరు వేరుగా నున్నవని ప్రమాణ సహితముగ నిరూపింపబడెను. కావున విదేశీయులు భువర్లోక సంబంధమగు పరలోకమున కేగెదరు. అప్పై మెట్టున నిల్చియున్న పరలోకములకు భారతీయులు పయనమై పోయెదరు.

వానినన్నిటిని మించిన పరమపదమునకు జ్ఞానులు వెళ్ళగలరు. దానిం జేరవలెననిన వేదభాషయనియు దేవభాషయనియు పేర్కొన బడుచున్న సంస్కృతభాషను ఆశ్రయింపవలెను. ఆభాషలోఉన్న పదములన్నిటికిని ఆదభూతమైయున్న ఓంకారనాదమునందు మనసును జేర్చవలెను. కర్ణరంధ్ర ములనుండి ప్రతిధ్వనించుచున్న ఆ నాదమును ప్రణవనాదమనెదరు. ఆనాదములోని యక్షరము ఫలానా యని నిర్దేశించి వచించినవారు భారతీయులుగాక మరెవ్వరును లేరు.

### ఓంకారమును

### శబ్దబ్రహ్మమనెదరు,

శ్లో॥ నాదాంతర్గతం జ్యోతిః

ఆ నాదమును చెవులారా వినగ వినగ కొంతకాలమునకు —

జ్యోతిః = అందుండి జ్యోతియొకటి సాక్షాత్కరించును.

 జ్యోతి రంతర్గతం మనః

ఆజ్యోతిని దర్శించుచుండగా - మరికొంతకాలమునకు —

అంతర్గతం = ఆజ్యోతికి లోభాగమునుండి—

మనః = మనస్సు అనునది యొకబిందువువలె గోచరించును.

 తన్మనో విలయం యాతి

ఆ మనసుమాత్రము అటులనే-నిల్చియుండక లేను.

అదియు క్రమముగా —

విలయంయాతి లయించిపోవును.

అటిస్థలమున నొంటరిగ గూర్చొనవలయును. ఎందుకన ఆత్మ నిష్ఠను అభ్యసించుట కది మంచితావు. మెల్లమెల్లగా నభ్యాస మొనరించుటను ప్రారంభించి మొదలు బహుజన్మములనుండి ఆర్జింపబడిన సంస్కారములతో నిండియున్న సాత్త్వికరూపమగు ప్రకృతి భావలను బాధింపనారంభించును. అట్టి బాధల నన్నిటిని యనుభవించినపిదప ఆత్మను గుర్తింపగల్గును. కనుక నది దాని పైపునకు బరిగినదై అటులనే నిల్చిపోవును. వస్తునందున్న రీతిగ నిశ్చలస్థితిని పొందినదై యుండునని భావము. జన్మ పునర్జన్మలు కలవని క్రైస్తవులంగీకరింపరు. వారిమతమునందున్న లోపములలో నిదియు గుర్తింపదగిన విషయమై యున్నది. ఆలోపమున్నందున నీజన్మమున వారికి మోక్షము లభింపదు. మృతులైన పిదప జగము జలములో మునిగి పోవువరకు అంతరిక్షమందొక తావున దేవుని పిలుపునకై నిరీక్షించుచుందురు. ప్రళయము సంభవించె ననుకొందము. అపుడు దేవదూతల బూరల ధ్వనులు వినబడును. దాని నాలకించి యెల్లరు లేచి వెళ్ళెదరు. తీర్పుదినమునందు వారివారి పుణ్యపాపముల విషయమై విచారణ జరుగును. పాపాత్ములను నరకమునకుం బంపెదరు. అదియు శాశ్వతంబుగ నుండును. అనగా నరకము నుండి విడివడి జన్మసాఫల్యమును పొందుట కవకాశ ముండదు. పుణ్యాత్ములు మాత్రము వారిచే నెన్నుకొనబడిన పరలోక రాజ్యముం జేరెదరు. బైబుల్ గ్రంథమున నివియన్నియు పూసగ్రుచ్చినటుల వ్రాయబడి యున్నవి. అపైవిషయములు ఉదహరింపబడినవి కావు. ఎందుకన అంతటితోడనే ఆ దేశపు ప్రజలు తనివిచెందెదరు. అంతవరకది చాలును. అటుపైన ఆ బైబిలునకు సంబంధముండదు. ధర్మసారమును బోధించుచున్న మాష్టరుగారికి ఆ తరగతికిందగిన విషయములే తెలియుచుండును. పై తరగతిలోని సంగతులను వివరింపజాలరు. అటులనే భువర్లోకపర్యంతము బైబిలుగ్రంథము వివరించియున్నది. భూలోకమునకు పైనున్న లోకము భువర్లోకమైనందున దానిని పరలోకముగను బైబుల్ తెల్పుచున్నది. అదియు న్యాయమగు విషయమే యగును. ఆ పరలోకమునకు పైగానున్న సువర్లోకము పరలోకముగా నిర్ణయించిన హిందుమతము — బైబిలునందు

లేని విషయములను ప్రవచించుటకు అర్హమైయున్నది. ఎందుకన క్రైస్తవుల పరలోకమునకు పైనున్న పరలోకవిషయంబొకటి కలదని బోధించినమతము హిందుమతమైనందున ఆ మతమునకు ఎన్నియో క్రొత్త విషయములు తెలియుటకు వీలగుచున్నది. బైబులునందుదహరింపబడిన శాశ్వతనరకమున కర్థము — ప్రళయకాలము గతించిన పిదప మరల భూలోక మేర్పడువరకు — అనుచు హిందుమతము వివరించియుండెను. కావున వారి దేవునిచే స్వర్గమునకును నరకమునకును పంపబడినవారలగుచు క్రైస్తవులు - పునఃప్రపంచము అనగా మరియొక జగము ఏర్పడువరకు అందందలి సుఖములను మరియు దుఃఖములను అనుభవించి నూతనప్రపంచము సృష్టింపబడినపుడు మరల నావిర్భవించిన హిందుదేశమునందు జన్మింపగలరు. అంతట ముక్తిసాధనముల నభ్యసించుచు మోక్షసామ్రాజ్యము ననుభవింపగలరు.

క్రైస్తవులకును హిందువులకును సిద్ధాంతములయందెంతటి వ్యత్యాసమున్నదో గమనించియుంటిరి కదా!

ఏకాంతస్థలమున నొంటరిగా కూర్చొని ఆత్మనిష్ఠను అభ్యసించినయెడల మనయందున్న ప్రకృతి సొమ్మసిలినదై తన పతియగు పరమాత్మవైపునకు ఒరిగియున్నప్పుడు జగజ్జననియొక్క కరుణాకటాక్షవీక్షణము మనయందు ప్రసరింపగలదు. అయితే ఆ జగజ్జనని తన సంబంధమగు కేంద్రము నొకదానిని మనయొద్ద నిల్పియున్నది. మనలను కనిపెంచినట్టి తల్లియే ఆ కేంద్రము. కావున మాతృసేవాపరాయణులమగుచు తన్మూలమున నామెను మెప్పింపవలెను. వెంటనే మనలను అనుగ్రహింపగలదు. ఈ కార్యక్రమం బంతయు నెరవేర్చుకొనక మోక్షప్రయత్నములు గావించుచున్నను అవి యెంతమాత్రము ఫలింపజాలవు.

విజయవాడ వాస్తవ్యులు మదరాసునకు టెలిఫోన్ చేయవలెనని తలచియుందురనుకొందము. నేరుగా ఆ నగరములలోని టెలిఫోన్ ఆఫీసువారితో ప్రసంగించగలమా? మన పట్టణమునందు కేంద్ర

ముగా నెలకొల్పబడిన టెలిఫోను ఆఫీసునకు వెళ్ళి అందలి అధికారులను మంచిచేసుకొనినగాని మన పనిని నెరవేర్చుకొనజాలము. అటులనే యింటియందున్న తల్లిని మంచిచేసికొనినగాని అనగా ఆమెను సేవించి యాశీర్వచనమును పొందినగాని జగజ్జననియొక్క అనుగ్రహమునకు పాత్రులము కాజాలము. పూర్వకాలమున జరిగిన యొక చరిత్రను దెలియుదము-

శ్రీ శంకరాచార్యస్వామి బాల్యమునందే సన్యసింపగోరెను. అతడెంతగా పండుపండిన ఘటమో యూహింపుడు. సర్వసంగపరిత్యాగమును చేయుటకై సిద్ధపడిన జ్ఞానమునుపొందియు తనంతటతానే సన్యసింపలేకపోయెను. ధర్మమును గుర్తించినట్టి వ్యక్తియైనందున బాల్యమునుండియు తల్లిని మిక్కిలి ప్రేమించుచున్నవాడగుచు వినయ విధేయతలతో సేవించుచుండెను. అనగా మాతృవాక్యముల నడుగు దాటక వర్తించుచుండెను. తత్ప్రభావమున ఆమెకు అతనియందెంతయో కరుణకలిగెను. ఒకనాడు ఆతల్లితో బాటు తానును స్నానార్థమై నదీతీరమున కేగెను. అతడు స్నానము చేయుచుండగా నతని పాదమును మొసలిపట్టుకొనిలోనికి లాగుకొనిపోవుచుండెను. వెంటనే- "అమ్మా! మొసలి నన్ను పట్టుకొనినది. ఇక నేను బ్రతుకజాలను. ఆ లోపలనే సన్యసించెదను. ఆజ్ఞ నొసగు"మని యడిగెను. తల్లి కరుణించి సెలవొసంగెను ఆ యాజ్ఞను గైకొనుచు వెలుపలకు సన్యసింపకున్నను లోలోన సన్యసించితినిని నిశ్చయించుకొనెను. అంతట దైవవశమున మొసలి విడిచివెళ్ళినది. ఒడ్డునకువచ్చి కాషాయవస్త్రములం ధరించి సన్యాసియయ్యెను. సన్యశించుటకునయినను తల్లియొక్క ఆజ్ఞ కావలసివచ్చినది. ఇక గృహస్థధర్మములయందు వర్తింపదలచినపుడు మాతృవాక్యములను ఏరీతిగ ననుసరించుచు వర్తింపవలెనో పై కథ మనకు మార్గదర్శకమై బాగుగ హెచ్చరించినది.

తల్లికి పాండిత్యము లేకపోవచ్చు - కుమారుడు పండితుడు కావచ్చు. అతడు తనతల్లికి లోకువగనే యుండవలెను. ఈ విషయమున విద్యాబుద్ధులతో నిమిత్తములేదు. మాతృవాక్యనే - వేద

వాక్యము. జగద్గురువులైనందున శ్రీ శంకరాచార్య స్వాములు మానవజాతికి ప్రథమ ధర్మముగా సైనీతిని బోధింపదలచి ముందుగ తానాచరించి యుండెను. ఆరీతిగ వ్యవహరించిన మనుజులు ధన్యులు కాగలరు. ప్రకృతమునకు సత్తము. సూక్ష్మ దేహమునకు కారణభూతైన మాతృదేవియొక్క మన్ననలను - అందుకొనినవారికి - ఆ జగజ్జననియొక్క అనుగ్రహము కలుగునని భావము.

ఎపుడు ఆ ప్రకృతిమాత ఆత్మయందు నిశ్చలమై ఒకవిధంబగు సుత్తును జెందియున్నదో అపుడు ఆమనసుయొక్క చాంచల్యము మఱుమాయ మగును ఆ కారణముచే నానందము పొంగి పొరలుచుండును. అట్టిదానిని చవిజూచిన పిదప ప్రపంచభోగముల ననుభవించుట యందు ప్రేమ యుదయింపనేరదు. అయినను దేహమున్నంతవరకు ప్రకృతికి సంబంధించినట్టి విషయములలో మనసును మార్చక విడనాడగలమా?

కనుకనే తమతమ దేశప్రకృతుల ననుసరించి యేర్పడిన శరీరములందలి మనసులకుం దగిన ధర్మము లెవ్వియో వానివిషయమై ఆదేశములోని మతములను అడిగి తెలిసికొనవలెను.

అనగా — ఏపనిని జేయవలెననినను స్వతంత్రించుకొనరాదు. మతమున నేరీతిగ నుపదేశింపబడెనో ఆదేరీతిగ వ్యవహరింపవలెను. ఆ స్థితియందు జగత్కార్యములను జేయుచున్నను గోచరించినను ఆ పనులతో వారికి సంబంధము లేనట్లే యుండును. ఎందుకన వారు తమబుద్ధితో జేసిన పనులుగా భావింపకుండిరి. దేవదేవునిచే నాజ్ఞాపింపబడి పనులను చేసినపై వారికి కర్తృత్వ మెక్కడిది! కావున ఫలమునైనను వారికి సంబంధించియుండదు. అయితే — ఆ ఫలమును అనుభవించువా రెవరు? అని ప్రశ్నింపుడు పురికొల్పిన వ్యక్తి దేవుడైనందున అతడే అనుభవింపగలడు. ఏరీతిగ ననుభవించునని యందురా! జీవరాశియం దంతటను నిండియున్న కారణముచే తత్ఫలములను - ఆ యా జీవులచేత ననుభవింప జేయును - తాను అనుభవించినటుల తనివి జెందును. ఇంతకును ఆ యోగులును వర్తించునట్టి వ్యక్తులకు స్వకీయమునైన పనులు లేవనియా? కాదు, బాహ్య

మున జరుగుచున్న పనులందు తమకు సంబంధము లేని కారణముచే - దేహమందే మనసును నిల్పుచు - లోలోపలి కార్యములను జేసుకొన వచ్చును. అదియే జీవునకు స్వకీయమగు కార్యము. దానినే అంతర్ దృష్టి యనెదరు. అట్టి దృష్టితో గావింపబడిన పనులు ఇతరులకు తెలియ బడనియట్లు చేయుట కారణముచే ఆ కృత్యము దొంగవాని పని వలె సిద్ధ మగుచున్నది. అందుకనియే జీవులు దొంగలవలె వ్యవహ రింపవలెను.

ఎట్లులైన నేమి ? ఆత్మయను వాడు మన కెవ్వరికిని కానరా కుండ దాగియున్నందున నతడును పెద్ద దొంగయైయున్నాడు. వానిం బట్టుకొనుటకు దొరతనము ఉపయోగమై యుండదు. కనుక మన మందరము దొంగతనము నేర్చుకొని _ ఆ పెద్ద దొంగను - అనగా దేవ జీవునిం బట్టుకొని యానందింపవలెను. దేవుడు మన చేతికిం జిక్కినప్పుడు — అంతకు మించిన యానంద మేమి కలదు ? మన మాచరించిన పాపము లెందుబోయినవి _ అని మరియొక సంశ యము కలుగును.

ఎప్పుడు దేవ సన్నిధికి జేరితిమో - అపుడే దయామయుండగు దేవుడు మన పాపరాశినంతయు మనకుం దెలియనీయక - లోపలనున్న పాపములను లోపలనే అపహరించి వైచును. ఈ రీతిగ పాపచోరుడు అను - బిరుదమును సైతము పొందును.

ఆ గజదొంగకంటె నధికుడగు చోరుడు ఈ ధరాతలంబున నుండబోడు.

## మనస్తత్వము

మనసుయొక్క జాతిని-ఎవరు బాగుగ నర్థము చేసికొనగలరో- అట్టివారలు మతరహస్యములను బాగుగ గుర్తింపగల తెలివిని ఆర్జింప గలరు.

(1) మనసునకు బాహ్యదృష్టి యొకటియు -

(2) అంతర్దృష్టి వేరొకటియు

ఈరీతిగ రెండురకములగు చూపు లున్నవని యెఱుంగుడు. ఈ ప్రపంచమువంక మన దృష్టిని మరలించినపుడు — ఆ చూపును బాహ్యదృష్టి యనెదరు. వెలుపలం జూడక లోపలి భాగముననే నిలువ గలిగిన యెడల నద్దానిని "లోజూపు" అనెదరు.

అంతర్ దృష్టి యనినను, లోజూపు అనినను ఒక్కటే యగును. మనసునకు రెండు దృష్టులున్నందున రెండు రకముల పనులం జేయ గల్గును. ఆ సమయమున దానికి సహాకరించువారెవరో తెలియుదము. లోజూపు కలిగినపుడు ఆ తావున ఆత్మయనునది, పతియైయుండి సహాకరింపగలదు. బాహ్యమునకు వచ్చినపుడు జీవుడనువాడు భర్తగా నేర్పడి శబ్ద స్పర్శ రూప రస గంధాదులం జేర్చుకొనుచు నానందింప జేయును. విశేషముగ జగత్ కార్యములయం దలవడినదై ఆ మనసు వెలుపలి భాగముననే నిల్చినదగుచుండును. సారాంశమున మనసు నకు ఇరువురు భర్తలుండిరని తెలియ గలిగితిమి.

(1) మనసు తన దృష్టిని వెలుపలకు మరల్చినపుడు జీవుడు భర్తయై యుండుననియు—

(2) తన దృష్టిని లోపలికిం దిప్పినపుడు దేవుడు భర్తయై వెలయుననియు — గుర్తునం దుంచుకొనుట మేలు.

లోభాగమున అనగా ఏకాంతస్థానమున మరెవ్వరును లేరని యెఱింగి మనసు ఆయాత్మతోడనే యొంటరిగ నుండినదై క్రీడించు చుండును. అట్టి కృత్యమును ఆత్మరతి యనుచు శాస్త్రములందు వ్రాయబడి యున్నది.

(1) దేహమునకు వెలుపలి భాగమునుండి లభించునది విషయ రతి యనియు, భోగరతియనియు రెండు పేర్లచే వాడబడు చుండును.

(2) శరీరమున లోభాగమందు లభించునది ఆత్మరతి యనియు, నిర్విషయ రతియనియు పేర్కొనబడుచుండును.

## స్త్రీ జాతియొక్క స్వభావము

స్త్రీ జాతియొక్క గుణమును వీక్షింతము. పతికంటె తనకు అన్యముగుగతి యుండదని యెంచి సతతము అతనిని దర్శించుటయో-లేక అతని పనులను నిర్వర్తించుచుండుటయో- అదియుంగాక- పతనితో సల్లాపములగావించుచూ - దూరదేశమున కేగినయెడల - పతనినే సతతము జ్ఞప్తియం దుంచుకొనుటయో - ఈ రీతిగ - చేపవలె గొట్టుకొనుచుండును. తన యోగ్యత వలన భర్తకు కీర్తిం దెచ్చును. అయోగ్యురాలగునేని తన భర్తను కాకుల పాలు చేయును. ఎవ్విధముగనైనను - తోచి తోచని తెరంగున భోగ లాలసురా లగుచుండును. నిజమారయ - ఇంటి సౌభాగ్యమంతయు స్త్రీలదిగాక పురుషుని దగునా!సర్వము స్త్రీ మయం బనుట యుక్తము. ఆ భామామణిని గాంచి లోకము మోహింప బడును. లోకమును నశింపజేయ దలంచినయెడల - స్త్రీలను ఇంటియందుంచక వెలుపలకు బంపినం జాలు. వారు ఎట్టిపనులనైనను సమకూర్చుకొని రాగలరు. కనుకనే వ్యాపారస్థులు స్త్రీలను దుకాణములం దుంచెదరు. అన్యమతమును లేక అన్యరాజ్యమును నశింపజేయ నభిలషించువారు స్త్రీలను పరిచారకులుగ నుంచుకొనెదరు. అయితే - నిప్పువంటి స్త్రీ లున్నయెడల- లోకమున కెంతయో మేలు సమకూరగలదు. కావున స్త్రీలను పతివ్రతలుగా జేయుటకుగాను హిందుమతము తగినంత కృషిని జేయుగల్గినది. ఆ మతమందున్న విశేషము యిదియొక్కటేయని చెప్పిన జెప్పవచ్చును.

స్త్రీ లేనియెడల లోకమే లేదు. జగమంతయు స్త్రీప్రాయమై యున్నది. ఈదృష్టిలో లోకములోని పురుషులందరు స్త్రీలై యుండిరి. ఇక పురుషు డెవ్వరన దేవదేవు డొక్కడే పురుషుడు. తదితర లోకమంతయు స్త్రీమయము.

స్త్రీయొక్క మహిమ యింకను మరెంతయోకలదు. చూడుడు.

రతి శబ్దమున కెన్నియో మంచి యర్థము లున్నవి. కాని ఆయర్థముల నన్నిటిని నశింపజేసి — స్త్రీలకు సంబంధించినదే "రతి" అను ప్రఖ్యాతి కల్గినది. వింటిరికదా స్త్రీ జాతియొక్క మహిమ! సర్వమును నశింపజేయగల శక్తిస్వరూపిణి యనుట కెంతసాక్ష్యము వెనుదీయ నవసరములేదు. స్త్రీ యనగా రెండువైపుల పదునుగల కత్తి. స్త్రీలతో సంబంధించినదగాక "రతి" యను శబ్దము ఇంకను మరెన్ని తావులలో ప్రయోగింపబడినదో చూతుము.

కాంతారతికి అనగా భోగరతికి భిన్నమైనవి-విద్యారతి- యోగరతి - ఆత్మరతి మున్నగునవి మరెన్నియో కలవు. అవియు ఆనంద హేతువులై యున్నవి. కాని ఆత్మరతియం దున్నంత ఆనందము ఇంతింతయని వచింపజాలనంత మహిమతో విరాజిల్లుచుండును.

కనుకనే మనసు అనునది స్త్రీవేషమును వేసి అనగా స్త్రీగా సిద్ధమై వ్యవహరింపసాగినది. అందుకై ముందుగా ఆత్మను పెండ్లాడి ఆ పెండ్లికొడుకుతో నానందమును పొందుచుండెను. ఎంతకాలమునకును ఆతనిని విడనాడి యీవలకురాజాలకున్నది. ఎటులనో ఎప్పుడో బలవంతముగ నొకమారు వెలుపలకు వచ్చుట సంభవించినది. వెంటనే జీవునితో స్నేహ మేర్పరచుకొనెను. మరియు క్రీడింపసాగెను. ఆమెతో రతిని గావించుచున్న జీవుడు - ఆనందమయుడై అటులనే నిల్చిపోవుచు నన్యమనస్కుడై యుండెను. కాని - జీవుని పెండ్లాడి - అతనితో వ్యవహరించుటకు నేర్చుకొనియున్నను - ఆదినుండియు ఆత్మతో క్రీడించునట్టి యనుభవ మున్నందున - పూర్వవిశ్వాసబలముచే - నప్పుడప్పుడు ఆత్మనైపునను పొందిపొంది దర్శింప నెంచుడు.

(1) ఆత్మేశ్వరునితో యోగించుటయు | (2) జీవేశ్వరునితో భోగించుటయు.

నీరీతిగ ఎద్దియో యొక పనియందు నిమగ్నమై యుండుటే- ఆ మనసుఅను స్త్రీ జాతియొక్క స్వభావమై యున్నది.

మనసు అనినను మాయ అనినను ఒక్కటే. కనుక మనసును స్త్రీగా భావించుట సమమై యుండదు.

ఆత్మను చేరినపుడు అట్టి కృత్యమును సంయోగ మనెదరు. సంగమంబనియు రెండవ నామమున బిలువబడు చుండును.

జీవసంబంధమగు పనులన్నిటిలో రతికర్మ ప్రధాన పాత్రను వహించుటం జేసి - మనసు - తన జీవేశ్వరునితో నేకమై సంభోగము అను రతియందు అతనిని బంధించి వైచును.

(1) యోగము - సంయోగము- సంగమము- అనునవి ఆత్మకు (పరమాత్మకు) సంబంధించియున్న కార్యములు.

(2) భోగము - సంభోగము- సంపర్కము అనునవి జీవునకు సంబంధించిన కృత్యములు.

పై పనులలోనున్న భేదమును చదువరులు బాగుగ నర్థము జేసికొనవలెను. దేవతా సంబంధములగు చరిత్రలను వెల్లడించుటకు పూనిననాడు - స్త్రీ పురుషుల ఐక్యవిషయమున -

## యోగ, సంయోగ, సంగమ శబ్దములు

ప్రయోగింపబడుచుండును. ఆస్త్రీలు (దేవలోక స్త్రీలుగాని - మానవ స్త్రీలుగాని,) సంగమునకే యుపయోగ పడుదురు. అనగా దేవతలు దేవ జాతికి సంబంధించియున్న ఒకానొక వనితనుగాని - మానవ జాతియందున్న స్త్రీనిగాని - దర్శించి వారియందు సంతతిని ఘటింపవలెనని నిశ్చయించిన యెడల - ఆ స్త్రీలతో సంగమించెదరు. అనగా సంయోగమును చేసెదరు. అంతియే కాని - సంభోగమును గావింపబూనరు.

సంయోగము- సంగమము అను శబ్దములయొక్క అర్థమున్ను, సంభోగము, సంపర్కము అను శబ్దముల అర్థమున్నూ, వేరుగా నుండును. అదెట్లన - సంయోగమందు అనగా సంగమమందు స్త్రీ పురుషుల శరీరములు కలియవు. పురుషులు తమ సంకల్ప తేజమును స్త్రీలపై ప్రసరింప జేయుటచే జరుగును.

ఆ ప్రక్రియను యోగ సంబంధమని నిశ్చయింపవలెను.

అంతియేకాని - భోగసంబంధమని తలంచరాదు. మానవులు తమ స్త్రీలయందు సంతతిని గనవలెనని నిశ్చయించిననాడు - తమ దేహములను స్త్రీల దేహములతో జేర్చుచుందురు. దీనిని విషయ భోగ మనెదరు. కనుకనే భోగించుట అనిగాని, సంభోగించుట అని గాని వాడబడుచుండును.

(1) దేవతాసంబంధమగు రతిని యోగ రతి యనెదరు.

(2) మానవ సంబంధమగు రతిని భోగ రతి యనెదరు.

కనుకనే శ్రీ శంకరాచార్యస్వామి-

యోగ రతోవా } అను పదములను వేరువేరుగా వాడి
భోగ రతోవా } యున్నారు.

పై రెంటిలో రతి అను పదము మాత్రము ఒక్కటిగ నున్నది. అయినను యోగశబ్దము, భోగశబ్దము } అనునవి భిన్న శబ్దము లైనందున-

(1) సంయోగ (సంగమ) కార్యము అనునదియు,
(2) సంభోగ కార్యమనునదియు

వేరువేరైన ప్రక్రియలుగా నెంచబడుచుండును.

తనలో తాను రమించునప్పుడు కూడా దానిని ఆత్మరతి యనెదరు లేదా యోగరతి యనెదరు.

(1) స్త్రీలను యోగదృష్టితో పొందగలవారుందురు.

(2) భోగదృష్టితో కూడా పొందుచునుందురు.

ఆ రెండు ప్రక్రియలు సంతతిని కనుటకు భిన్నసాధనముగా నున్నందున

సంగమ మనియు } వేరు వేరగు పేర్లచే పిలువబడు
సంభోగ మనియు } చుండెను.

సంకల్ప తేజమును స్త్రీలపై ప్రసరింప జేసినపుడు యోగరతి యనియు

శరీర సంబంధమగు వీర్యమును ప్రసరింప జేసినపుడు భోగ రతి యనియు వ్యవహరించెదరు.

దేవు డొకమారు పరిశుద్ధురాలగు ఒకానొక తపస్సంపన్నురాలకు ప్రత్యేకమైన సంతతి కల్గునను వర మొసంగె ననుకొనుడు. ఆ దేవుని దృష్టి - స్త్రీ పైన ప్రసరింపజేయబడినందున దానిని యోగ రతి యనెదరు. పై వ్యత్యాసముం దెలియక, సూర్యభగవానుడు కుంతితో సంగమించెను అను ప్రయోగమును గాంచిన వెంటనే సంగమ శబ్దమున కర్థముం దెలియనివారు - ఆమెతో సంభోగించెను అని భావించుచుందురు. భారతమున సూర్యుడు కుంతితో భాషించు నపుడు-

"సంగమం త్వయా"

అను పదములు ఉపయోగింపబడినవి. నీతో సంగమించెదను అని దాని యర్థము. పాపము! సంస్కృత భాషా పరిచయము పూర్ణముగ - నెరుంగని వారు అహో! సూర్యుడు కూడా మనసును బట్టజాలక-స్త్రీలోలు డయ్యెను. ఇక మనబోటివారు ఇంద్రియ నిగ్రహము నేల జేయగలరు. బ్రహ్మకైనా పుట్టు రిమ్మ తెగులు అను వాక్యముల లోని సత్యార్థమును గుర్తింపజాలక తాముకూడ వ్యభిచరింప వచ్చునని తృప్తి పడుచుందురు. దేశమున కీ దుర్గతి సంభవించినది.

☞ 'సూర్యభగవాన్' అను గ్రంథము రానున్నది. సూర్యుడు కుంతీ దేవితో భాషించుటకు వచ్చిన సమయమందు యోగశబ్దము మూడుమార్లు వాడబడియుండెను. భోగించుటకు వచ్చిన మాట సత్య మగునేని — భోగశబ్దము ప్రయోగింపబడును. కాని అటుల నుపయోగింప బడక—

"యోగేన"

అనుమాట నుపయోగపరచుచు భారత గ్రంథకారులు ప్రకటించియుండిరి. ఈలాంటి ఋజువులెన్నియో "సూర్యభగవాన్" అను గ్రంథమున ధృవపరుపబడియున్నవి. ప్రతి భారతీయుడు ఆ గ్రంథమును విధిగ చదివి తీరవలెను. ఇంతయేల! సూర్యుడు భోగలాలసుడై యుండెనేని — భోగశబ్దమే వాడబడియుండును. అరీతిగ భారతమున చిత్రింపబడలేదు.

తాను భారతీయుడై జన్మించియు — నిత్యము లెక్కలేనన్ని పనులం జేయుచు — జీవితమును ధారవోయునట్టి వ్యక్తిగానుండియు — ఇక్కాలమున నన్యులచే వేయబడుచున్న ప్రశ్నలకు జవాబు చెప్ప లేనంత దుస్థితిని అనుభవించునట్టి దుర్దశను— అనగా— దౌర్భాగ్యమును పొందియుండెకదా! ఇంకను బ్రతుకు టెందులకో!

అప్పుడప్పుడు మన దేహమున లోభాగమందు నిల్చియున్న మనసు వెలుపలకువచ్చుచు మరల లోనికిం బోవుచుండును.

అనగా బాహ్యప్రపంచ విషయములం దెలియవలెననియు జగమును దర్శింపవలెననియు తహతహ లాడుచుండును. అందుకై జ్ఞానేంద్రియములను సాధనముగా గైకొనును. ఇంతలో చిరకాలమునుండి పరిచయముగల్గిన ఒకానొకవ్యక్తి అనగా జీవుడు మార్గమధ్యమున గోచరించును. వెంటనే అతనిని తనవానిగా నెంచుకొని — కౌగలించుకొనుచు యానందించుచుండును. అదిమొదలు జీవితమునకు సంబంధించియున్న పనులం జేసికొనుచు పై

దంపతులిరువురు సంసార నిమగ్నులై యుందురు. కాని అందు లభించుచున్న సుఖముకంటె- దుఃఖము అతిశయించియున్నందున విరక్తి జెందుచు మరియొక సాధనముకై యత్నింపవలసి వచ్చెను.

కావున లోకవృత్తాంతములను దూరముగ బారవైచుచు-మనసు మాత్రము వెనుకకుం దిరుగును. అనగా లోనికింబోవును. లోభాగమున ఆనందప్రాప్తికొరకు వేరొకసాధనము గోచరింపదా - యని దాని యాశయము. లోనికింబోయినకొలది పరమాత్మయొక్క సామీప్యమేర్పడును. తత్కారణమున మెల్లమెల్లగా సాన్నిహిత్యమేర్పడి (?) మత్తువచ్చినరీతిగ సతినివైపునకు ఒరిగిపడిపోవును. ఆ సమయమున మనసుయొక్క దశ యెటులుండునో తెలియునా? ముకుళించుకొనిన (ముడుచుకొనిపోయిన) పువ్వువలె తానును ముకుళించుకొనును. దానినే ముకుళితావస్థ యనెదరు.

ప్రకృతమునకు వత్తము. చిరకాలమునుండి ప్రపంచ విషయములపై ప్రసరించుచున్న మనసు ఆ వైపునకుంబోక - లోనికింబోయి ముకుళించుకొనెనని వింటిమి. ఇక పనుల నెవ్వియుం జేయదా యేమి! ఇంకను పనులెక్కడివి? అన్నిటిని ముగించుకొని యేకాంగియై అటులనే నిల్చిపోవును. ఆ స్థితిలో - ఎవరైన నొకరు తోడు నిడయై యుండిన నెంత బాగుండు! అవును. ఒకరుండియే యున్నారు. వారెవరు! ఆతడు పెండ్లి కొడుకు (వరుడు). అహో! ఆమె పెండ్లి కూతురు (వధువు) కాబోలు!

"ఏకాకీ లోకరక్షకః" అన్నట్లు ఏకాకియైయున్న పరమాత్మయే ఆ పెండ్లికొడుకు. మనసు అను వధువు కూడా ప్రపంచ సంబంధమగు బాంధవ్యమును (పుట్టినింటిని) విడనాడి- అనగా లోకవ్యవహారముల నన్నింటిని విరమించుకొని- ముకుళించుకొనిన దశను పొందినదైన కారణమున తాను కూడా, ఆ వరునివలెనే యేకాకి యగుచు- ఆ యిరువురు వధూవరులు - ఐక్యమగుచుండిరి. నిజమా రయ వధూవరులు ఐక్యము కాక తప్పునా!

ఇదే విషయమును వేదాంతులు లోకగానము క్రింద జేర్చి-పాడుచు నానందించుచుందురు. ఒకమారు ఆ గానరసమును గ్రోలుదము-

పల్లవి : నీకూ నీవారు లేరూ
నాకూ నావారు లేరూ
ఏటియొడ్డునా గుడిసె కడదాం పదరా
చల్ మోహనరంగా.

అనునదే ఆ గానము.

| | |
|---|---|
| నీకూ<br>నీవారు<br>లేరు | ఓ పరాత్పరా! నీతో సంబంధించిన వ్యక్తులెవరుండిరి? ఎవరును లేరు కదా! కనుకనే ఏకాకివై యుంటివి. |
| నాకూ<br>నావారు<br>లేరు | ఇక నా విషయమై వినుము. శబ్ద స్పర్శ రూప రస గంధములు అను విషయములతో సంబంధమును కల్పించుకొని యెన్నియో రీతుల సుఖ దుఃఖముల ననుభవించితిని. కాని యిపుడు వాని నన్నిటిని అనగా నా బంధుజాలము నంతయు విడనాడి నీ వలెనే నేనును ఏకాకినై నీ కడకు వచ్చియున్నాను. |
| ఏటి యొడ్డునా<br>గుడిసె<br>కడదాం<br>పదరా | ఇడా, పింగళా, సుషుమ్న అను నాడులను గంగా, యమునా, సరస్వతులు అనునదులుగా పోల్చుకొనుచు ఆ మూడునదులు(నాడులు) భ్రూమధ్య స్థానమున నొక్కటిగా జేరియున్నవి. |

వాని సంగమస్థలమునకు ఆవలియొడ్డుగానున్న చోటున జేరుదము.

అచట బ్రహ్మానంద మనుభవింపగలము. కావున నాతావునకుం బోవుదము. ఆ యేటియొడ్డున ముక్తి కాంతామనోమోహనం

బగు మహత్తరమైన పర్ణశాలను (గుడిసెను) అనగా సహస్రారమును గట్టిగా నుంచుకొని అందు నానందించుచుందము. ఓయీ! పరంధామా! ఆ పరమపదమునకు వేవేగపోవుదము. ఆలస్యమేల పదరా! ఓ పరాత్పరా! అనుచు స్త్రీత్వమునుపొందిన మనసు - తన విరహవేదనను ప్రకటించుకొనియుండెను.

“ఆత్మీయులారా? భోగసంబంధమగు విరహవేదన యొక్కటే కాదు, పరమపదమును జేరుటకును సైతము యోగసంబంధమగు విరహవేదనముకలదు” అనుచు జ్ఞప్తికిందెచ్చుకొనుడు. హిందుమత సాంప్రదాయములలో నిదియొక్కటి ముఖ్యముగ గమనింపదగిన విషయము.

| | |
|---|---|
| చల్ మోహన రంగా | ఓ మోహనరంగా — లోకమునంతయు మోహింపజేసిన ఘనుడవు నీవు. ఆలస్యమేలజేసెదవు. ముందుకునడువుము. అనుచు మనసు - తెనపతిని - హెచ్చరించినది. |

రాబోవు గ్రంథములలో చల్ మోహనరంగ యనుపాటయందున్న మిగిలిన చరణములకు అంతరార్థము విశదీకరింపబడును. వానిం దెప్పించుకొని ప్రతిగ్రంథమును మొదటినుండి చివరివరకు పలుమారులు చదివి - పఠించిన దానినంతయు మనసున జీర్ణంపజేసికొనుచు, పుత్రమిత్రకళత్రాది బంధువులను కలిసినప్పుడెల్ల ఈ విషయములనే జ్ఞప్తికిం దెచ్చుచు హిందు మత ప్రబోధమును గావించుచుండుడు. నావలె మీరెల్లరు మత ప్రచారకులై యుండవలెనని- నా యాశయము. వివాహాది శుభకార్యములలోను దేవుని యుత్సవములందును, సప్తాహములు జరుగుచున్నపుడును హిందుమత ప్రబోధము విధిగా జేయుచుండవలెను. అందుకై ఉపన్యాసములం జేయించు కర్తలం గలసి వారిని ప్రోత్సహించుచు - మత ధర్మములను - బోధింపజేయుడు. భరత మాతృగర్భమున నుదయించినందుకు ఈ మాత్రమైనను మాతృ ఋణమును తీర్చుకొనవలదా!

పరిష్కృత మనుసరింతము.

కథను జ్ఞప్తికిం దెచ్చుకొందము.

ఒక సతికి ఇరువురు పతులుండిరని వినినపుడు - ఆ చరితము అసహ్యకరముగ నున్నదని నీతివంతులకు దోచును. కానిండు. ఆ కథ లోకసంబంధమగు చరిత్రమై యుండదనియు పై రీతిగ నంతరార్థములతో విలసిల్లు చున్నదనియు నెరింగిన యెడల నింతింతయని వచింప నలవి కానంత సంతోష మబ్బును.

హిందు మహాజనులారా! అన్యుల దృష్టిలో "హిందువులు మంద మతులు" అను వాదం బొకటి యున్నది. వారి గ్రంథములలో నా రీతిగ వ్రాసియున్నారుకూడా. అది న్యాయమనియే నాకును తోచుచున్నది. ఎందుకనెదరా? ఈ నాటికి- కోటిమంది హిందువులు తమ మతమును విడనాడి అన్యమతమున జేరియున్నను - హిందువు లకు చైతన్య మనునది కలుగకపోయెను. అట్టివారిం బట్టుకొని మందమతులని వర్ణింపరా యేమి?

(1) ధనికునకు ధనము లేనివానిం జూచిన ఎంత యసహ్యమో-

(2) విద్యావంతునకు విద్యలేనివానిం గనినపుడు- ఎట్టి చులకన తన మేర్పడునో-

(3) పాలకులకు పాలితులయందు ఎంతటి యల్పబుద్ధి యుద యించునో-

(4) అటులనే స్వమత ప్రచారమును విరివిగా జేయించుచున్న విదేశమతములవారు స్వమత ప్రచారమును జేసికొనలేని హిందువులం గాంచినపుడు "మందమతులు" అను బిరుదము నొసంగరా యేమి.

ఇంకను వారు గావించుచున్న నేరములంజూడుడు "జనానా ప్రీచింగ్" అను పేరుపెట్టుకొని విదేశీయమతములోనివారు - మన యిండ్లలో దూరుచున్నారు. తమ మతమును ఆడవారికి బోధించుటకు

గాను ఆడవారే తెల్లబొన్నల రూపములుదాల్చి మనయిండ్లలోజొర బడుచున్నారు. "జనానాప్రీబింగు" అని పేరుపెట్టుకొని ఇట్టి పనికి మాలిన ఉద్యమములను లేవదీసిరి. ఇందలి తత్త్వమును వినుడు. పూర్వకాలమున విదేశములందు ఆదాము - హవ్వ - అను వారు ఇరువురు సృష్టింపబడిరి. ఆదేశపు దేవుడు వారివద్దకువచ్చి - ఓదంపతులారా! ఈ వనమునను్న వృక్షములలోని ఫలముల నెన్నియైనం దినుడు. కాని ఫలానా వృక్షమున పండినపండ్లను మాత్రము భుజింపవలదని హెచ్చరించి- తనతావునకుంబోయెను. ఆదేవుని యాజ్ఞలను మన్నించుచు- నా దంపతులు అతని మతమునసే నిల్చియుండిరి. సైతాను అనువాడొకండుకలడు. అతడు విదేశ దేవునకు ప్రబల శత్రువు. కనుకనే యొకదినంబున ఆదాము హవ్వలు నివసించుచున్న వనంబునకువచ్చి- దేవునిచే నిషేధింపబడిన వృక్షముపైనెక్కి- అచటనే నిల్చియుండెను. ఒకదినంబున ఆదాము హవ్వలు - మామూలుగ వనవిహారముచేయుచు సైతానునిల్చియున్న చెట్టువైపునకు వెళ్ళుచుండిరి. దానింగాంచి సైతాను వారలంబిలచెను. ఓ దంపతులారా! నిత్యము ఇతరవృక్షముల ఫలములం దినుచుంటిరి. ఈ చెట్టు పండునుమాత్రము భుజింపక - వెడలుచున్నారు. దేవుని మతమున నున్నంతవరకు మీగతులు దుర్గతులు. దైవమతమును విడనాడి నా మతమున జేరుడు. కనుక ఇదిమొదలు - ఈచెట్టునున్న పండ్లను భుజింపుడు — అని బోధించెను. ఎవరికైనను చెప్పకుమనుమాటలు చేటు కనుకనే ఆదామునకు సైతాను మాటలు రుచించినవి కాకున్నను- హవ్వమ్మకు బాగుగా నచ్చినవి. వెంటనేయొక పండును కోసికొనివచ్చి — తన పతిచేత బలవంతముగ తినిపించెను. దైవాజ్ఞను ధిక్కరించిన కారణమున వారు పాపాత్ములైరి. దేవుడా విషయమంతయు నెరింగి హవ్వను చెడబడ తిట్టి శపించెను. ఆదాము కూడ శపింపబడెను

మరియు వారి వంశములలో జననమందినవారందరు పాపులయ్యెదరుగాక! అని వారిదేవుడు శపించి వెళ్లెను కావున విదేశీయు

లందరు శాపగ్రస్తులై యుండిరని యెరుంగుడు. తుదకు క్రీస్తుగారు సైతము - వారి వంశములందు జన్మించుటంబట్టి శాపగ్రస్తుడై యుండెనని విశదమగుచున్నది. అందుచే నతడును పాపాత్ముడై యుండెను. ఇవే వాక్యములను రాబోవు గ్రంథమున బైబులునుండి యెత్తి చూపబడును. ఒక్క వనిత - విదేశ ప్రజల నందరిని శాప గ్రస్తులుగ నొనరించియుండెనని యెరుంగుడు.

తన యింటికి తాను నిప్పు పెట్టుకున్నది ఆ స్త్రీ. అట్టి జాతికిం జెందినవారు - హిందువుల యిండ్లలో దూరి బోధించుటకు వచ్చిన యెడల - మన గతులు దుర్గతులక్రిందికి పరిగణింపబడవా? విదేశ స్త్రీలు - సైతానును మించినవారలై యుందురు. మన స్త్రీలు ముఖ్యముగా వారిబోధల నాలకించి విదేశ మతమున జేరితీరెదరు. పిదప తమ కుటుంబములను సైతము ఆ మతమునం జేర్చెదరు. అటు పైన హిందూత్వము చచ్చినట్లే కదా.

కావున తెల్లని దుస్తులను ధరించుచు తమ హస్తములందు మాయాజాలమునకు సంబంధించియున్న పుస్తకములం బెట్టుకొని మీ స్త్రీలవద్దకు వచ్చుచున్నారు. వెంటనే మీ ఆడంగులకు సైతము బుద్ధిచెప్పి ఆయా ప్రసంగములను, పాటలను వినిపింపనీయక గృహరక్షణము గావించుకొనుడు.

స్త్రీలోలురై యున్నవారిగతులను ఇపుడే యర్థముచేసికొన గల్గితిమి. కనుకనే స్త్రీలకు చాలాదూరమున నుండుడని హిందుమతమున హెచ్చరింపబడెను. మొదట నమృతమువలె గోచరించి తుదకు విషముగ పరిణమించునవి స్త్రీల సాంగత్యములు అని యెరుంగుడు. పెద్దల యనుమతిని బడయక - స్వయముగ స్త్రీ పురుషు లిరువురు ప్రేమించుకొని పెండ్లిజేసికొనకయే- గర్భాదానకార్యమును సైతము ముగించుకొనువా రుందురు. ఆరీతిగ — ప్రేమ వివాహములను (లౌమ్యారేజిని) జేసికొనువారిని ఎందరిని జూచియుండలేదు? ఆ పురుషులు స్త్రీలోలురైన కారణముచే దొంగలవలె,చరించి పిదప పెండ్లాడి

యుండిరి. అట్టి దాంపత్యము దైవమునకును, ధర్మమునకును, దేశమునకును ప్రతిబలవిరుద్ధము. కనుకనే - కొంతకాలమునకు విచ్ఛిత్తి సంభవించుచు - వివాహవిచ్ఛేదములు సైతము జరుగుచుండెను. ఇది యంతయు లోకానుభవముగ నుండనేయున్నది.

స్త్రీలు పురుషులను తమవలలోనికిం దింపి-ఎరకై వచ్చిన చేపలరీతి - వారిని హతమొనర్చుచున్నారు. మన హవ్వమ్మ కథయే యిందుకు నిదర్శనము.

ఎంతటి సాహసములేనిది - హవ్వమ్మ తనకై రక్షణమొసంగుచున్న భర్తను అనగా ఆదామును - దైవద్రోహిగా మార్చివేయగల్గెను. దీనింబట్టి - స్త్రీలయెదుట పురుషు లెందులకును పనికిరారని తెలుపవచ్చును. తలచుకొనినయెడల - హఠాత్తుగ పురుషులను పాతాళమునకుం ద్రొక్కగల్గెదరు. వారింగాంచినపుడెల్ల బహుజాగరూకతతో వర్తింపగల చాకచక్యము లేదేని-వారివలలందు జిక్కి హతులు కావలసినదే.

పురుషులారా! మీ స్త్రీలు మీకంటె తెలివికలవారు. చెడ్డ విషయములయందే కాదు. మంచివిషయములందును మిమ్మ మించినవారలై యుండిరి. యోగ్యులగు వనితలు సంభవించినయెడల పురుషులు ఉద్ధరింపబడగలరు. కనుకనే తలిదండ్రులు - తమపుత్రికలను - భయభక్తులందుంచుచు - క్రమశిక్షణముచే యోగ్యులుగ నొనరింపవలెను. అట్టి కన్యలు - అత్తింటికిని పుట్టినింటికిని కీర్తిని తేగలరు.

పురుషులకు రెండుమూడు పెండ్లిండ్లున్నను దోష మాపాదింపబడదు. ఒక స్త్రీ- ఇద్దరిని లేక ముగ్గురిని పెండ్లాడనగునా? కూడదు.

ఒక స్త్రీ - యిరువురను పెండ్లాడెనని మానవచరిత్రలందెందును జూపజాలము. ద్రౌపదికి అయిదుగురు పతులులేరా? యని యెవరైనను ప్రశ్నింపగలరు. కాని వారలు - సత్యము నెరింగినవారు కారు. ఆమె - ఒకానొక మాతృగర్భమునుండి జన్మించినది కాదే.

ఆ విషయమైనను ఎరింగినంజాలు. ఆమె అగ్నికుండమునుండి పైకిలేచిన దేవతాకన్యగానుండెను. క్రీస్తుగారైనను తనతల్లికింబుట్టెను. ద్రౌపదియో- తలిదండ్రులకుపుత్రికను బుట్టినది కాదు. స్వయముగ నావిర్భవించినది. అట్టి తల్లివిషయమై నియమింపబడిన పంచపాండవుల జన్మములు కూడా — విచిత్రముగ నుండును.

ద్రౌపదియొక్క కథయందున్న సంశయములన్నియు తొలగించుకొన నెంచినయెడల—

“ద్రౌపదికి భర్తఒక్కడే” అను గ్రంథమును చదువుము. ఇపుడు తమరు పఠించుచున్న గ్రంథమునకు పిదప—రాబోవుగ్రంథము ద్రౌపదీవిషయమైనదే సుమీ. అందు సందియములన్నియు దీర్చబడును. అవియు త్వరలోనే వెలువడును.

పురాణములలోని దేవతల కథలందెన్నియో కథలు— వేదాంతార్థములతో విలసిల్లుచున్నవి. వానిం దెలియగల తెలివినిమాత్రము కల్గియుండవలెను.

శ్లో॥ ఇతిహాస పురాణాభ్యాం
వేదాంతార్థః ప్రకాశ్యతే
(భాగవతమునకు — శ్రీధరీయ వ్యాఖ్యానము)

ఇతిహాస = భారత, భాగవత, రామాయణములు ఇతిహాసములని పిలువబడుచుండును, అట్టి గ్రంథములలోని కథలున్ను,

పురాణాభ్యాం = పురాణములయందుదహరింపబడిన చరితములును,

వేదాంతార్థః=వేదాంతార్థములతో-అనగా అంతరార్థములతో

ప్రకాశ్యతే = నలరారుచున్నవి.

అనుచు పై శ్లోకమున వివరింపబడెను.

విచారింప ఆదియందు ఆత్మయనునది ఒక్కటే యుండెను. కాలము గతించినకొలది ఏదోయొకసమయమున ఆ యాత్మ తాను తనుగానేయుండి - మరియొక ఆత్మగా భాసింపగల్గెను. దేవుడు సర్వ శక్తుడు అని పిలువబడుచుండెనుకదా. అటిస్థితిలో - తాను తనుగానే యుండి అనగా ఏలాటి మార్పును పొందక రెండవయాత్మగా నెటుల నేర్పడెను? అను ప్రశ్న పుట్టుటకు హేతువే యుండదు. ఎందుకన సర్వ శక్తి గలవ్యక్తియై నందున - తాను మారకయే మరియొకవిధంబుగ రాణింపగలడు. అట్టి తెలివితేటలు దేవునకు లేనపుడు మనవలె నశక్తుడై యుండెనని వివరింపవలసివచ్చును. కావున-ఒకే యాత్మ రెండుఆత్మలుగా నెటుల నేర్పడె? అను ప్రశ్న పుట్టుటకు హేతువే యుండదు. కావున ఒకేయాత్మ రెండు ఆత్మలుగా నయ్యెనని నిశ్చయించుకొనక తప్పదు.

ఒకవిధంబగు దృష్టితో - ఆకసమువంక జూచుచు చంద్ర దర్శనము చేయుడు. ఒకేచంద్రుడు రెండు చంద్రబింబములుగా గోచ రించును. ఇట్టియనుభవమును కల్గినవారలెందరో కలరు. అనుభవము లేని వారలకు మాత్రము ఎంతగ వినిపించుచున్నను ప్రయోజనము కలుగదు. ఐనను ఒకరిద్దరు మిత్రులు జేరి ఎడమకంటియొక్క కనుబొమలకు క్రిందిభాగమున అనగా రెప్పయొక్క పైభాగమున కొనయందు చూపుడు వేలితో మెల్లగా వత్తుచు చంద్రునిం జూచిన యెడల నతడు ఇద్దరుచంద్రులవలె గోచరించునని తెలుపగల్గుదురు. ఇంతకుమించి ఇంకను వివరింప జాలను. తెలివిగలవారు ఆరీతిగ జూచుకొనవచ్చును. పరీక్షించు నెడల ఒకటే బింబము రెండు బింబములుగా విశదము కాగలదు. అందొక బింబము సత్యమైనది. రెండవబింబము నడుమ- నడుమ క్రొత్తగా నేర్పడిన దగుచు మరల మాయమై పోవుచుండును. అంతియే కాని పై రెండు బింబములు సత్యములై యుండవు, మాయమై పోవు వరకు ఆ క్రొత్త బింబము సైతము సత్యముగనే తోచును. మరియొక దృష్టాంతమును జూతము. ఎండలో నడుచుచున్నపుడు మననీడ మన వలెనే మరియొక మానవవేషమును దాల్చి రెండవరూపముననున్న మనమే సుమా యనినటుల గోచరించును. ఈ రీతిగ నెన్నియో యుదాహరణముల నీయవచ్చును. మరియొక చిన్న విషయము. నేల్లపై

నున్న మనఛాయ మనపొడవుననున్న సమయమందు రెండు మూడు నిమిషములు తదేకదృష్టితో గాంచుచు ఆ కనులను ఆర్పకయే మబ్బులచే నాక్రమింపబడని నిర్మలమగు నాకసమువంక చూచుచుండవలెను. ఆ ఖాళీ ప్రదేశమున తాటిచెట్టంతి లేదా — ఇంకను చాల పెద్దగా నున్న పొడవైన మనరూపము తెల్లని రంగుతో మనకు గాన్పించును. కొన్ని యభ్యాసములను జేసిన యెడల నా రూపము సంభాషింపగలదు.

> మన దేహము మాదిరిగ నుండకున్నను అటులనే యుండినను దానిని ఆధారముగ చేసికొని నేలమీద నొక దేహము - ఆకసముమీద మరియొక దేహము ఆవిర్భవింప లేదా! ఒక చంద్రునినుండి రెండవ చంద్రుడు కాన్పించ లేదా! అద్దమునందు మనదేహము మరియొక దేహమును సృష్టించుకొనలేదా.

అటులనే పరమాత్మనుండి జీవాత్మయేర్పడిఎంతయో కాలము వ్యవహరించుచు తుదకెన్నడో యొకనాడు మాయమై పోవును. దానినే మోక్షమనెదము.

పరమాత్మ యెటుల ననాదినుండి స్వయంసిద్ధుడై యుండెనో- అటులనే - ప్రకృతి లేక మనసు అనునది అనాదినుండి ఆ పరమాత్మను ఆశ్రయించినదై అతనిచెంత పడియుండెను. ఆ సమయమున దానికి వికాసదశ లేకపోయెను. అనగా వ్యక్తముకానిదై అవ్యక్త స్థితియం దుండును. ఒక విధంబుగ ముకుళించుకొనిన మొగ్గయనునది యుండదా ? అదే రీతిగ మనసుసైతము మొగ్గవలె ముకుళించుకొని యుండెను.

కాలము గతించినకొలది ఆ కాల ప్రభావమున వికసనస్థితిని పొందెను. మొగ్గలు కొంతకాలమునకు వికసించునుకదా ! అది సహజ ధర్మము మొగ్గగానున్నపుడు ఆ పువ్వు ఇతరుల కుపయోగపడదు.

అటులనే మొగ్గవలెనున్న మనసు పరమాత్మవద్దనే నిల్చినదై, అతనిని ప్రాణనాథునిగ భావించి అచటనే పడియుండెను.

ఇంతలో కాలము మారినది. అందుచే మొగ్గలు మారినవియై పుష్పములుగా సిద్ధపడినరీతి - మనసు సైతము వికసింప గల్గెను. అవ్యక్తదశనుండి వ్యక్తస్థితి సంభవించెనని భావము.

బాల్యమునుండి అవ్యక్తురాండ్రుగనున్న కన్యలు - వయసు వచ్చిన వెంటనె వ్యక్తురాండ్రు అగుటలేదా! మనసు అను కన్యయు వ్యక్తురాలయినదని యెరుంగుడు. వ్యక్తురాండ్రయిన పిదప -కన్యలు పుట్టింట నుండజాలరు. కనుకనే అత్తగారింటిని జూచుకొను చుందురు. ఆ తావున తమను సంతోషపరచువ్యక్తి గోచరించెను. అది మొదలు అతనిని ప్రాణనాథునిగ నిశ్చయించుకొని వెంబడించుచు పుట్టినింటిలోని సౌఖ్యముల నభిలషింపక అత్తవారింటియందే కాలము గడుపుచుందురు. మన మనసు అను కన్యయొక్క దశయు అదేరీతిగ సంభవించినది. అనాదినుండి ఏ పుట్టింటియందు అనగా పరమాత్మ యొక్క సన్నిధానమున నుండెనో అట్టి పరమేశ్వరునితో వియోగ మును పొందినపిదప తనయందు ప్రతిఫలించిన (ప్రతిబింబించిన) జీవాత్మతో జేరినదై అతనినే ప్రాణనాథునిగ నిర్ణయించుకొని జీవయాత్ర కొనసాగించుచుండెను. ఇదంతయు మన సంసారసంబంధమగు ప్రసంగమైయున్నది.

ఆ జీవాత్మ యెటుల నావిర్భవించెనో వినుడు. ప్రకృతికి వ్యక్త దశ (వికసనస్థితి) ఏర్పడినప్పుడు మనఃపుష్పము అనునది వ్యక్తమయ్యె నని మరువకుడు. అదియొక అద్దమువలెశోభించుచుండును. పరమాత్మ ఆ యద్దమందు-అనగా ప్రకృతియందు లేక మనసునందు ప్రతిబింబించెను. ఆ ప్రతిబింబమే జీవాత్మయనుచు యశనుగాంచినది. జీవాత్మకును - పరమాత్మకును నడుమనున్న వ్యత్యాసము చదువరులకు బాగుగా తెలియబడెనని భావింతును. బింబముయొక్క పోలిక ప్రతిబింబమున నుండునని యెరుంగనివారు లేరు. వికసించిన మనసునందు

పరమాత్మ ప్రతిబింబముగ నేర్పడినపుడు జీవాత్మగా భాసించెను కదా! ఆతనిపోలిక జీవాత్మయందు లేదందురా? లేకేమి! కనుకనే జీవాత్మనుకూడ ఆ మనసు తనకు ప్రాణనాథునిగ నిశ్చయించుకొనెను.

(1) తాను ముడుచుకొనియున్నపుడు పరమాత్మ ఆ మనసునకు ప్రాణేశ్వరుడుగా నుండెను.

(2) వికసించుకొనినపిదప - జీవాత్మను ప్రాణనాథునిగ నొనరించుకొనెను.

ఈ దృష్టిలో మనసు అను కన్యకు ఇరువురు పతులుండిరి. అను కథ యేర్పడెను.

దేవుడు నిరాకారుడు కదా ? మనసునందు ప్రతిఫలించుట యెట్లు? అను సంశయము కల్గును అనగా బింబ మొకటి యున్నపుడు ఆ బింబముయొక్క రూపము-అద్దమునగాని, జలమునందుగాని ప్రతిబింబింపవచ్చును. అసలు దేవునకు రూపమే లేనపుడు ప్రతిరూపమొకటి యేర్పడగలదా ? అసంభవము. కావున నిరాకారుడగు పరమాత్మ తన మనసునందు ప్రతిబింబించె ననుటకు మనమనసు అంగీకరింపదు.

ప్రత్యుత్తరము వినుడు-

దేవుడు సర్వశక్తులను కలిగియుండెనని మనసు సమ్మతించినపుడు — ఆ దేవుడు నిరాకారుడయియున్నను ఆకారమునుపొంది మనసున ప్రతిబింబింపలేడా ? లేక చిరకాలమునుండి దేవుని ఆశ్రయించిన మనసు-లేక ప్రకృతి ఆ దేవునిశక్తులలో కొన్నిటినయిన ఆర్జించుకొని యుండదా ? కనుకనే- అట్టిశక్తులం బొందిన ప్రకృతియు- నిరాకార బ్రహ్మమునకు ఆకారమునుకల్పించి యుండగలదు. ఆ యాకాకారమే జీవాత్మయని పిలువబడును. విచారింప జీవునకున్ను రూపము లేదు.

కాని రూప మున్నటుల దోచును. సంశయ నివారణమునకై ఈ క్రింది పటమును గాంచుడు



ఈ పటముచుట్టు నలుపుగానున్న భాగము ప్రకృతి యనబడును. దాని మధ్యభాగమున తెలుపుగానున్న రూపము గోచరించును. అది ఆంగ్లభాషలో ఒకటి యను అంకెయై యున్నది. ఆరూపము మనకు ప్రత్యక్షమగు చుండెను. చూపులకు ఒకటి యను అంకెను నిర్మించియుంటిమా యనినట్లున్నది. కాని అంకెను మనము సృష్టింపలేదు. కాకితమునందంతటను ఏ తెలుపుకలదో అదియే ఆయంకెలో నున్నది. ఆ తెపునకు ప్రత్యేకరూప మున్నదా లేదు. కాగితమందంతటను వ్యాపించియున్న తెలుపునందు అంకెలులేవు! అయినను మాయ అను నలుపుచే ఆవరింపబడినపుడు దాని నడుమ ఆవిశాలమగు తెలుపున గొంతభాగమునందు ఖాళీగా నేర్పడిన భాగము ఒకటి అను అంకెగా నేర్పడినట్లు తెలియబడుచున్నది. అంతియే కాని ప్రత్యేకమగు వస్తువు అనగా సున్నముతో గీయబడిన అంకె వేరొకటి నిర్మింపబడలేదు.

కాగితమం దంతటను వ్యాపించియున్న తెలుపు వంటిదే ఆ పరమాత్మ యని భావింపుడు. అ నలుపంతయు ప్రకృతి యని నిశ్చయించుకొనుడు. అట్టి ప్రకృతి మూలమున ఒకటి యనునట్టి అంకె జన్మించెనని నిశ్చయింపగలము.

ఇపుడు సృష్టికర్త ఎవరై యుండెనో తెలిసెనా! కాకితమునందంతటను వ్యాపించియున్న తెలుపును ఆధారముగ నుంచుకొని నలుపు అనునది స్వయముగ నొక అంకెను నిర్మింపగల్గెను.

అటులనే పరమాత్మను అర్థము జేసికొని ప్రకృతి అనునది నలుపుగా లేదా మెరుపుగా నున్నదై ఒకటి యనునట్టి సంఖ్యవలె నున్న జీవుని కల్పించియున్నది.

తాను మనసుచే (ప్రకృతిచే) సృష్టింపబడియున్న కారణమున కొడుకు ననుకొనక— అలాటి తల్లితో సుఖింపదలచెను. అనగా జీవుడు మనసునుండి పుట్టి — ఆమనసుతోడనే రమించుచుండెనని తేలినది. "కొడుకు తల్లికి మగడు" అను సామెతకు అర్థమిదియే సుమా. ఆపద ములు వినినపుడు మాత్రము భరింపరానంత కష్టము కల్గును. కాని మనసున బుట్టినజీవి ఆ మనసుతోడనే వ్యవహరించుచున్నాడు

అనునట్టి అంతరార్థమును గుర్తించినపుడు బాధ కలుగనేరదు.

మనసు నకు వికాసదశ యేర్పడినప్పుడు ఆ మనసు జీవునితో వ్యవహరింప సాగెను అని తెలియగలిగితిమి. వికసించకపూర్వము ముకు ళించుకొనియున్నది కదా! అప్పుడేమి చేయుచుండెను. ముడుచుకొని పడియుండెనని వచింతుము. ఆరీతిగ పండుకొనిన తావు ఎద్ది? అని మరల ప్రశ్నింతము. పరమాత్మయొద్ద అతని శయ్యపై పవళించెనని వచింపలసివచ్చును. అహో! ఆ వనితయు

ఒక సమయమందు — పరమాత్మతో నొకమారును

మరొక కాలమున — జీవాత్మతో మరి యొకమారును

కలియుచు - జీవితమును గడుపుచుండెనని వింటిమి. అది మనసునకు సంబంధించిన కథయై యున్నందున - దానిలో దోషము కానరా కున్నది

మనసు | ఒకమారు జీవాత్మ తోడను, మరొ కమారు పరమాత్మ తోడను-

అనువిషయము తెలియక—

ఒక స్త్రీ | ఒక సమయమున ఒక పురుషుని తోడను వేరొక సమయమున మరి యొక పురుషుని తోడను-

అని మాత్రమే యెరిగినయెడల అట్టి నీతిమాలినకథను బూతు కథయనక విడువ జాలము. పాపము! హిందుమత సాంప్రదాయము

లెరుంగనివారి ధోరణి- సాంప్రదాయార్థములను తెలియనేరక-బాహ్యార్థములతో హరివెంకటాయ వేషములను వేయుచున్నదై, నీచాతి నీచమగు పాపముల నొనరించుటకు సిద్ధమగుచున్నది.

జీవాత్మ, పరమాత్మల నెరుంగనివారు బూతులలో జిక్కుచు, నీతిని విడినాడుచున్నారు. కనుకనే 'పురాణములు బూతులు' అనుచు తమ గ్రంథములందు వ్రాయుటకును అవియన్నియు బూతులనుచు బోధించుటకును - సిద్ధమగుచుందురు.

మనసు బూతుపని చేయగలదని ఎవరయిన వచింపగలరా?

జీవునియందును, దేవునియందును మనసునందును స్థూల దేహము లుండవు. కాని, జీవునకును, దేవునకును, మనసునకును తాము నివసించుటకు మరియు వ్యవహరించుటకు స్థూలదేహము లుండును.

పై కథలో మనసు అనునదే తప్ప వేరొక వనిత లేదనియు-జీవాత్మ-పరమాత్మలుగాక పర పురుషు లెవ్వరును లేరనియు ఎరింగినవారు ధన్యులు.

చదువరులారా! వినుడు.

1. జీవాత్మకును పరమాత్మకును, వావివరుసలు ఏవిధముగా నేర్పడియున్నవో తెలిసికొనియుందురు. అనగా వారిరువురిలో నొకరు తండ్రిగను, ఇంకొకరు కుమారుడుగను ఉండిరని గుర్తింపగలిగితిమి.

2. ప్రకృతికిని (అనగా మనసునకును) జీవాత్మకును వావివరసలు — ఎవ్విధమైయున్నవో అదియుం దెలియుదము. ప్రకృతి యనునది యెల్లరకు తల్లియైయున్నది. జీవాత్మ పుత్రుడయి యుండెను.

1. ఈశ్వరుడే తండ్రి -

1. జీవుడే కుమారుడు.

2 ప్రకృతియే తల్లి

2. జీవుడే కుమారుడు

లోకమునకు తలిదండ్రులెవ్వరన

1. ప్రకృతిమాత – తల్లియైయున్నది.

2. పరమేశ్వరుడు తండ్రియైయుండెను.

ఇదేవిషయమును మరియొకపేరుతో పిలువవలెననిన ఆ ప్రకృతిపురుషుల – నిరువురను పార్వతీపరమేశ్వరులు అని పేర్కొనుచుందుము.

ప్రకృతియనినను, మనస్సనినను – మాయ యనినను స్వల్ప భేదములతో అర్థమొక్కటేయని గుర్తింపవలెను.

ప్రకృతి, మాయ –అను పదములు స్త్రీలింగములు. మాయయును, ప్రకృతియు, స్త్రీలింగములైయుండ – నేనుమాత్రము స్త్రీగా నుండవలదా! అని నిశ్చయించుకుని ఆ మనసు స్త్రీ వేషమును దాల్చి స్త్రీలవలెనే వ్యవహారింపసాగెను. అయితే ఆమెకు భర్తయెవరు! జీవుని పతిగా చేసికొనెను. మంచిది. ఆ జీవుడెవరు? ప్రకృతి తాను వికసించి నదై అద్దమువలె సిద్ధమైనదగుటచే పరమాత్మ ఆ యద్దమున ప్రతిఫలింపగా ప్రకృతియందు గోచరించినవాడే జీవుడనబడెను. దేవుని రెండవరూపము అనగా చిన్నిరూపము జీవుడైయుండెనని సారాంశము. దేవుని అంశ జీవుడని యెరుంగుడు. పరమాత్మ ప్రకృతిలోనుండి గోచరించినపుడు అందుండి వెలువబడిన రూపమే జీవుడని భావము. ప్రకృతియని పిలువబడుచున్న స్త్రీ నుండి వెలుబడిన కారణమున అట్టి రూపమును పుత్రుడని వచింతుము. ఇది మానవస్వభావము. ఎందుకన స్త్రీనుండి జననమందినవారు పుత్రులగుదురని మన సిద్ధాంతము. అదేరీతిగ ప్రకృతియను స్త్రీనుండి వెలువడిన జీవుడు ఆమెకు కుమారుడైయుండెను. మనసు (ప్రకృతి) స్త్రీగా సిద్ధమైనది మొదలు తన భర్తయగు పరమాత్మను ఆధారముగా చేసికొని తననుండి జీవుని వ్యక్తపరచెను. కావున జీవాత్మ ఆ ప్రకృతికి కొడుకువరుస యగును.

అయినను ఆ ప్రకృతి తన కుమారునకు యౌవ్వనమురాగా తానే మోహించి వివాహమాడెను.

కనుకనే మనసు (ప్రకృతి) కోరినటులెల్ల జీవుడు వ్యవహరించును. జీవుని యాశయములను సైతము మనసు నెరవేర్చుచుండును. ఇటుల వ్యవహరించుట సతీపతుల ధర్మమేకదా!

-: తల్లికొడుకుల పెండ్లిండ్లు :-

దైవతత్వము తన లో భాగముందంతటను మూడుపాళ్ళు ఆక్రమించుకొని యుండును. అది గాను ఏదోయొకమూల సృష్టికి సహకరింపగల వెలుపలి భాగము సైతము ప్రకృతియనుపేర ఆ దైవతత్వమున నలరారుచుండెను. ఈ రీతిగ లోపలి-వెలుపలి- రెండు భాగములుచేరి పరమాత్మయని వ్యవహరింపబడును.

వెలుపలి భాగమునకు ప్రకృతియనియు, మనస్సనియు, మాయ యనియు మూడు పేర్లు వ్యవహారమందు కలవు.

"తస్యేచ్ఛా ప్రకృతిర్మతా"

(శివపురాణం)

ఆ దేవుని సంకల్ప సంబంధమగు మనస్సే- అనగా ఇచ్ఛయే ప్రకృతియని పిలువబడుచున్నది. లో భాగము - వెలుపలి భాగము అనునవి రెండుగానున్నను, మొత్తముమీద దైవతత్వము అనునది యొక్కటేయగును. ఎట్లన: మన దేహమందు ముందుభాగము వెనుక భాగము అని యున్నపుడు అవి రెండుగ నున్నను దేహము అనునది యొక్కటేకదా !

అటులనే ప్రకృతియనియు, దైవ మనియు రెండుగా వాడబడుచున్నను ఆ రెంటికిని కలిపి - భగవంతుడు అని ఒకే నామముండెను భగమనగా ప్రకృతి అది కల్గినవాడు భగవంతుడు.

ధనము కలిగినవాడు ధనవంతుడు,
విద్యకలవాడు విద్యావంతుడు
బుద్ధికలవాడు బుద్ధిమంతుడు
బలముగలవాడు బలవంతుడు

అటులనే—

"భగము కలవాడు భగవంతుడు."

ఒకడు 'బలవంతుడు' అని పిలువబడినపుడు మొత్తమువిూద ఆతని రూపము ఒక్కటిగనేయుండును. కాని కొంచెము విమర్శించినపుడు బలము అనునదియు,అతడును విడివిడిగా ఇరువురై యుండిరని నిశ్చయింతుము.

ఒకటే రెండు - రెండే ఒకటి అన్నట్లున్నది పై విషయము. ఇంతకుమించి ఎక్కువగా వచింప జాలము.

పై దానిని ఒకవిధముగా జెప్పుకొనవలెనని నిశ్చయించుకొనిన యెడల — ఆదికాలమునుండి ప్రకృతి అనునది పరమాత్మవద్ద నిలచినదై అతనిని ఆశ్రయించి అచటనే పడియుండెను అనునట్టి కథను నడిపింపవలెను. దానినే మరొక విధముగా వివరింపవచ్చును.

వినుడు :

ఒక వనిత-పరమాత్మవద్దచేరి అతనినే యాశ్రయించుచు క్షణమైనను విడవజాలక జీవితమంతయు నతనికి ధారవోయుచు నుండెను. కనుకనే ఆమె (ప్రకృతి) ఆ దేవునకు భార్యయనబడును. ఆ భార్యయందు పరమాత్మ ఫోటో దిగినవాడయ్యెను, అతని ఫోటోకున్నూ ఆతనికిని భేదముండునా? ఉండదు. ఫోటోనుగాంచినపుడు అహో ఈ ఫోటో పరమాత్మదే సుమా! అనుచుందుము. అనగా ఆ పరమాత్మ యొక్క పోలిక ఈ ఫోటోయందు గోచరించును. ఇంతయేల. అదే యిది. యిదే అది యని నిశ్చయింపగలము. ఈ ఫోటోను జీవాత్మ యనుకొనుడు. దేవుడు ప్రకృతి యను యంత్రమునందు

తన రూపమును దింపగా ఆ రూపము ఫోటోగా సిద్ధమాయెను. దానినే జీవాత్మ యనెదరు. నిజమారయ ఆ పరమాత్మకును, జీవాత్మకును భేదమెక్కడిది! భేదములేకున్నను భేదముండియే యున్నది.

మనకును, మన ఫోటోకును భేదములేకున్నను భేదము ఉండనే యున్నది. ఎట్లన మనకున్న తెలివి మన ఫోటోయందున్న మన రూపమునకు లేదు. మనకున్న పొడవు ఆ ఫోటోయందున్న మన రూపమునకులేదు. ఈ రీతిగ నంతయు భేదము తోడనే నిండుకొనియుండెను అయినను అదే మనము మనమే అదియైయుంటిమి. అటులనే పరమాత్మకును, జీవాత్మకును, భేదము లేకున్నను భేదముండియేతీరును. విచారింప పరమాత్మయొక్క జాతిగా జీవుడుండెనని తెలియగల్గుదుము

కాకితము నందంతటను వ్యాపించియున్న తెలుపురంగునకును ఆ కాకితము యొక్క నడిమి భాగమును ఆక్రమించిన నలుపు రంగునకును మధ్యలో నేర్పడిన ఒకటి అనునట్టి అంకెను గాంచినపుడు జాతి భేదమును జూపగల్గుదుమా! తెల్ల కాకితములో ని ఆ తెలుపే- నలుపు రంగులో నడిభాగమునవున్న తెలుపుగానున్నది. కావుననవి రెండును ఒకే జాతికిం జెందినవని వచింతును. దేవునకు జీవునకును అట్టి సామరస్యము కలదు. దేవుడే జీవుడైయున్నను దేవుడంతటి తెలివి గలవాడు జీవుడైయుండడు. అతడు సర్వజ్ఞుడై యుండ నితడు అల్పజ్ఞుడైయుండును. అట్టి భేదమును తొలగించుకొనుటకు తనచుట్టు వ్యాపించియున్న ప్రకృతిని తొలగించుకొనవలెను; అనగా మాయను తీసివేయవలెను. మనసును లేకుండ జేసికొనవలెనని సారాంశము.

“తన్మనో విలయం యాతి
తద్ధామ పరమంమమ”

(ఉత్తర గీత)

తన్మనః = ఆ మనసు

విలయం } = లయము కావలెను. అనగా జీవునియందు లేనిదై<br>
యాతి } దేవునిలో లయించిపోవలెను.

అపుడు జీవునకును దేవునకును నడుమ యేర్పడిన అడ్డము తొల గింపబడిన దగుటచే — నతడు బంధమునుండి విడివడినవాడై తన యొక్క ఆదిరూపమున అనగా దైవ రూపమున నిల్చినవాడు కాగ లడు. దానినే కైవల్యమనెదరు. అనగా మోక్షమని భావము. పై కథవలన ముక్తిమార్గమును తెలియ గల్గితిమి

దేవుని భార్య జీవుడై యుండెను. దేవునకు జీవుడు కుమా రుడని పల్కితిమి.

మరియొక దృష్టితో నాలోచించినపుడు

జీవుడు దేవునకు భార్యయైయుండెను. ఇదేమిచిత్రము! అవును— అదియే చిత్రము. తెలివితేటలు ఎంతగ విజృంభింపగలవో - అంతగా విభాగముల నర్థము చేయగల్గుదుము. బుద్ధిబలము లేనపుడు అంతయు నొక్కటిగనే బండవలె దోచును.

పరమాత్మనుండి వెలువడిన జీవాత్మ - అతని నుండి విడిపడిన వాడేయని నిశ్చయించితిమి. ఒక వస్తువును చీల్చగా నది రెండుగా నేర్పడును. చీలిన వస్తువు - మొదటి పెద్దవస్తువునుండి పుట్టిన దగు టచే దానిని కుమారుడనవచ్చును. ఆ దృష్టిలో పెద్ద వస్తువును తండ్రి యనుట కాక్షేపణములేదు. మరియొక దృష్టితో విమర్శింతము.

మన యనుభవములో స్త్రీని అర్ధాంగి యనుచుందుము. అనగా ఏదో యొక పెద్ద వస్తువు కలదనియు దానినుండి సగభాగము చీలినదై విడిగా వచ్చెననియు - కనుకనే ఆ రీతిగ విడివడివచ్చియున్న దానిని పూర్ణాంగము నుండి సగముగా చేయబడినందున అర్ధాంగమని పల్కు టయు సహజమై యున్నది.

కనుకనే పరిపూర్ణ బ్రహ్మమునుండి విడిపడినవానివలె గోచరిం చిన జీవుడు కూడ సగముగా జేయబడిన అర్ధాంగముగ నున్న కారణ ముచే, అర్ధశరీరముతో అర్ధాంగియను నామమునుపొంది ఆ పరి పూర్ణబ్రహ్మకు అర్ధాంగియయ్యెను. అనగా దేవునకు భార్యగా నేర్ప

డెను. విదేశమతస్థులు కూడ భార్యను అర్థాంగియను పదమునందున్న భావమునే సూచించునట్టి "మైబెటర్ హాఫ్" అను పదమును వాడుచున్నారు.

వైఫ్ అనగా భార్య
హాఫ్ అనగా సగము

నాలోనిసగభాగము నాభార్యయని దానియర్థము. జీవుడుకూడా దేవునిలోయర్థభాగమైనందున నతడు దేవునకు భార్యయైయుండెనను మాట సమంజసముగనున్నది. హిందుమతమున నీవిషయము సుప్రసిద్ధము

"పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ శాశ్వతగ్ శివమచ్యుతం" } మంత్రపుష్పం

ఆత్మేశ్వరం = తనకుప్రభువైన దేవుడు

పతిం = భర్తయను నామమున పిలువబడునని హిందువుల నిర్ణయము

"తం భర్తారం తముగోప్తారమాహు: (అరుణమంత్రము)
దేవుడు తనకు భర్తయైయుండెనని పైమంత్రమున వర్ణింపబడెను.

(1) మనసును (ప్రకృతిని) స్త్రీగా వర్ణించినపుడు జీవుడు కుమారుడగుచుండును

(2) ఆ భావమును మనసునరానీయక అనగా మనసునుమరచినవారమగుచు దేవునినుండి చీలివచ్చినభాగము జీవుడైయుండెనని నిశ్చయించుకొనినపుడు జీవుడు దేవునకు భార్యగా నుండును. దృష్టిభేదమునసనుసరించి ఇదంతయు చిత్రవిచిత్ర ధోరణితో వివిధకథలుగా ప్రసంగించబడుచుండును.

మన యనుభవమున నిట్టిచిత్రములెన్ని మోకలవు ఒకయింటిలో భార్యాభర్తలుండిరనుకొందము. ఇంటియజమానుని సంబోధించునపుడు ఆ యిల్లాలు "నాథా" యనిపల్కును, మంచిది - ఆ యజమానుడు తన కుమారునిచే సంబోధింపబడినపుడు "నాన్నా" యని పిలువబడు చుండును, మనుమడు "తాతా" యని సంబోధింపగా వినుచుండును. అల్లుడు "మామా" యని సంబోధించుచుండును. తండ్రి "కుమారా యనును. తాత "మనుమడా" యనిపిల్చును. మంచిది. ఆ యజమానుడొక్కడేకదా?

అతనికి - ఎన్నియో నామములంబెట్టి పిల్చుచుండి రాలేదా? ఇదంతయు దృష్టిభేద మనకతప్పదు. తెలివి గలవారు ఈ రీతిగా భేదములం బెట్టుకొని పిల్చుకొను చుందురు.

తెలివి యొకింతయును లేని మొద్దుతనమున్న యెడల అతని భార్యయు కొమరుడును - అల్లుడు - మామ - తండ్రి తాత బావ మరది-అన్న తమ్ముడు మున్నగు వారలెల్లరు ఆ యింటి యజమానున కొక్కటే పేరుబెట్టి పిల్చుకొనుచుందురు. అట్టి పద్ధతిని వివేకులెవ్వరును సమ్మతింపజాలరు. హిందుమతము తెలివిగలమతమైనందున - ఆయా ప్రజలలోని- మనఃప్రవృత్తుల ననుసరించి వారివారి భేదములకుం దగిన రీతిగ దేవుని భర్తగను తండ్రిగను, మిత్రునిగను భావించి ఆయా నామములచే సంబోధింపజేయును. అయితే దేవుడు తమకు తండ్రియై యుండెనను వారికంటె భర్తయని భావించువారు శ్రేష్ఠులగుదురు. పూర్ణమగు మోక్షము వారికొక్కరికే లభ్యమగుచుండును. జీవుడు భార్యగా నున్నపుడే - మోక్షము లభించునని యర్థము.

అట్టి పై దృష్టిలేక కొంచెము క్రిందికి - దిగినపుడు - ప్రకృతి తన తలను పైకెత్తి తాను స్త్రీగానేర్పడినదై తన ప్రక్కనున్న దేవుని భర్తగా జేసికొనుచు నతనితో సౌఖ్యములందుచుండును. అస్థితియందు తననుండి వెలువడిన జీవుడు కుమారుడై రాణింపగలడు

ప్రకృతి తాను ముకుళించుకొని యున్నపుడు తనభర్తనుగాంచి యానందించుచుండును సమర్తాడని కన్యలకు పెండ్లియైనదనుకొందము, ఆస్థితియందును తమ భర్తయందు ప్రేమ యుండనే యున్నది. కను కనే వారింగాంచి సంతసించెదరు. అది యొక విధంబగు నానందమే యగును. తండ్రి తన కుమార్తెను ప్రేమింపడా! ఆమెం జూచి యానందించుచుండడా. కొంతకాలమునకు ఆ కన్య సమర్తాడె ననుకొందము. అంతకు పూర్వమునుండి తండ్రివలె దూరదూరముగ నున్నవాడగుచు చూచి యానందించుచున్న అవ్యక్త- వ్యక్తురాలైన పిదప నాకన్యను చేరదీసి వేరొకవిధంబుగ నానందింపజేయును. తానుకూడ నానందించుచుండును. మరిమరి యానందింపగలడు.

సమర్తాడుటకు పూర్వము-ఎవడు తాను భర్తయైయుండియు తండ్రివలె దూరదూరమున నుండిన వాడగుచు నామెను సంతోషపెట్టెనో అతడే సమర్తాడిన బిడ్డను సంతోషపెట్టుటకు గాను తండ్రివలె వ్యవహరింపక - కేవలము భర్తగనే చరింప బూనెను.

ఆకన్యవిషయమున - ఆమెయొక్క- బాల్యదశయందునను అతడు భర్తయేయగును. యువతియైన పిదపను - అతడే భర్తగానుండెను. కాని ఆదియందు తండ్రివలెనున్నతాను తుదియందు భర్తగానేర్పడి సుఖముల నొసగెను.

తండ్రివలెనున్న సమయమున సైతము ఆకన్యకు - అతడు పతిగానేయుండెను. అతండ్రి వలెనున్న వ్యక్తి - కుమారరూపమును పొందిన యనంతరము అనగా ఆమె - యువతియైనది మొదలు తాను యువకునివలె నటించి తృప్తిపరచుటకు బూనెను.

ఒక వనితకు - బాల్యదశయందు అనగా ముకుళితావస్థయందు ఒక విధంబగు పురుషుడును యౌవ్వనదశయందు అనగా వికసితావస్థయందు మరియొకవిధంబగు పురుషుడును ఈరీతిగ నొకేపురుషుడు రెండురకములుగా నేర్పడి సుఖింప జేయుచుండెను.

అని విశదమగుచున్నది. సమర్తాడినపిదప ఆభార్యను ముట్టుకొనుచందమున సమర్త్రాడుటకు పూర్వము అతడు భర్తగానున్నను

ఆమెను ముట్టుకొనుచుండెనా లేదు. తండ్రివలె దూరదూరముగనే యుండును. అట్టిస్థితియందు అతడు భర్తయని పిలువబడుటకు ఆక్షేపణము లేదు. ఈవిషయమును బాగుగ నర్థముచేసికొనినయెడల—

దేవుడు తాను పతియైయుండినను తండ్రివలె చరించెననియు-

అదే భగవానుడు తాను కుమారుడై జన్మించినపుడు ఆ కన్య విషయమున తండ్రియైయుండడనియు నెరుగవలెను. కేవలము దివ్యమగు హిందుమతమును అర్థముచేసుకొనిన యెడలనెంతగా శ్రమను జెందవలసియుండునో ఇదే సమయమున గుర్తునం దుంచుకొనుడు. పైపైనిగోచరించుచున్న అర్థములంబట్టుకొని యూరేగువారికి దైవమత స్వరూపము ఎంతమాత్రము అర్థము కాజాలదు.

పై కథయందు తండ్రికొడుకు లిరువురును ఒకే వనితతో భోగించియుండిరని తీర్మానింపబడెను. అయినను అది నేరము కానేరదు. ఎందుగన— ఆ కథ బాహ్యార్థములతో నిండియుండినది కాదు. కథలోని విషయములను బాహ్యార్థమునకు దెచ్చుకొనినయెడల ఎంతయో అసహ్యకరముగ నుండును. బాహ్యార్థములు పిచ్చివియైయున్నను కథలోని యంతరార్థము తెలివి గలిగినవారికి నీతిని బోధించునదిగా సిద్ధమగుచుండును.

ప్రకృతియందున్న విషయములను ఎటుల దాచగలుగుదాము. ఆ స్థితియందు సరియగునర్థమును జేసికొనుచు తెలివినిమాత్రము ఆర్జింపవలెను,

అట్టి తెలివిని సంపాదించునెడల - ఎటువంటి క్లిష్ట సమస్యల లోని చిక్కులనైనను విడదీయ గల్గుదుము, పైపైన జూచువారలకు కధలు బాహ్యార్థ ప్రతిపాదకములుగా దోచును. లోజూపు జూడ గల్గిన వ్యక్తులకు మాత్రము అయాకధలు అంతరార్థములు కలవియై భాసించుచున్నటుల అర్థమగు చుండును. వానింజూచుకొనియెంతయో యానందించు చుందురు. విశేషముగు తెలివి కల్గినవారు సైతము తమ తమ ప్రసంగములందు రెండర్థములతో అనగా నంతరార్థములతో విలసిల్లుచున్న పదజాలముల నుపయోగించు చుందురు. ఇందలి సత్యమును భాషతో పరిచయమున్న వారెల్లరు గుర్తింపగలరు. హిందు మతము - అంతరార్థములతో విలసిల్లుచున్న భావములను కల్గియున్నందున ఈ దేహమునకు లోభాగమందలి తత్త్వమును ప్రబోధింపదలచి- అందుకు సంబంధించియున్న సూక్ష్మశరీరమునుగూర్చి ప్రసంగింప నెంచెను.

సూక్ష్మశరీరమన నెట్టిది ? ఈ శరీరముగాక వేరొక దేహము లోభాగమున నున్నదా యని సంశయింపకుడు. స్వప్నమునందు వేరొక దేహమును జూచుకొని దానితో దేశమం దెన్నియో తావుల కుంబోయి వ్యవహరించుట లేదా. అదియే మన సూక్ష్మశరీరమని యెంచుడు. లేదా - ఇట్టిదగు వేరొక దేహమున్నదని నిర్ణయించు కొనుడు. మీకందరికిని అర్థమగుటకై స్వప్నదృష్టాంతమును జూపితిని. ఆశరీరము మీ దేహమునందేయున్నద.

ఇక నా దేహముయొక్క- విభాగముంజూతము.

పదియేడు (17) పదార్థములతో నిర్మింపబడిన రూపమును సూక్ష్మశరీరమనెదరు. ఆదేహమున కధిపతి జీవాత్మ. మొత్తము మీద (17+1–18) పదునెనిమిది పదార్థములతో సూక్ష్మదేహము నిర్మింపబడినది.

స్థూలశరీరమందు అనగా యీ దేహమున నిరువదియారు (26) పదార్థములుండును.

హిందుమతము ఆ రెండు దేహములలోని దోషములను తొలగించి పరిశుద్ధ దేహములుగా సిద్ధపరచుటకుగాను - తన తెలివిదేటల నన్నింటిని ఉపయోగపరచెను. కొరత యనునది యెంతమాత్రము కూడదని దానిభావము. అనగా విషయములన్నియు "పూర్ణముగ బోధింపబడవలెను" అని దాని యాశయము. అట్టిభావము ఆమతమున కేలకల్గెనని ప్రశ్నింపుదు. పరిపూర్ణ బ్రహ్మమునుండి యేర్పడిన మతమైనందున - విషయముల నన్నింటిని-పూర్ణముగ బోధింపనెంచెను. హిందుమతమున - ఆత్మసంబంధవిషయములు గాక జగత్సంబంధ విషయములుకూడ వహర్చబడి యుండెనా అని ప్రశ్నింపకుడు. ఆమతము చే స్పృశింపబడని విషయమొక్కటియు నుండదు. ఆవిషయమై మరియొకతావున వివరింపబడును? అయితే ఆమతమునకు గమ్యస్థానము ఆత్మయైయున్నది. ఆయాత్మ సూక్ష్మదేహమునకు సమీపమున నుండును. అందుకై హిందుమతముయొక్క దృష్టియంతయు సూక్ష్మదేహ రక్షణసందర్భములం జూచుకొనుచు వర్తించుచుండును.

సూక్ష్మదేహము పదునెనిమిది పదార్థములతో నిర్మింపబడెనని వినియుంటిమి ఆ యుద్దేశ్యమును హృదయమందుంచుకొని హిందుమతము-మాటిమాటికి పదునెనిమిదిని జ్ఞప్తికిం దెచ్చుటకుగాను తన తెలివినంతయు వినియోగించియుండెను. కనుకనే భారతీయ వాఙ్మయములోని ముఖ్యగ్రంథములన్నియు పదునెనిమిది సంఖ్యలతో విరాజిల్లుచున్నవి.

ఈలోపల మరియొకరహస్యమును వినుడు.

మనయందున్న శక్తులను మించినవియై వెలయు ననంత శక్తులతో మహిమలతో నలరారుచున్న మేధావులెందరో కలరు. వారినే దేవతలనుచుందుము. వారి నివాసము పరలోకము.

అట్టి పరలోకముగాక వేరొక విధంబగు పరలోకముకలదు. దానిని పరంధామమనియు పరమ పదమనియు వ్యవహరింతురు. జీవు

లెవ్వరైనను సరియే వారు దేవతలేకానిందు, రూపములేనివారగుచు — అనగా నిరాకారస్థితిని పొందుచు — దివ్యమగు నా పరమపదమున జేర గల్గుదురు. రూపముతోనున్న వారొక్కరును ఆలోకమున నిల్చుటకు వీలుకలుగదు. ఆతావున దేవుడుకూడ నిరాకారుడయ్యే యుండును. ఈమతమునయున్న గొప్పతనమును వింటిరికదా.

పైరీతిగ పరలోకములు రెండు కలవని విదేశీయమతమునకుం దెలియదు. భువర్లోకమున నధో (క్రింది) భాగమందు నెలకొనియున్న తావు విదేశీయమతమున నున్నవారికి పరలోకమగును.

అందుకనియే వారిలోకమున దేవతలుండరు. అందు వసించువారు దేవదూతలనబడుదురు. కనుకనే బైబిలునందు ఎందుగాంచినను దేవదూతలు వర్ణింపబడుచుందురు. దేవతల నివాసమును గురించి వివరింపబడియుండదు నిజమూరయ క్రిందివారికి పైవారివిషయము లేమితెలియును. కనుకనే దేవతలవిషయమై యాగ్రంథమున వివరింపబడదాయెను.

## ఇహపర సాధనంబగు మతము హిందుమతము

హిందుమతము స్థూలశరీర సంబంధమగు విషయములంగూర్చి పూర్తిగ ముచ్చటించిన దగుచు అనగా రాజకీయ సాంఘిక ఆర్థిక దైహిక విషయముల నన్నిటిని పూసగుచ్చినటుల దెల్పుచు నంతటితో తనివిజెందక సూక్ష్మశరీరమును దర్శింపనెంచును. సూక్ష్మశరీరరక్షణ విషయమై హిందుమతము తీసికొనినంత శ్రమను — ఏ యితరమతము కూడా — గైకొనియుండలేదు. ఈ విషయము గమనింపదగినది. అందుకనియే మానసికసంబంధమగు సూక్ష్మదేహమును పరమాత్మవద్దకు జేర్చవలెనని ద్వైవమతమగు హిందుమతము నిర్ణయించినది. ఆ విషయమును సూచింపనెంచి మరియు నద్దానిని మరచిపోకుండ జేయవలెనని నిశ్చయించుచు — మహత్తరంబగు ఒకానొక చిహ్నము నేర్పరచి యుంచెను. ఆగుర్తును — మానవులెవ్వరును ఎన్నటికిని మరచిపోజాలరు. మరియు హిందుమతముయొక్క గొప్పతనమంతయు —

ఆ గుర్తుపైననే ఆధారపడియుండును. మానవాతీతుడగు – పరమేశ్వరునిచే బోధింపబడిన మతిమున్నటచే హిందుమతమున నారీతిగ చిత్రింపబడినది. వినుడు. ఇదంతయు సూక్ష్మదేహరక్షణ సూచింపబడిన విషయము.

పాఠకులారా! మరచిపోయెదరేమో? పదునెనిమిది పదార్థములతో నిర్మింపబడిన మనస్సంబంధమగు సూక్ష్మశరీరమును పరిశుద్ధముగ జేయదలచి హిందుమతము ఆ పదునెనిమిది అనుసంఖ్యను మాటిమాటికి గుర్తింపజేయనెంచెను.

కనుకనే వేదమునకు సంబంధించిన మతగ్రంధము లెవ్వియో ఆయాగ్రంధముల సంఖ్యలన్నియు పదునెనిమిదిగా జేసియుండిన నెంతయో బాగుండు ననుకొనెను. అద్దానిని మనసునందుంచుకొని–

(1) పదునెనిమిది పురాణములను అనుగ్రహించియుండెను. "అష్టాదశ (18) పురాణానాంకర్తా సత్యవతీసుతః బ్రహ్మదేవునిచే నాదికాలమున స్మరింపబడిన పురాణములం జూచి వ్యాసభగవానుడు – వానినన్నింటిని పదునెనిమిది భాగముల క్రింద విభజించియుండెను. కనుకనే విభాగకర్తయగును. అంతియేకాని పురాణ రచయిత కాజాలడు.

2. ధర్మశాస్త్రములుకూడా పదునెనిమిది. అష్టాదశ (18) స్మృతులు అను పదమును వినని వారుండరు. స్మృతులకు ధర్మశాస్త్రములు అను మరియొక నామమున్నదని యెరుంగుడు.

3. "భారతః పంచమోవేదః" అను న్యాయము నెరుంగుదుము. వేదములు నాల్గు అనుచు హిందువులెల్లరు నిశ్చయించెదరు.

"అనంతావై వేదాః" అను వేదప్రమాణము ననుసరించి వేదముల సంఖ్య అనంతముగ నున్నది. కలికాల పురుషులు అల్ప

మనస్కులైనందున - ఎన్నియోవేదములం జదువనేరరని యెంచి వానిలో నాల్గువేదములను మాత్రమే వ్యాసమహర్షి విభజించి యుండెను. మిగిలినవి దేవలోకముననే నిల్చిపోయినవి. ఆయావేదముల లోని ముఖ్యవిషయములన్నియు - భారత గ్రంథరూపమున వెలువరింపబడెను. కనుకనే అయిదవవేదమని యశముగాంచినది.

భారతము సైతము పదునెనిమిది పర్వములుగా (భాగములుగా) విభజింపబడినది.

4 భారతమునకు శిరోమణియై వెలయునది భగవద్గీత

భారతమును ఒకానొక శరీరముగ నిర్ణయించుకొనిన యెడల భగవద్గీత ఆ శరీరమున శిరస్సుగా నేర్పడును. కనుకనే భారతగ్రంథమునకు శిరోభాగమై యున్నదని కీర్తింపబడెను. శిరములున్నవారందరు ఆ గీతాగ్రంథమును శిరముగా నెన్నుకొనుచున్నారు. కావున పాఠకులారా! మీరును శిరము కలవారలై యుండుడు.

మొగమున మంచిగీతలు లేనివారు గీతాగ్రంథమును మంచిగా నెంచరు. ఎందుకన సైతాను వారిని వంచించి యుండును.

కావున భారతీయులకు పరమప్రమాణగ్రంథము భగవద్గీత యనుట ప్రసిద్ధమగు విషయము.

ఆ గ్రంథమునందును పదునెనిమిది అధ్యాయములు కలవు.

5. భారతయుద్ధము పూర్తియగువరకు పట్టినదినములన్నియు పదునెనిమిది.

6. భారతయుద్ధమున జేరిన సైన్యము సైతము పదునెనిమిది అక్షౌహిణీలు.

ఈరీతిగ పదునెనిమిది అను సంఖ్యతో హిందూవాఙ్మయం బంతయు సమకూర్చబడెను

ఒకమారు తొమ్మిదవ యెక్కమును జూతము.

9 1 9 = 9
9 2 18 = 1 + 8 = 9
9 3 27 = 2 + 7 = 9
9 4 36 = 3 + 6 = 9
9 5 45 = 4 + 5 = 9
9 6 54 = 5 + 4 = 9
9 7 63 = 6 + 3 = 9
9 8 72 = 7 ÷ 2 = 9
9 9 81 = 8 + 1 = 9
9 10 90 = 9 + 0 = 9

ఒకమారు పదునెనిమిది అనుదానిని అంకెలలోనికి వ్రాసి చూతము. 18 అని యుండును. అందలి

మొదటియంకె ఒకటియైయుండెను }
చివరియంకె ఎనిమిది } ఆ రెంటిని కూడి చూతము.

1 + 8 = 9 అని యేర్పడెను.

తొమ్మిది అను దానిలో మహిమ యెంతయోలేనిది ఆ యెక్కమున నెక్కడగాంచినను 9 అని వచ్చునా. అంకెలన్నిటిలో 9 అను అంకె శ్రేష్ఠమైనది అని అర్థమగుచుండెను.

హిందుమత సారమంతయు తొమ్మిదవసంఖ్యయం దిమిడి యున్నది. ఒకటి, రెండు, మూడు అనుచు తొమ్మిదివరకు నడిపించి చూతము. ఆపైన నుచ్చరింపబడిన సంఖ్యను పదియను పేరుతో వ్యవహరించెదము. ఆ పది యనుదానిని కాగితముపై లిఖించినపుడు (10) ఈరీతిగ రెండుఅంకెలతో ప్రత్యక్షమగును. అందలి మొదటి యంకె ఒకటియనబడును. రెండవదానిని సున్న యనుచుందుము. అంకెల నారంభించినపుడు ముందుగ వ్రాయబడినదే పదియవసంఖ్య లోనున్న మొదటియంకె. ఈ పదియనునట్టి సంఖ్యలో చివరనున్నది సున్న యనబడును. ఇది క్రొత్తగా రూపముదాల్చి వచ్చినది. ఆ పదియవ సంఖ్యయందున్న మొదటియంకె అనగా ఒకటి యనునది అంకెలయొక్క ఆరంభదశనుండి తాను ముందుగ నారంభమై యుండనేయున్నది. అందుచే నొకటియనునది ఈ పదియవసంఖ్యలో ప్రధానమైనదిగ నుండదు. సున్న అనునది క్రొత్తగానేర్పడిన రూప

మని వేరుగ వచింపబనిలేదు. కావున పది యనుసంఖ్యలో ప్రముఖ పాత్రను వహించినది సున్నయని యెరుంగుడు.

జీవులచే నొనరింపదగిన కార్యములు తొమ్మిదేసుమా? అటు పైన నొక్కటియు లేదుసుమా! అని హెచ్చరించుటకుగాను – లేదు అనుదానికి సున్నయను అర్థమున్నందున తాను సున్నగానేర్పడి తనరూపమును సాక్షాత్కరింపజేసెను.

తొమ్మిది దశలను పూర్తిగావించుకొనిన పిదప జేయందగిన పనులెవ్వియులేవు లేవని హెచ్చరించుటకుగాను పదియవ దశయందు నిల్చియున్నట్టి సున్న – మనకు సాక్షాత్కరించియున్నది.

భారతదేశమునకు సహజమైయున్న భాషలో సున్నకు మరి యొక పేరు పూర్ణము.

కాకు – సున్నపెడితే "కం" అనుచు నీనాడు స్కూళ్ళలో పాఠములు చెప్పుచున్నారు.

"కాకు పూర్ణానుస్వారపెడితే "కం" అని మన పూర్వులు పల్కుచుండెడివారు.

పూర్ణానుస్వార మనినను
పూర్ణమనినను ఒక్కటే.

దానినే అనగా ఆ పూర్ణమునే మరియొకదృష్టితో సున్నయని దరు కావున తొమ్మిదిపనులను పూర్తిచేసినయెడల పూర్ణబ్రహ్మము గోచరించునని పూర్ణానుస్వార విశదీకరించియున్నది. ఆ తొమ్మిది పనులెవ్వి? లేదా ఆ తొమ్మిది స్థితులెవ్వి? అనువిషయమును వేరొకమారు పాఠకులు ఆకర్ణింపగలరు.

ఈలోకమున పరిపూర్ణబ్రహ్మమును చేరగలవారెవ్వరు? అని ప్రశ్నించినపుడు భారతీయులుతప్ప మరెవ్వరును లేరని సూచించుటకు గాను తొమ్మిదవ యెక్కమందున్న

| | | | |
|---|---|---|---|
| 9 - 1 - 9 | అనువానిని గుర్తునందుంచుకొని భారతీయులు వ్యవహారించిన వారలైరి. |
| 9 - 2 - 18 | |
| 9 - 3 - 27 | |
| 9 - 4 - 36 | |
| 9 - 5 - 45 | |
| 9 - 6 - 54 | |
| 9 - 7 - 63 | |
| 9 - 8 - 72 | |
| 9 - 9 - 81 | |
| 9 -10 - 90 | |

1 + 8 = ఒకటితో యెనిమిదిని కూడగా
2 + 7 = రెండుతో ఏడును కూడగా
3 + 6 = మూటితో ఆరును కూడగా

ఈరీతిగా 9 – 9 – 81 అనునది వచ్చువరకు కూడినపుడు తొమ్మిదే లభ్యము కాగలదు.

పై విషయమంతయు నెరింగిన వారగుటచే భారతీయులు – తొమ్మిది అనుదానిని దైవరూపముగ భావించుచుండిరి.

సంస్కృతభాషలో తొమ్మిది అను సంఖ్యకు "నవ" యను పేరునుబెట్టుచు వ్యవహరించెదరు

(హిందీఅంకెలు) ఏక్, దో, తీన్, చార్, పాంచ్, ఛవ్ సాత్, ఆఠ్, నవ్, దస్.

(సంస్కృతసంఖ్యలు) ఏకం, ద్వే, త్రీణి, చత్వారి, పంచ, షట్, సప్త, అష్ట, నవ, దశ.

(ఇంగ్లీషు) వన్, టు, త్రి, ఫోర్, ఫైవ్, సిక్సు, సెవెన్, ఖైట్, నైన్, టెన్.

అమావాస్యనుండి వరుసగా తిథులను లెక్కించినపుడు—

పాడ్యమి, విదియ, తదియ, చవితి, పంచమి, షష్ఠి, సప్తమి, అష్టమి, నవమి. దశమి.

అనునవి వరుసగా నుపయోగింపబడును. పై తిథులందు తొమ్మిదవ తిథిని నవమి యనుచుందుము. పరిపూర్ణబ్రహ్మము ఈలోకమున అవతరించినదికూడా నవమి తిథియందు అని యెరుంగుడు.

(1) దానినే "శ్రీరామనవమి" యనుచుందుము.

(2) దేవీనవరాత్రములు.

(3) గణపతి నవరాత్రములు.

(4) నవబ్రహ్మలు (వీరు సృష్టినిగావించువారు)

(5) నవగ్రహములు. వీరు కర్మఫలముల నొసంగుటకు నేర్పడినవారు.

(6) శ్రీచక్రమును పూజించువారు "నవావరణపూజ" యను దానిని విశేషముగ నాదరించెదరు.

(7) నవచక్ర సంస్థితాయైనమః "అనుచు రాజరాజేశ్వరీదేవి నవచక్రములపై నధిష్ఠించెనని నిశ్చయించెదరు.

(8) గౌరీమిమాయ సవిలాని తక్షత్యేకపదీ ద్విపదీ సాచతుష్పదీ అష్టాపదీ నవపదీ బభూవుషీ

సహస్రాక్షరా పరమే వ్యోమన్

అను వేదమంత్రముసైతము ఏకపదీ- ద్విపదీ - చతుష్పదీ అష్టాపదీ నవపదీ యను దానితో ముగింపబడెను. అంతకుమించిన దశపదీ-ఏకాదశపదీ మున్నగునవి వర్ణింపబడలేదు. కావున నవసంఖ్యయొక్క మహిమను బాగుగ నెరింగినవారు భారతీయులైయుండిరి.

అనాదినుండి లభ్యమైయున్న దుర్వాసన లన్నియు నశించినవి యగుచు నూతనంబగు పరిణామ మేర్పడవలెననిన – నీ తొమ్మిదవ మెట్టునకు జీవాత్మ రావలసియుండును.

నూతనమైనదానిని దర్శింపజేయునది

తొమ్మిదవసంఖ్య యని యెరుంగుడు. తొమ్మిదియందు నూతనత్వము లభించునని భావము.

తొమ్మిదిని సంస్కృతభాషలో "నవ" యనుచుందుము. అటులనే – నూతనము అనుదానినికూడా | "నవ" యనుచుందుము.

నవసంఖ్యకు సంబంధించియున్న సోపానము (మెట్టు) న జేరి నపుడు జీవునిమనసుకూడా పూర్వస్థితిని మార్చుకొని నవస్థితిని (క్రొత్తదశను) అనుభవింపగలదు. ఈరీతిగ ఆ నవశబ్దము – ఈ నవ శబ్దముగా మారిపోయినదై భిన్నార్థమును సూచించియున్నది. మన సును మార్పుజేసికొని నూతనంబగు మనసునునిల్పుకొనినగాని జీవుడు ముక్తుడు కాజాలడని హిందుమతసిద్ధాంతము. ఆ మనసును శుద్ధిచేయు టకై యేర్పడినదే

(1) కర్మకాండ.

శాస్త్రీయకర్మలచే మనశ్శుద్ధి కల్గునని భావము.

(2) భక్తికాండ

ఎపుడు మనసునందున్న లేనిపోని కోర్కెలన్నియు వెనుకంజ వేయునో అది మొదలు దేవునియందు మనసు నిల్పుటకు శక్తురాలు కాగలదు. ఎంతయోకాలము భక్తిభావనలలో మునిగి మునిగి కడ తేరినగాని అటుపైనున్న మెట్టు గోచరింపదు.

(3) జ్ఞానకాండ.

దానినే జ్ఞానమనెదరు. అట్టి జ్ఞానదీప్తియేర్పడినగాని అజ్ఞానమంతయు నశించిపోజాలదు. అంతట ముక్తులు కాగలరు.

(9) నవరంధ్రములు. ఇవి మనదేహముననే నెలకొనియున్నవి సర్వ సంసారబంధమునకు మూలకారణములు ఈ నవరంధ్రములేయని యెరుంగుడు. వానిచే నార్జింపబడిన పాపరాసులు నరులకు బంధ హేతువు లగుచున్నవి.

| | |
|---|---|
| నేత్రరంధ్రములు రెండు | 2 |
| శ్రోత్ర (చెవి) రంధ్రములు రెండు | 2 |
| నాసికా (ముక్కు) రంధ్రములు రెండు | 2 |
| ముఖ (నోరు) రంధ్రము ఒకటి | 1 |
| మలవిసర్జన రంధ్రము ఒకటి | 1 |
| మూత్ర విసర్జనరంధ్రము ఒకటి | 1 |
| | 9 |

ఇవియన్నియు మనదేహమున నిల్చినవై పుణ్య పాపములం జేయించుచుండును.

ఇంతయేల? నవతత్వవేత్తలు నవవిజ్ఞానద్రష్టలు నవనవోన్మేష మును పొందిన బుద్ధిబల సంపన్నులు భారతీయులైయుండిరి.
పాఠకమహాశయులారా !

ఆ తొమ్మిదవ సోపానమునజేర్చుచు ఆపైనున్న పరిపూర్ణ బ్రహ్మమునం దైక్యమును చేయింపగల మతమే భారతీయులమతము.

## క్రైస్తవమతము

హిందుమతమునకు క్రిందిమెట్టున నున్న మతము క్రైస్తవులకు సంబంధించి యున్నది. అది యేడవ సంఖ్యతో వలరారు చుండెను.

వారుకూడ హిందువుల వలెనే పరలోకమున కేగెద మను చుందురు. ఆ తావున దేవదూతలు కలరని వారి విశ్వాసము. ఏడవ ఆకాశ మందున్న నాతండ్రీ! యనుచు తమ దేవుని సంబోధించు చుందురు. వారి దేవుడు కూడ దేవదూతలకు ప్రభువై యున్న కారణమున నా పరలోకమందే దేవదూతలకు సమీపమున నివసించు చుండును. ఆ దేవదూతలు నివసించు పరలోకము మేఘమండలమున పై భాగమందు నిల్చియుండునని బైబులు నందు కలదు ఇంతకు మించిన వర్ణనము వేరుగా నా గ్రంథమున లభ్యము కాజాలదు. మంచిది, ఆ విషయమై హిందుమతమున నొకింతయైనను నుదహరింపబడలేదా? యని ప్రశ్న కలుగవచ్చును. లేకేమి, హిందుమతమున సైతము దేవదూతలు వర్ణింపబడిరి. వారికి మరియొకపేరు దేవయోనులు.

అనగా దేవతలు కారణముగా కల్గిన వారు దేవయోనులని యర్థము. యోని శబ్దమున కర్థము సంస్కృతభాషలో కారణము. దేవ దూతలు జన్మించుటకు కారణము దేవతలైనందున దేవదూతలను దేవయోనులు అనుచు కీర్తించియుండిరి.

ఒకమారు సంస్కృత నిఘంటువు అను అమరమును గాంతము. దానిలో నారంభమున దేవతలం గూర్చి వర్ణింపబడినది. అటుపైన దేవయోనులను గూర్చి వ్రాయబడి యుండెను.

వారియందున్న వివిధ తరగతులం గాంచుదు.

శ్లోకము ;

విద్యాధరో = విద్యాధరులు
ప్సరో = అప్సరసలు
యక్ష = యక్షులు
రక్షో = రాక్షసులు
గంధర్వ = గంధర్వులు

కిన్నరాః = కిన్నరులు
పిశాచో = పిశాచములు
గుహ్యక = గుహ్యకులు
సిద్ధో = సిద్ధులు
భూతో = భూతగణములు
ఆమీ = వీరెల్లరు
దేవయోనయః = దేవయోను లనబడెదరు.

(అమరము ప్రథమకాండలో దేవవర్గు)

ఈ దేవయోనులనువారు దేవతలచే సృజించబడియున్న కారణమున మరియు దూతలుగా నియమింపబడి యుండుటచేతను, ఆ దేవతలుండు లోకమునకు క్రిందిభాగమున నలరారుచున్న భువర్లోకమందు నివాసముల నేర్పరుచుకొనియుండిరి. ఈ క్రింది పటమును చూడుడు.

---

ఇదంతయు పరమపదము. ఇందు ఎవ్వరును వసించి యుండరు. అయితే నిరాకారస్థితి యందున్న దైవము మరియు నిరాకారస్థితిని పొందినవారును దీనియందంతటను వ్యాపించియుందురు. ఆ తావునందంతయు నిరాకారమే యుండునని భావము.

---

దాని క్రిందిది యిది హిందువుల పరలోకము.

ఇందు దేవతలుందురు.

---

ఇది క్రైస్తవుల పరలోకము.

ఇందు దేవదూతలు కలరు.

---

యిది భూలోకము.

ఇందు మానవులుందురు.

---

పై నరులలో

(1) దేవతలకు నాయకుండగు హిరణ్యగర్భునిచే సృజింపబడినవారును,

(2) దేవదూతలకు నాయకుండగు యెహోవా అనువానిచే సృజింపబడినవారును, అగు మానవులు కోటానుకోట్లుగానుందురు.

ఈ రీతిగా పైవారు రెండు తరగతులై యుండిరి,

(1) దేవదూతలచే నివసింపబడు లోకమును పరలోకమని క్రైస్తవు లనుచుందురు.

(2) దేవతలు వసించుచున్నలోకము పరలోకమని హిందువుల నిర్ణయము. సూర్యమండలము - దానిపైనున్న చంద్రమండలము - మరియు నక్షత్రమండలములు ఇవియన్నియు హిందువుల పరలోకములు.

ఆ పైన బ్రహ్మలోకము - విష్ణులోకము - శివలోకములు ఉండును. అచటినుండి రెండుచీలికలుగా నేర్పడిన రెండుమార్గములు కలవు. ఈ క్రిందిపటమున వానిం గాంచవచ్చును.

పరమపదము అను పరంధామమందు అనగా కేవలమై వెలయు కైవల్యమందు ఒకరినొకరు చూచువారుగాని, చూడబడువారు కాని లేనందున అద్దానిని లోకమని వ్యవహరించుటకే వీలుకలుగదు. ఎందేని యొకతావున ఆ పరమపదము సైతము ఒక లోకమేయని వివరింపబడినను - అజ్ఞులను సంతృప్తి పరచుటకుగాను ఆ రీతిగ నుదహరింపబడియుండును. అంతియేగాని, అది లోకము కానేరదు. మనహృదయములయందును అది వ్యాపించియున్నది.

కావున లోకములు అనునవి సదాశివలోకమునుండి లేదా దేవిలోకమునుండి యారంభమగుచుండును.

1. సదాశివలోకము — 1. దేవీలోకము.
2. ఈశ్వరలోకము — 2. గోలోకము (శ్రీకృష్ణుని నివాసము)



3. శివలోకము
4. విష్ణులోకము
5. బ్రహ్మలోకము
6. ఇంద్రచంద్రాదులుండు దేవలోకములు. వీనినే స్వర్గలోకము లందురు.
7. భువర్లోకము. ఇందు గంధర్వులు, సిద్ధులు, భూతగణములు మున్నగువారు వసింతురు.
8. ఇది భూలోకము.

మనము భూలోకవాసులము. అలోకము అను పరమపదము ఒకటి యుండెననుకొందము. దాని నాధారముగ జేసికొని ఒకదాని వెంట నొకటి _ యొక్కొక్క లోకము ఉత్పత్తియగుచువచ్చెను.

(1) అందులో మొదటిపరలోకమును సదాశివలోకమనెదరు. దీనికి సూటిగా రెండవ వైపున దేవీలోకముండును. అవి రెండును జేరి ఒకేలోకముక్రింద పరిగణింపబడును.

(2) రెండవ పరలోకము ఈశ్వరలోకము. దానికి సూటిగా రెండవ వైపున గోలోకముండును. అందు శ్రీకృష్ణ

పరమాత్మ దేహధారియై వ్యవహరించును. ఈ రెండును ఒకే లోకము క్రింద పరిగణింపబడును.

(3) మూడవపరలోకము శివలోకము.

(4) నాల్గవది విష్ణులోకము.

(5) అటుపైన బ్రహ్మలోకము పుట్టెను.

(6) అనంతరము దేవలోకము.

అనగా సూర్యచంద్ర నక్షత్రాది మండలములతో విలసిల్లు స్వర్గము నిర్మింపబడెను.

(7) స్వర్గము సృజింపబడిన పిమ్మట దానిక్రింద - భువర్లోక మేర్పడెను. ఆకసమునందు క్రిందికి వచ్చుచున్నకొలది యేడవ ఆకాశమున భువర్లోకము సృష్టింపబడెనని విశదమగుచున్నది. అది దేవదూతలకు అనగా దేవయోనులకు నివాసమై యుండును. కనుకనే క్రైస్తవులు ఏడవ ఆకాశమందున్న నాతండ్రియని తమదేవుని సంబోధించుచుందురు. హిందువులకా దేవుడు చాలడు. వారికి 8, 9, ఆకాశములయందు వసించుచున్న దేవుడు కావలెను.

ఈ రీతిగ సత్యమును వెల్లడించునపుడు - ఎవ్వరును ఈర్ష్యాసూయలను పొందరాదని మనవి.

ఒకమారు ఈ క్రింది పటమును అర్థముచేసికొందము.

---

ఇదంతయు ఖాళీ ప్రదేశము.

దీనినే పరమపదమనెదరు.

---

సదాశివలోక — దేవీలోకము

ఈశ్వరిలోకము — గోలోకము

శివలోకము.

విష్ణులోకము.

బ్రహ్మలోకము.

| | |
|---|---|
| ... ... ... ... ... ... ... ... | సూర్యచంద్ర నక్షత్రములతో |
| ... ... ... ... ... ... ... ... | రాణించుచున్న దేవలోకము |
| ఇవి హిందువుల పరలోకములు | |
| ... ... ... ... ... ... ... ... | ఇందు దేవతలుందురు. |
| ... ... ... ... ... ... ... ... | |

ఇది క్రైస్తవుల పరలోకము — భువర్లోకము ఇందు దేవమాతలు వసింతురు.

భూలోకము. ఇందు మానవులుందురు.

సూర్యచంద్ర నక్షత్రాదుల లోకములను సామాన్య దృష్టితో పరలోకము లనుచున్న — ఆపైన నలరారుచుండు త్రిమూర్తుల లోకములును అటుపైన నెలకొనియున్న ఈశ్వర సదాశివ గోలోక. దేవిలోకములును హిందువుల దృష్టిలో పరలోకములుగనే ఎన్నబడు చుండును. అంతకును మించినది పరమపదము — లేక పరంధామము అనునది మోక్షమై యుండును. అది లోకము కాకున్నను పరాత్పర లోకమనియు పరలోకమనియు నెల్లరిచే పిలువబడుచుండును,

(10) పరమపదమును పదియవ లోకమనియు

(9) పరలోకముల నన్నిటిని రెండుగా విభజించి అందొకటి 9వ పరలోకమనియు

(8) మిగిలినది ఎనిమిదవ పరలోకమనియు

(7) భువర్లోకసంబంధమగు దేవదూతల పరలోకము ఏడవది యనియు నిర్ణయింపబడెను. ఈ విషయమును చదువరులు గుర్తు వుంచుకొనవలెను.

హిందువులు విశేషముగ తొమ్మిదిని ప్రేమించుచుందురు. ఎందుకన వెంటనే దాని ప్రక్కననున్న పదియవలోకమునకు బోవచ్చు నని వారి నిర్ణయము. క్రైస్తవులు దేవదూతలను గూర్చి విశేషముగ ప్రసంగించుచుందురు. దేవతలమాట వినినవెంటనే కడుపువ మంట పుట్టును. వారి దేవుడు కూడా దేవతలను అసహ్యించుకొనుచుండును. కనుకనే దేవతామందిరములను ప్రతిమలను మరియు దేవతలం బూజించువారిని - జంపుడని యాజ్ఞాపించియుండెను. వ తబైబులు నందు ద్వితీయోపదేశకాండలో అవిషయము జూచుకొనవచ్చును

క్రైస్తవుల మాగము ఏడవసంఖ్యకు సంబంధించియుండె ననియు – హిందువులమతము తొమ్మిదవయంకెకు జేరియున్న దనియు విజ్ఞులు గుర్తించెదరుగాక.

ఏడవతరగతిని మించినది కాదా తొమ్మిదవ తరగతి? ఇంతటితో నీ గ్రంథము పరిసమాప్తి చేయుదము.

"బోలో నవభారత్ కు జయ్"

నవసంఖ్యకు సంబంధించియున్న వ్యక్తులు భారతీయులు.

సప్తసంఖ్యమునకు (ఏడవఅంకెకు) జేరి యున్నవారు క్రైస్తవులు అను విషయమును పాఠకులు మరువకుందురుగాక. ఏడవతరగతి విద్యార్థులకు తొమ్మిదవతరగతిలోని పాఠములు అర్థమగుట యసం భవము. కావుననే హిందుమతమున నంతరార్థము లున్నవని తెలపిన పుడు - క్రైస్తవులు - తామడిగిన ప్రశ్నలకు జవాబు చెప్పజాలక అంతరార్థము లున్నవని తెల్పుట హిందువులకు పరిపాటియైనదని యాక్షేపించుచుందురు.

ఆ రీతిగ తాము అంతరార్ధములం జెప్పుకొనుచుండురను విషయమును మరచియున్నారు.

పూర్వకాలమున రచింపబడిన గ్రంథము లందుగాక - ఈ నడుమ వెడలిన గ్రంథ రాజములు సైతము అంతరార్థములతో విలసిల్లుచున్నవి. ఉదాహరణముకై ఆంధ్రదేశములోని ఒకానొక యోగిపుంగవుని పద్యములం జూతము.

"చీరగట్టి రాత్రి సిగ్గును నెరిగియు
పగలు చీరెవిడిచి పనులుసేయు
చేడె కాదుర సుది చేవాడకత్తెరా
విశ్వదాభిరామ వినుర వేమా!

పై పద్యము విన్నవెంటనే పాఠకులకు ఆశ్చర్యమొదవును. చూడచూడ పై కథ-కుంతియు నసభ్యముగా దోచును. లోకమునందెవ్వరును అట్టి పనిని చేసినవారలుండరు. ఇట్టి యసంభవమగు విషయమును వేమనయోగి యెటుల వర్ణించియుండెనో తెలుపజాలకున్నాము. అందువలననే ఆ పద్యమునకు విధిగా అంతరార్థమొకటి యుండునని నిర్ణయించుకొనవలెను.

బాహ్యార్థమును వినుడు.

ఒకానొక వనిత యుండెనట. ఆమెకు సిగ్గు సైతము కలదట. అయినను ఆమె చీరె విప్పుకొని పగటికాలమున పనులను చేయుచుండెనట. రాత్రియందు మాత్రము చీరె కట్టుకొనియుండెనట. ఇది బాహ్యార్థము.

ఇట్టి పద్యములింకను కలవు.

చిన్నది యెలబ్రాయంబున
గన్నది పతిలేక సుతుని కడుచిత్రముగన్
ఎన్నడురతికేళెరుగదు
చన్నియక పెంచె నెవతె జగమున వేమా!

ఒకానొక పడుచుపిల్ల యున్నదట. ఆమె పతిని పొందకయే సుతుని కన్నదట. ఆ బిడ్డను పెంచవలెను కదా! తన రొమ్ము అతని

నోటిలో పెట్టకనే పెంచియుండెనట. ఆ స్త్రీ యెవతె. అని వేమన ప్రశ్నించియున్నాడు. అట్టి వనితలు యీ లోకమున నుండరు. ఐతే యోగిపుంగవుడు హాస్యముగ బల్కెనా? కాదు. అంతరార్థమును జూచినయెడల నట్టి వనిత మన యెదుట సాక్షాత్కరింపగలదు!

పై పద్యములకును యింకను మరికొన్ని పద్యములకును రాబోవు గ్రంథమున అంతరార్థములు వ్రాయబడగలవు!

భారతీయులారా! నాలుగయిదు మాసములలోనే ఆ గ్రంథము ముద్రింపబడును. ద్రౌపదికి ఐదుగురు భర్తలుండిరా? అందుకు అంతరార్థములెట్టివి? కుంతీదేవి భర్తను పొందక నన్యులవలన పంచపాండవులను కనెను. అది దోషమయియుండదా? సూర్యదేవుడు కుంతిని పొందనిది పుత్రుడు పుట్టెనా? దేవుడంతటివాడు కాములోలుడగుచు పరస్త్రీని పొందుట న్యాయమగునేమి? ఇవియు రాబోవు గ్రంథమున నుదహరింపబడు ప్రమాణములతో రాణించుచుండును.

ఆ గ్రంథము సైతము నూరుపేజీలతో నుండును.

వలయువారు వెంటనే

జాబు వ్రాయవలయునని

ప్రార్థన

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

---

చిరునామా :

హిందుమత గ్రంథమాల మానేజరు,

సత్యనారాయణపురం - విజయవాడ-౨.

కృష్ణాజిల్లా,



# మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | RCHB02R309 |
| పుస్తకం పేరు | హిందు మతము దైవమతము |
| తారీఖు | 19/3/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 201 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CL, 101 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Nandini |
| పేజీలు విడదీసినది | Nandini |
| స్కాన్ చేసినది | pragathi |
| పరీక్ష చేసినది | RAKSHITHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |